# విషయానుక్రమణిక

## మే, 1947





స్నానఘట్టము

చిత్రకారుడు : శ్రీ సుధాంశుకుమార రాయ్



సంపుటము 24
సంచిక 5

భారతి

మే 1947
సర్వజిత్తు, వైశాఖము

# దర్శనారము

— శ్రీ తలమర్ల కళానిధి

పరిమళమ్మును గురియించు విరుల దరిని
చిగురుగాలులు లాలించి సేదదీర్ప
పాడు హృదయమ్ము నిన్నెడబాయలేక
గాఢనైరాశ్యమున మున్గు కలత జెందు.
ఏకతమ నిశివేళలో సైకతమున
ఘోరనైరాశ్యలహరిని దొరలి దొరలి
చదల నలమిన జలధరచయము రాల్చు
జలకణంబుల దిలకించి, జాలువారు
బాష్పకణముల దోసిట బట్టి నీదు
దర్శనార్థము వేచి తీ తటములందె !!

---

# హృ ద య శ క ల ము



= శ్రీ స  నా రా య ణ రా వు =

గడచినయట్టి పావనయుగమ్మున గూడ పునీతమౌచు దో
చెడి యపురూపమందలి విశేషము పొందగ కష్టమోర్చి నే
పిడికిట బట్టుకొంటిని సుమీ! మలినంబు నశించె-నింక నీ
కడిగిన గుండెలో సుధలె గార్చెదొ! నెత్తురె చిల్కరించెదో!!

నేను రచించుకొన్న నవనీతపు విగ్రహమున్ త్వదీయ వి
జ్ఞానపు మందిరాన నిడి సంతస మందితిగాన నీవు నా
మానససీమనుండి తెగిపడ్డ ఫలంబు జగాన నిల్పగా
బూనెదొ! నాపయిన్ కినుకబూని విసర్జన చేసెదో! ప్రభూ!

ఆశల పంటకై యసువు లర్పణచేసిననాడు నీవు నీ
లో నగపాలు జీవనపు రోచుల నిచ్చెద వంచు నమ్మి నా
యాశలు పొంగిపోయెను - ప్రయాసకు డెందము కందలేదు - దీ
తా సమయాన యోచనవికాస మొనర్చెదొ! మానెదో! ప్రభూ!!

కరగిన జీవితమ్మున వికారనికాయము గోచరించి చూ
పరునకు నీసడింపులకు పాలగు నొక్కొక దుర్దినానలో
పెరిగిన దుఃఖభావముల పీల్చెడి నెత్తుటిబొట్టు నొక్కటిన్
సిరిగల కాలమందున స్పృశింపని నిర్దయ దాల్తువా? ప్రభూ!!!

చాలయ్యా తెరచాటు గానము మనశ్చాంచల్యమై పోయెనే
మేలైనన్ ఇదమిత్థమంచనక నమ్మించావు-ఏనాటికిన్
నీలో జాలికి తావు కన్పడదు!!—సందేహింతు వేలా ప్రభూ!
ఈ లోకాన మహాపగల్ తరుచు పోయేదారి చూపించగా!!

---

# ఆంధ్రకవుల ఆదర్శములు

## ౧. అమాత్య తిక్కన

### శ్రీ నోరి నరసింహశాస్త్రి

శ్రీమదాంధ్ర మహాభారతము రచించిన కవులు ముగ్గురికి కవిత్రయ మను పూజ్య నామము ఆంధ్ర లోకమునం దంతట ప్రసిద్ధిలోనికి వచ్చినది. మరియు వారితర గ్రంథములను రచించినను మహాభారతమునే పరమప్రమాణముగా గ్రహించుట శబ్దవేత్తల వృద్ధాచార మైనది. చిరకాలముగా నాంధ్ర పండిత లోకములో కవిత్రయమునకు సమానమైన గౌరవము స్థిరపడినందున వారిలో తారతమ్యము లెన్నబూనుట అట్టి ప్రయత్నము చేయువారి అజ్ఞానమునే ప్రకటించును. వారు ముగ్గురును త్రేతాగ్నులవలె పవిత్రమూర్తులు. వారి వైదికధర్మ తత్పరతయే మార్గదర్శకముగా నుండి ఆంధ్ర కవిత్వమునకు సంస్కృతి గౌరవము అధికముగా చేకూర్చినది. ఆంధ్ర కవిత్వము అవతరించుటకు పూర్వమే అనేక కావ్యములు పుట్టిన కన్నడాది భాషలలోని ప్రసిద్ధకవుల మార్గములతోను, అనంతరము పుట్టిన మహారాష్ట్ర వంగాది భాషలలోని ప్రసిద్ధకవుల మార్గములతోడను ఉత్తమాంధ్రకవుల మార్గములు పోల్చినచో విశేషభేదము గోచరించును. ఆంధ్ర కవిత్వమునకు ఋషిమూర్తులైన కవిత్రయము పెట్టిన వరవడి తప్పి, ఎప్పటికప్పుడు కర్ణాట మహారాష్ట్ర ద్రావిడభాషాదుల కవిత్వమార్గములు చూచి వ్యామోహముతో అనుకరించుచు, మరల ఆంధ్ర కవిఋషి మార్గము చూచుకొని సరిదిద్దుకొనుటయే ఆంధ్ర కవిత్వచరిత్రలో ప్రధానసూత్రమని తద్జ్ఞులకు గోచరింపక మానదు. మాకున్న ముప్పదేండ్ల సాహిత్యానుభవములోనే వరుసగా ఇంగ్లీషు, వంగ, హిందీ, సోవియటు రష్యాల వాఙ్మయములు ఆంధ్ర కవుల నెంతగా ఆకర్షించుచున్నదియు కన్నులార కాంచుచున్నాము. కాని ఉత్తమాంధ్రకవు లందరు నేటివరకుగూడ కవిత్రయమువారి ఆర్షదృష్టి అలవరచుకొన్నవారే అని ఘంటాపథముగా మేము చెప్పగలము!

అట్టి మహాభారతములో ఎక్కువ భాగము రచించినది తిక్కన సోమయాజి. అతడు "భక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చు మెచ్చు భద్రాయితమూర్తియైన పరతత్త్వమును, సకల బ్రహ్మమును" ఉపాసించువాడు. అతని పితృపాదులగు కొమ్మనామాత్యుడు 'సాంగవేదవేది'; భగవంతుడా కవికి కలలో "వైదికమార్గనిష్ఠ మగు వర్తనముం దగ నిర్వహించుచున్ భేదములేని భక్తి...తత్పరభావము కల్మి...కావ్యరసముం గొనియాడుచు నుండు దెప్పుడున్" అని చెప్పినాడు. అతడది 'పరమ ధర్మ ప్రకారం'బని 'సాత్యవతేయ సంస్మృతి శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీక్షావిధి నొంది...పుణ్యప్రబంధంబు' ప్రారంభించినాడు. మరియు నా భారత మెట్టిది?

"విద్వత్సంస్తవనీయ భవ్యకవితా
వేషుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుడు సంయమిప్రకర సం
భావ్యాను భావుండు కృ
ష్ణద్వైపాయను డర్థి లోకహితని
ష్ఠం బూని కావించె, ధ
ర్మాద్యైకతస్థితి భారతాఖ్యమగు లే
ఖ్యంబైన యామ్నాయమున్."

* ఈ శీర్షికతో తెలుగుకవులు వారి కావ్యములలో పలికిన వాక్యములను ఆధారము చేసికొని వారి కవితాదర్శము గ్రహించుటకు ప్రయత్నించుచున్నాము. నో. న. శా.

"వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహు పురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా
మూడల ధర్మార్థ కామమోక్షస్థితికిన్."

ఇట్టి పీఠికారచన చేసి విరాటపర్వాదిగా మహాభారతము పూరించిన తిక్కన సోమయాజియు, నిర్వచనోత్తర రామాయణ కర్త యగు తిక్కనయు నొక్కరా?—కాదు! ఒకడు సోమయాజి తిక్కన; ఒకడు అమాత్య తిక్కన. ప్రాకృతదృష్టికి కనబడు దేహము వారిద్దరి దొక్కటియే కాని, తత్త్వదృష్ట్యా వారిద్దరు వేరు. ఇది పలువురు గమనించక తిక్కనామాత్యుని ఆదర్శములు తిక్కన సోమయాజికి అంటగట్టి పులిమిపుచ్చుచున్నారు. శబ్దరత్నాకరకారులు నాల్గవ తరగతిలో వేసిన కంకంటి పాపరాజు రచించిన ఉత్తర రామాయణమును, తిక్కనామాత్యుని ఉత్తర రామాయణమును చదివిన రసికులు పెక్కురు పాపరాజుకృతినే ఎక్కువ అభిమానించుట ఎరుగుదుము. కవులలో ధాన్యాదులలోవలె తరగతులు వేయుటయు, ఎక్కువ తక్కువలు సూక్ష్మముగా నిర్ణయించుటయు మా కంత సమ్మతము కాదు. ఐనను పాపరాజుకృతికి తిక్కనామాత్యుని కృతికంటె విశేషవ్యాప్తి తెలుగుదేశములో నుండుట మనము మరచుట సాధ్యము కాదు. సోమయాజి తిక్కన మహాభారతము ప్రారంభించునాటికి ఎట్టి పరిణతి పొందెనో, నిర్వచనోత్తర రామాయణము రచించిన అమాత్య తిక్కన ఆదర్శములు పఠించినచో మనకు ద్యోతము కాగలదు.

నిర్వచనోత్తర రామాయణము రచించిన తిక్కన తాను అమాత్యుడనని గ్రంథములో ఎక్కడను చెప్పకొనలేదు. కాని అతడు 'మంత్రి భాస్కరుని' మనుమడు; 'కొమ్మనామాత్యుని పుత్రుడు'. మరియు మనుమసిద్ధి యాస్థానమున నుండి యతనిచే 'మామ' అని పిలిపించుకొనినవాడు. ఇన్నిటిని బట్టి అతని నామము చివరగూడ అమాత్య శబ్దము కలుపుచున్నాము కాని అతడు మాత్రము 'తిక్కాంకుండ', 'తిక్కన నామధేయ' అని మాత్రమే చెప్పకొన్నాడు. కాని అమాత్య శబ్దము చేర్చి మనము వ్యవహరించుట అసమంజసము కానేరదు.

ఈ తిక్కనామాత్యుని మతమున కావ్యనిర్మాణము ప్రధానముగా 'శిల్పము!'

"అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢి
శాటించు శిల్పమునం బారగుడం గళావిదుడ."

ఇట్లతడు కావ్యశిల్పమునందు పారగు డనియే కాక 'కళావిదుడ' ననికూడ చెప్పకొన్నాడు. ఉత్తమ కావ్యసృష్టి శిల్పమును, కళయును కాకపోదు. అయితే కేవలము శిల్పకళ గల కావ్యము ఉత్తమకావ్య మనిపించుకొనదు. కాని అమాత్యతిక్కనకు శిల్పమే కావ్యదర్శము!

కావ్యధోరణిలో నొకచోట నత డున్న శబ్దములను బట్టి ఇది మేము చేయు దూరార్థకల్పన కాదు. 'కృతికర్తృనియమము' లని గ్రంథాదిలో నాతడు పండ్రెండు పద్యములు చెప్పినాడు. వానియం దంతటను ఈ భావమే ద్యోతము కాగలదు.

ఎఱ్ఱయ కవిబ్రహ్మను వినుతించుచు-
"తన కావించిన సృష్టి తక్కొరులచే
తంగాదు నానాముఖం
బున దా బల్కిన పల్కు లాగమములై
పొల్పొందు నావాణిభ
ర్తను నీతం డొకరుండు నాజను మహా
త్త్వాప్తిన్ గవిబ్రహ్మనా
వినుతింతున్ గవి తిక్కయజ్వ నఖిలో
ర్వీదేవతాభ్యర్చితున్"

అని వర్ణించినదానిలో హరివంశకారుని కట్టి ఉన్న తకవితాదర్శము లున్నదియు గోచరించును. అందాతడు ఉగ్గడించినదియు 'కవితిక్కయజ్వ' కాని, 'కవి తిక్కనామాత్యుడు' కాదు. పూజ్యులకు ఎఱ్ఱయ ఇంతముగా పేరొక్కనిన తిక్కన నిర్వచనోత్తర రామాయణములో తన కృతినియమము లేమని చెప్పకొన్నాడు?

"ఇంపారెడు పల్కులం బదయ
నప్పలుకు ల్గరిపచ్చునట్లుగా
జేరుపనేరగావలయు
జేసెద నే గృతి యన్న వారికిన్"

ఇది చిత్రకారులయు, శిల్పులయు కళకూడ కాదు! అంతకంటెను హీనమగు పుష్పమాలాకారుల నైపుణ్యము!

'తెలుగుకవిత్వము చెప్పం
దలచిన కవి యర్థమునకు దగియుండెడు మా
టలుగాను'

చిత్రకారుడు రంగులు, కంచెలు ఏరుకొన్నట్లే కవి మాటలు 'ఏరుకొను'నట! వాగర్థముల అన్యోన్యాశ్రయత్వముగాని, అభేదముకాని ఈ కవికి హృదయములో రూఢిగా లేదు!

మరియు నితనికి వళులు, ప్రాసములు నిలుపుట ముఖ్యము. కావ్యస్థూలశరీర నిర్మాణమునకు సంబంధించి నదియే ఇదియు! మహాకవి యతిప్రాసలు పద్యములలో నిలిపెడ ననుట విశేషమా!

'సంస్కృతశబ్దము, తెలుగుబడి విశేషణంబు
కేటపడంగా బలుకునెడ లింగవచనంబులు
భేదింపమి'

ఇతనికి కావలెను.

'ప్రాత్యముగామి నొప్పయిన సంస్కృత మెఱ్యొడ జొన్పు'నట!

మరియు-

'గద్యముతోడుగ జెప్పి పెట్టను'

'ప్రాసము ప్రకారము వేఱు నక్షరంబులన్
ప్రత్యనురూపమం చిడను'*

మరియు,

సరసమధురవచోగుంభన ప్రసాదసంభోకన
గోచర బహువిధార్థతాత్పర్యముగాన్'

అనుచు వచోగుంభనపై ఎక్కువ అభిమానము కనపరచి నాడు. అట్లనుచు తుదకు—

"అలతి యలంతి తునియలు గాహలసంధించిన
విధంబు నమరగవలయున్!"

ఈ పద్యములో 'కాహలసంధించిన విధంబు' అనియు, 'హలసంధించిన విధంబు'అనియు రెండు పాఠము లున్నట్లు తోచును. రెండవపాఠము మాకర్థము కాక, 'కాహలపాఠ' మంగీకరించినాము. చిన్న ముక్కలు కూర్చి ఒక వాద్యవిశేషము నిర్మించినట్లుగా పదపద్యంబులతో కావ్యము అమర్చవలె నని తిక్కనామాత్యుని ఆశయ మైనట్లు దీనివల్ల స్పష్టము! చిత్రకారుడు - శిల్పి - మాలాకారుడు - చివరకు కాహల ఘటకుడు - శబ్దగుంభనచతురుడు—ఇట్టివారిలో నొకనిగా కవినిగూడ తిక్కనామాత్యుడు భావించినట్లు ద్యోతమగుచున్నది!

కావ్య మొక కళయే అను భావము మరియు నక్కడక్కడ గోచరించును. కలకాలభూవిభుని వర్ణించుచు—

'సకలవిద్యాపరిశ్రమము దెల్పగనేల
కవిసార్వభౌమాంక మవనిజెల్ల!'

అనియు, శ్రీరాముని వర్ణించుచు నట్లే 'సరస సాహిత్య వేదియై'యని, వెంటనే 'సకలకళల నెరిగి'అని వర్ణించినాడు. ప్రథమాశ్వాసాంతములో మనుమసిద్ధిని 'కళాస్ఫారుండు' అని, 'పౌలస్త్యుండు...... నిర్మలకళాస్ఫారీభవన్మూర్తి'అనియు పలికినాడు. ఆది కావ్యశ్రవణ సందర్భమున గూడ-

'అభినవాకృతియగు కృతియగుట జేసి
యాత్మ గౌతుక మంతంత కగ్గలింప
నమ్మునీశ్వరు చెప్పిన యాదికావ్య
మయిన రామాయణము చెవులార వినుచు.'

ఇట్లు 'కృతి' యని 'కౌతుకప్రద' మనియు నే ముఖ్యముగా వర్ణించినాడు. శ్రీరాముడు 'ఈ ప్రబంధ మేమునికృతి' మన్నాడట!

ఇంతియ కాదు! కుకవినిందలో వారిని దుర్వ్రీటులతో నిట్లు పోల్చినాడు:

---

* ఈ నియమభంగము ఒక్కచోట మాకు గోచరించినది.

"పలుకుల పొందులేక రస
భంగము చేయుచు బ్రాతవడ్డ మా
టల దమ నేర్పుచూపి యొక
టన్ హృదయం బలరింపలేక యే
పొలమునుగాని యట్టి క్రమ
ముం దమ మెచ్చగ లోకమెల్ల న
వ్వుల బొరయం జరించు కుక
వుల్ ధర దుర్విటు లట్ల చూడగాన్"

కాబట్టి కుకవులు దుర్విటులవంటివారు! మరి తిక్కనామాత్యుని దృష్టిలో సత్కవులు విదగ్ధవిటులా? అట్టి అభిప్రాయము తిక్కనకు అంటించుట మాకు సమ్మతము కాదు. కాని అట్టి సందేహమునే బలపరచు సందర్భములు ఎరికొన్ని కలవు!

కవి శిల్పులకు కవిత్వములో చమత్కృతి ప్రధానము. కవిత్వవిదగ్ధవిటులకు కవిత్వ మొక 'విలాసము'!

అమాత్య తిక్కనకు కవిత్వము ఒక విలాసము గను, కవులు రాజాస్థానములలో విలాసవస్తుకోటిలోని వారుగా పరిగణింప దగినవారుగను తోచుచున్నట్లు కూడ నిర్వచనోత్తర రామాయణము వల్ల తెలియుచున్నది!

కృతి ప్రశంస మొదటి పద్యములోనే తాను 'కవితా విలాస విస్తర మహనీయుడ' నని వర్ణించుకొన్నాడు. మరియు మనుమసిద్ధి, 'సరస బహుమాన విరచనాశాలి యనియు' తలంచి 'ఈ కృతికి దొడవుగా' మనుమసిద్ధిని చేసి వంశవర్ణన కుపక్రమించెను. ఆ మనుమసిద్ధి 'కరుణ దీనానాథ కవిబంధు జనచకోరములకు చంద్రాతపముగ జేసె'నదట! మరియు నతడు 'కవి హృదయ శుకప్రతతి సమాస్వాదనీయ రసికత వెలయన్' ఉదయించెనట! తృతీయాశ్వాసాంతములో నతనినే 'కవిలోక వన వసంతుడు' అనియు, షష్ఠాశ్వాసాంతములో 'కవీంద్ర మందార' మనియు వర్ణించినాడు. కవులిట్లు ప్రభువులను వర్ణించుట ఆచారమైనది. కాని తిక్కనామాత్యుడు అంతటితో నాగక తరుచుగా కవులను కావ్యసందర్భములలో విలాసవస్తుకోటిలో చేర్చినాడు!

కార్తవీర్యార్జునుడు 'సరసకవి విట విదూషక పరిహాసక గాయకాది పరిజనములతో' బయలుదేరినాడని వర్ణించి, వారినే నిర్దేశించుచు నావల, 'తరుణీజనము వినోదపు బరివారము మున్నుగ నడవబనిచి' అని ఒక్క మాటలో సరసకవులను విటులను ఇత్యాదులను 'వినోదపు బరివార'మని చేర్చి వేసినాడు. సరసకవుల ప్రక్కనే సహవాసముగా విటులను, విదూషకులను, పరిహాసకులను ఈ అమాత్యకవి చేర్చియుండుట గమనింప దగినది. వాల్మీకిని, వ్యాసుని కవులని పల్కిన నోట విట విదూషకులను ఎవరైనను బలుక సాహసింతురా, విటవిదూషక తుల్యులైన కవులను గాక!

అట్టి దొక్క కార్తవీర్యార్జునుడే కాదు. శ్రీరాముడు ఈ విధముగా నిద్రలేచెనట!

"రవికులోదయంబుకంటె మును
రాజశిఖామణి మేలుకాంచె దా
నవకులమర్దనాంకముని
నాదములైన సురంగగీతముల్
వివిధగతిప్రవర్తన న
వీనములై సొగయింప మాగధ
ప్రవరులు పాడు మంజుమృదు
భంగికి వీనులు వొత్తి మేల్కనన్."

ఈ పద్యములో సురంగగీతములు సొగయించిన వను వర్ణన గమనింపదగినది. కాని యీ పద్యములో భట్టుకవిత్వము వర్ణింపబడిన దని కొందర నవచ్చును. కాని ఆ తర్వాత రెండవపద్యములో కొలువున—

'కవులుం గవీంద్రులు నియోగులు వందిజనంబు లిష్ట భృత్యులు మొదలైన వారలు'

కొలిచినా రని వర్ణించి 'కవీంద్రుల' నెక్కడ చేర్చినాడో మనము ప్రత్యేకముగా పరిశీలింపవలెను. మరియొకచోట శ్రీరామునే 'మంత్రి భృత్య సుకవీశ్వరులాదిగ నెల్ల వారలున్ వచ్చి మహీశు గొల్చి'రని

వర్ణించినాడు. శ్రీరాముడు అగస్త్యుని దర్శించి అయోధ్యకు వచ్చి యచ్చట,

"సమయ కరణీయ కవిజన
సముదయగోష్ఠీ వినోద సారస్యాసం
గమున దగ బ్రొద్దుపుచ్చె
న్నమదిత చతురాల్ప పరిజనంబులతోడన్"

అని కవిజనుల చతురత శ్రీరామునికి వినోదము కలిగించి ప్రొద్దు పుచ్చుటకు-కాలయాపనకు-సాధనమైన దన్నాడు.

ఈ వర్ణనలలో తిక్కనామాత్యుని దృష్టిలో సామాన్యకవులు ఉన్నారని భావించవచ్చును. కాని ఆర్షమైన శ్రీమద్రామాయణమే ఆతని దృష్టికి అట్టిదిగా కనిపించినట్లు తలచుటకు గూడ నాధారము కలదు.

వాల్మీకి కుశలవులతో దానిని—

"గేయరసంబు నింపున న
కల్పితవర్ణములందు మాగధ
శ్రీ యలవడ్డ కోవిదుల
చిత్తము లార్ద్రత పొందునట్లుగా!"

పాడుడని చెప్పెనట! అట్టిది 'సరసధ్వని బాడగ' శ్రీరాముడు విని 'తదీయ రసానుగుణ ప్రకర్ష మభినందింపన్',

"తలచి మహీసులన్ మునుల
దమ్ముల బంధుల పత్కవీంద్రులన్,
గలల విదగ్ధులైన నట
గాయక వైణిక వాంశికాదులం
బిలువగ బంచి వైభవము
పెంపెసలారగ వారలెల్ల దన్
గొలువగ నా కుశీలవుల
కుం దగ దర్శన మిచ్చె—"

నట! ఆహా! పత్కవీంద్రుల వెంటనే కలల విదగ్ధులైన నటగాయకాదులు శ్రీరామ సభకు వచ్చినారు! ఇక ఆ కుశీలవు లెట్లు పాడిరి?

"రామ చరితంబు గేయాభిరామ మధుర
పదవిలాస మనోహార భావభంగి,
చతుర వాక్యార్థ సువ్యక్త సరసలీల
వివిధ గతి..."

ఇట్లు పాడగా ఎవరి దని యడిగెను. కుశలవులు దానిని—

'రసోల్లాస మధురమగు దీని'నని శ్రీమద్రామాయణమును గూర్చి చెప్పినారు. అందులో 'పదవిలాస', 'చతురవాక్య', రసోల్లాస' శబ్దములు మనము ముఖ్యముగా ముఖస్థము చేయదగినవి.

ఇట్టి 'విలాసకవి' కనుకనే శంబూకవధ ఘట్టములో మూలమునకు విరుద్ధముగా కథ కొంత మార్చి ఆధునికులకు అనవసరముగా కష్టము కలిగించినాడు. ఈ అమాత్యకవికి అక్కడ మూలగ్రంథములోని సూక్ష్మము ఎక్కలేదు.

నన్నయభట్టారకుని అనుకరించుచు తిక్కనామాత్యుడుగూడ తన కావ్యమును సంస్కృత శ్లోకముతో ప్రారంభించినాడు. కాని తెలుగుకవులకు కేవలము ఉపాస్యదేవత యగు 'శ్రీ' తిక్కనామాత్యుని ప్రథమ శ్లోకములో 'మనుమక్షితీశ్వరుని భుజాస్తంభము లోని సాలభంజిక' క్రిందికి దిగిపోయినది. అప్పటికి తిక్కనకు శ్రీ స్వరూపము మాటుపడియే యున్నదనుట కెట్టి సందేహమును లేదు!

ఏ జాతిలోనైనను క్షీణదశ ప్రారంభించిన పిమ్మట 'శిల్పకవులును', ఇంకను క్షీణించిన పిమ్మట 'విలాస కవులును' విశేషజనాదరపాత్రు లగుదురు. నేటి పాశ్చాత్య దేశములలో అట్టికవుల కున్న ఆదరమునుబట్టి ఆ దేశముల బలము క్షయోన్ముఖముగా నున్నదని అనుమేయించుట సత్యదూరము కాదు. భారతజాతి క్షీణప్రాయమైన నాటినుండియు కవులు విలాసప్రియులుగాను,నట విట తుల్యులుగాను ఉండవలెనను దురూహ వ్యాపించి మహాకవి కాళిదాసాదులకు

స్త్రీలౌల్యము ఆరోపించి కథ లల్లినారు. అట్లే తిక్కన కూడ తెల్లవారు జామున వారస్త్రీ గృహమునుండి వచ్చుచు రాజదూతలను జూచినట్లు మొదలగు నైతిహ్యము మన తెలుగుదేశములో అల్లినారు. ఆ ఐతిహ్యము కల్పించినవారి ఉద్దేశము నన్నయ కవనమునకు తిక్కన తమలపాకు తమ్మరంగు వేసినాడనియే కాని తిక్కన వేశ్యాలోలుపత వర్ణించుట కానేరదు. కాని ఆ కథాకల్పన చేసినవాడు నిర్వచనోత్తర రామాయణములోని తిక్కనామాత్యుని కవితా దర్శములు సూక్ష్మముగా పరిశీలించెనేమో!

ఈ చతుర కవి — శిల్పికవి — చిత్రకవి — విలాస కవి అగు అమాత్యతిక్కన సోమయాజితిక్కనగా నెట్లు మారిపోయెను? దానికి బీజ మేమైనను అమాత్య తిక్కనలోగూడ గోచరించునా?— నిశ్చయముగా గోచరించును!

'ఎత్తఱినైనను ధీరోదాత్తనృపోత్తముడు రామ ధరణీపతి సద్వృత్తము సంభావ్యముగుట.'

నీ కావ్యరచన కుపక్రమించెను. దానినే వాల్మీకి చేత 'పావనమగు నృపు చరితము' అనిపించినాడు.

మరియు నతడు 'శిల్పమునం బారగుడం గళావిదుడ' నన్న పద్యముననే 'అమలోదాత్తమనీష' ననియు, తాను 'మహేశ్వరాంఘ్రికమలధ్యానైక శీలుండ' ననియు, 'సన్మాన్యుడన్' అనియు చెప్పుకొన్నాడు. ఆశ్వాసాంత గద్యములలో 'బుధారాధన విధేయుడ' నన్నాడు.

కుశలవులకు శ్రీరాముడు రత్నాది బహుమానము లీయబోగా నవి యొల్లక వారు 'అసమ భవద్గుణస్తుతి కథైక పరత్వవిభూతి చాలదే' అందురు. వారే 'మధుర మగు దీని నుపాసింతుము' అన్నారు.

తిక్కనామాత్యుని కున్న 'బుధారాధన విధేయత'యు, 'సన్మాన్యత'యు పెంపొంది, అతని అమలోదాత్తమనీష'ను వృద్ధిచేసి, 'పావన చరిత్ర' కథనమందు ఆదరము కలిగించి, కావ్యోపాసకునిగా జేసినవి. అన్నిటికంటెను అతని 'మహేశ్వరాంఘ్రికమల ధ్యానైక శీలత' అతనిచే సోమయాగము చేయించి ఆస్య ధర్మనిష్ఠ స్థిరముచేసినది. అంతట పురోడాశ పవిత్రమైన ఆ సోమయాజివాక్కున ఆంధ్ర మహాభారతము విరాట పర్వాదిగా తెలుగుభూమికి ప్రసాదించునట్లను గ్రహించినది. యజ్ఞకర్మవల్ల కలుగు అపూర్వఫలమునకు సోమయాజికవనములో కలిగిన మార్పే ప్రత్యక్ష ప్రమాణము! ఆంధ్ర మహాభారతరచన ప్రారంభించిన పిమ్మటగూడ నమాత్యతిక్కన మధ్యమధ్య తలమాపు చున్నను అతనిని సోమయాజితిక్కన తన స్వాధీనములో నుంచుకొనగలిగినాడు.

ఋషికల్పుడైన సోమయాజితిక్కన కవితాదర్శములు మరియొకమారు ప్రశంసించి మా వాక్కు పవిత్రము చేసికొన గలము!



# పద్యానికీ, రాగానికీ కుదురుతుందా?



— శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి —

ద్యాన్ని రాగంతో చేర్చిపాడడం విని మేము ఆనందించినాము. మీరు చేసే శాస్త్రపరీక్షలో ఏది ఎలాగ మడతపడితే మాకేమి? అనుభవము ముందు, శాస్త్రం తర్వాత." అని నామిత్రులు చాలామంది అన్నారు. వారి అనుభవాన్ని నేను కాదనలేదు. "ఉదాత్తానుదాత్తాలు చెక్కుకుపోయిన సాహిత్యానికీ, గమకసంపదా, స్వరముల స్ఫుటత్వమూ నష్టపోయిన రాగానికీ పద్యపాటకుడు చేసే సమ్మేళనము మీకు రుచిస్తే దానిని మీయిళ్లలో చేయించుకోక సాహిత్య సభలలో ఈ పాకాన్ని గుగ్గిస్తారేం?" అని అడుగుతున్నాను. ఆ సమ్మేళనాన్ని మీరు ఆమోదిస్తున్నారంటే ఏం చేస్తున్నారన్నమాట? ప్రతీఅక్షరమూ నాదంలో ములిగినా మాటల్ని దేవి తీసుకుని ఉదాత్తానుదాత్తాలు లేకపోయినా, మీ సాహిత్యసంస్కారబలంవల్ల వాటిని సష్లయిచేసుకుని ఆనందిస్తున్నారన్నమాట. సభలలో ఇంతపాటి సంస్కారమున్నవాళ్లు తక్కువ. వారు వినేది సులభంగా ఆస్వాదించగలిగిన సంగీతాన్నే.

ఇది సహజం. సంగీతం ఆపాతతోరమ్యం; సాహిత్య మాలోచనామృతం. విన్నంతమాత్రాన్నే రంజించగలదు సంగీతం. ఆలోచిస్తేనేగాని కవిత్వానికి రంజించే శక్తి పుట్టదు. సంగీతసాహిత్యాలు చేరి వినపడినప్పుడు సులభంగా రంజించగల సంగీతంవేపే మొగ్గుతాముగాని సాహిత్యంవేపు అంత సుళువుగా చూడలేము. ఇది సహజము. సౌలభ్యంవేపే మానవుడి యత్నం సాగుతుంది. పద్యగానము జరిగినప్పుడు సాహిత్యసౌందర్యం అనుభవించాలన్నా, సాహిత్యానికి విలువకట్టాలన్నా, సభ్యులకు ఆపాతరమ్యమైన సంగీతము తెరలాగ అడ్డుపడుతుంది. ఈ జిలుగుతెరవెనుక హీనస్పష్టతతో సాగిపోయే సాహిత్యం చక్కగా గోచరించదు. కీర్తనలలోని సాహిత్యంలో తప్పులు దొర్లినా సంగీతముగ్ధమైన సంస్కారం ఈ తప్పుల్ని గమనించకపోవడము మనకి అనుభవసిద్ధమే. "నతజనపరిపాలయ" కీర్తన పూర్తిగా పాడైపోయింది. ముసిరి సుబ్రహ్మణ్యయ్యరు 'నగుమోము'లో 'మొరలిడదు'నీ, చెంబేమంగళంలోని పవమాన 'సుతడు'నీ గుర్తించగలిగినవారు ఎంతమంది?

చెవికి ఇంపుగొలిపే యమక, లాట, ఛేక, వృత్త్యనుప్రాసాల బంగారుగజ్జెల సవ్వడిలో తెలుగుసరస్వతి పలుకులు చాలాకాలం మరుగుపడ్డాయి. ఏలాలతాజాలడోలలూ, మధురసాధిక సుధామధుర సారోల్లసన్మధురసావల్లరీ మహిమలూ ముక్కులుమోగించి సాహిత్యాన్ని అడుక్కి తొక్కేశాయి. నేడు వాటిమీద వ్యామోహం తగ్గింది కాని సంగీతం సవారిచేస్తోంది సాహిత్యమ్మీద ఇంకా. సాహిత్యానికి ఈ బానిసత్వం తప్పించండి.

"చేరిక సంగీతసాహిత్యాలకు లేనేలేదంటారా? క్షేత్రయపదాల్ని పాడుతూ అభినయంచేస్తే బాగుంటాయని మీరు ఒప్పుకోరా?" అని ఒక మిత్రులు ప్రశ్నించారు. పదాల అభినయానికి కళాసిద్ధి లేదంటున్నాను. అది విద్యగానే నిలిచిపోయిందిగాని కళగా తయారుకాలేదు. ఏమంటారా? కళలో, కర్త తన భావాల్ని ఇతరుల కందించడానికి యత్నిస్తాడు. పదాల అభినయంలో నర్తకి తన విద్యానైపుణి ప్రకటిస్తోందిగాని కళాసృష్టి చెయ్యడములేదేమో? అనగా తన భావాల్ని చూపరుల కందించే యత్నము చెయ్యడమే లేదేమో, కేవలం తన నేర్పునే ప్రకటిస్తోందేమో గుర్తించండి అంటున్నాను. పదాల సాహిత్యం—అంటే పదాల

లోని భావాలు—నర్తకి స్వంతభావాలు కాదు. పదాల సంగీతంకూడా అస్థిపంజరమాత్రంగా నిర్ణయం అయే ఉంది. ఇక సంగీతంలోనూ, సాహిత్యంలోనూ నర్తకికి మిగిలిందేమిటి? శ్రోతలు ఆ భావాలు తనవే అనుకునే టట్లున్నూ, అందులోని సంగీతముకూడా తన స్వంతమే అనుకునేటట్లున్నూ నటించడము. సంగీతమూ సాహిత్యమూ చేరేసరికి, ఆమిశ్రమం సంగీతమూ కాకుండా సాహిత్యమూ కాకుండా పోతుంది. "శివదీక్షాపరురాలనురా" అన్న మాటని ఉదాత్తానుదాత్తాల మార్పువల్ల నాలుగైదు సూక్ష్మభావాలు స్ఫురించేటట్లు వాచికాభినయం చెయ్యవచ్చును. 'శివదీక్షాపరురాలనురా' అనే పల్లవిని నాలుగైదు సంగతులు చేర్చి పాడవచ్చును. 'శివదీక్షాపరురాలనురా' అనే సాహిత్యాన్ని శివముద్రలు—నాలుగైదు వేరే ముద్రలు—చేర్చి అభినయం చెయ్యవచ్చును. నర్తకి చేసే పదాభినయంలో సంగీతముండడము చేత (సాహిత్య) వాచికాభినయం వెనక్కిపోతుంది. ముద్రాభినయంవల్ల సంగతులు చప్పబడతాయి! మొత్తానికి పైకి తేలేది ఏమిటి? ముద్రల అభినయం. ముద్రలు చూపిస్తూనే సంగతులు చూపించడము నర్తకికి అసాధ్యం కనక (నటరాజు భంగిమం చూపిస్తూ ఒంటికాలిమీద నిలిచి, రెండోకాలు కుంచించి చేతులతో ముద్ర చూపించే నర్తకి గొంతును పూరించి ఎలాగు పాడగలుగుతుంది?) పక్కపాట పాడే స్త్రీ చూపించాలి సంగతుల మాధుర్యాన్ని. ఇక సాహిత్యాభినయం ఎక్కడిది?

పదాభినయం పాకము కాదు, కలగూరగంప అంటున్నాను. ఉదాత్తానుదాత్తాల మార్పులవల్ల సాధించడానికి వీలయిన సంచారభావాలకీ, సంగీతపు సంగతులకీ, అభినయముద్రలకీ సామరస్యము కుదరదు. అందువల్ల భావకీ సంగీతానికి గౌణస్థాన మిచ్చి, అభినయను ప్రధానస్థాన మాక్రమిస్తుంది. ఈ అభినయమేనా వ్యాఖ్యానరూపంగానే వుంటుంది.

శివదీక్షా...అని శివముద్రలూ, స్నానసంధ్యాద్యనుష్ఠానాలూ, పూజాపునస్కారాలూ అభినయిస్తుంది నర్తకి. ఈ అభినయంయొక్క గురి మనస్సుమీదికేగాని హృదయంమీదికి కాదు. అందుకే పదాభినయం కళ కాదేమో అన్నాను.

శిల్పమూ, వాస్తుశిల్పమూ, చిత్రకళా చక్కగా అతుక్కుంటున్నాయనీ, అజంతాలోనూ, ఎల్లోరాలోనూ, లేపాక్షిలోనూ, మధురలోనూ, శ్రీకూర్మములోనూ, సింహాచలంలోనూ ఈ మూడుకళల చేరికనీ చూడవచ్చుననీ ఒక మిత్రుడన్నాడు. ఈ క్షేత్రాలన్నిటినీ కాకపోయినా చివరి మూడింటినీ అసలు రూపంలోనూ, మొదటి మూడింటినీ బొమ్మలరూపంలోనూ చూశాను నేను. ఒక్క మధురలో తప్ప, శిల్పవిగ్రహాలకి రంగుపూయడము తక్కినచోట్ల లేదు. అన్నిచోట్లలోనూ చిత్రకళ గోడలమీదా, లోకప్పుమీదా ప్రత్యేకంగానే వుంది. దేవాలయాలు చూడవచ్చినవారికి ఈచిత్రాలు ప్రత్యేకం యోగము కలిగిస్తాయిగాని వాస్తుశిల్పానికీ, వీటికీ సంబంధము లేదు. ఇక శిల్పమూ వాస్తుశిల్పమూ చేరికతో వున్నాయంటే అర్థమేమిటో మనవిచేస్తాను. ద్వారసముద్రము రాజధానిగా, పదీ పదకొండూ పన్నెండో శతాబ్దాలలో విజృంభించిన హొయసలులు మూడువందల దేవాలయాలు కట్టించారు. ఆ దేవాలయాల పీఠంచుట్టూ పన్నెండుదాకా శిల్పవలయాలు వడ్డాణాలుగా అమర్చారు. దేవాలయం కప్పువరకూ చేతికందుకొచ్చినంతవరకూ శిల్పాన్ని విరజిమ్మేశారు. కాని, ఈ దేవాలయాల్లో శిల్పవలయాలే కాక, మనిషి ఎత్తున విగ్రహశిల్పంకూడా కనబడుతుంది. ఈవిగ్రహాల్లో వేణుగోపాలుడువంటి ప్రత్యేకశిల్పాలుకూడా వున్నాయి. దేవాలయానికి వచ్చే భక్తులు ఈ శిల్పాల్ని చూచి భక్త్యుత్సాహులు అవడానికి కావలసినంత అవకాశ ముంది. వాస్తుశిల్పంతో చేరే వున్నప్పటికీ హొయసలుల విగ్రహశిల్పం తన ప్రత్యేకతని పూర్తిగా కోల్పోలేదు. కాని, శిల్పాన్ని వాస్తుశిల్పానికి బంటుగాచేసి దాని ప్రత్యేకతని కొంత దిగదీసినవారుమాత్రం హొయసలులే. స్తంభాలకి పైనవున్న దూలాలికి మోపుగా నర్తకి విగ్రహాల్ని వాడేరు వీరు. ఈ అలవాటే కాకతీయులు పాలంపేట, ఘనపూరు, దాక్షారామాల్లో దిగుమతిచేసుకున్నారు. శిల్పానికి ప్రత్యేకసౌందర్యం పోగొట్టేరోగం హొయసలుల అశ్రద్ధాతిశ్రద్ధలవల్ల దాపురించింది. విజయనగరరాజులు శిల్పాన్ని స్తంభాలరూపంలో ఇమిడ్చి, గోపురవల

యాలలోని కెక్కించీ పూర్తిగా పాడుచేశారు. శిల్పము వాస్తుశిల్పంతో కలిసి—కాదు కాదు, వాస్తుశిల్పంలో పూర్తిగా జీర్ణమై—పోయింది విజయనగర శిల్పంలో. దీన్ని శిల్పవాస్తుశిల్పాల మేళన మని ఎలాగంటామూ? విజయనగర స్తంభశిల్పంలో చేతివాటమే కాని, చూచేవారికి యోగముకలిగించేటంత కళాసిద్ధి లేదు. కాబట్టి ఈ పులగాన్ని శిల్పవాస్తుశిల్పాల సమ్మేళన మని అనకూడదేమో అంటాను. ఇంక గోపురాల నధిష్ఠించిన శిల్పంలో సౌందర్యం అన్నది లేనే లేదు. ఆ విగ్రహాలు భూమిమీద ఉన్న వారికి ఏర్పాటుగా కనపడవు. గోపురపుటంచులు దూరానికి బారురేఖల్లాగా, గోపురముఖం సమతలంలాగా కనబడకుండా విరవడానికి ఈ విగ్రహాల అట్టహాసము ఎందుకూ? పల్లవులవలె చిన్నచిన్న శిఖరాలూ, మందిరాలూ వాడితే వీటికన్న సుందరంగా విరుగుతాయి అంచులూ, ముఖతలమూను. గోపురమీ్మది శిల్పంయొక్క సౌందర్యం చూచేవారికి అంది, వాస్తుశిల్పంయొక్క బారురేఖల్నీ సమతలాల్నీ ఈశిల్పం చక్కగా విరిచినప్పుడే శిల్పవాస్తుశిల్పాలు మేళవించాయి అనడము న్యాయము. దక్షిణదేశదేవాలయగోపురాల్లో దేనిమీదనూ ఈ సమ్మేళనము జరగలేదు. గోపురాలమీది శిల్పంలో మహాఉంటే కథనము మాత్రమే ఉంది. సుందరకథనము లేదు. అలాంటప్పుడు దాన్ని శిల్పమని ఎలాగ అనగలమూ? ఈ నీరసపు బొమ్మలికీ, గోపురరూపానికీ చేరికే గాని సమ్మేళనం కానటువంటి గోపురశిల్పాన్ని శిల్పవాస్తుకళల సమ్మేళనమని ఎలా గనగలమూ?

నాటక ప్రదర్శనము సంగతీ ఇంతే. నాటక సూత్రధారుడు పాత్రల భావాల్నీ, వారు తిరిగిన ప్రకృతి రంగాల్నీ, వారి పాటల్నీ ఏ వుద్దేశంతో ప్రదర్శిస్తున్నాడు? వారి కథ మన కళ్లముందర జరిగిపోతోందనే భ్రాంతి కల్పించడానికి. అంతేగాని, పాత్రల భావసౌందర్యాన్నీ, వారు విహరించిన దృశ్యాల సౌందర్యాన్నీ, వారి విన్యాససౌందర్యాన్నీ మనకి అందించడానికి కాదు. తెరలమీద ఉండవలసినవి యుక్తదృశ్యాలే కాని సుందరదృశ్యాలు కావు. పాత్రల నోట రావలసినవి యుక్తవచనాలే గాని సుందర వచనాలు కావు. పాత్రల సంగీతము వారి యుక్తభావాల్నీ, ఆవేశాన్నీ తెలిపేదే కాని, రచయిత సొంత ఆనందాన్ని గాని, సూత్రధారుడి వీరావేశాన్ని గాని తెలిపేది కాదు. నాటకంలోని పాత్రల భావాలు రచయితయొక్క స్వంత కవిత్వం కాదు. ఆ పాత్రలకి యుక్తమైనవని అత డూహించి అమర్చిన భావాలు. ఇలా అమరుస్తూన్నప్పుడు లోకవృత్తానుకరణమే అతని ఉద్దేశం కాని, సౌందర్యసాధన కానే కాదు.

కాబట్టి నాటక ప్రదర్శనం మొత్తానికే గాని మాటలకీ, తెరలమీద చిత్రాలకీ ప్రత్యేకంగా కళాసిద్ధి లేదు. సూత్రధారుడు మొత్తపు ప్రదర్శనంద్వారా మనతో మాట్లాడతాడు గాని, తెరలమీది చిత్రాలద్వారానూ, పాత్రల సంగీతంద్వారానూ మనల్ని పలకరించడు. ఏ తెలివితక్కువ దర్శకుడైనా సీనరీలతో మనల్ని పలకరించడము ప్రారంభించాడంటే అతని ప్రదర్శనం గంగలో కలుస్తుంది. అందమైన పద్యాలద్వారాగాని, సుందరమైన సంగీతంద్వారాగాని పలకరించే రచయిత నాటకంకూడా చివరికి మన మనస్సుకెక్కదు. తోట వెంకటేశ్వరరావుగారి అజంతాస్త్రీల విన్యాసాలూ, బలిజేపల్లివారి కవిత్వ ప్రత్యేక మాధుర్యమూ, గుబ్బికంపెనీవారి రంగప్రసాధనమూ, మొత్తపు ప్రదర్శనంయొక్క బుజాలమీద చేతులాని మన మనస్సుల్లోకి తొంగిచూస్తున్నాయంటే నాటక ప్రదర్శనం ఏమయినట్టూ? నాటకంలోని విన్యాసాలు శిల్పమనీ, పద్యాలు కవిత్వమనీ, రంగప్రసాధనం వాస్తువనీ భ్రమించినవారి చర్యలే పైన చెప్పిన ఉదాహరణాలు. నాటకం కళల కూడలీ, సమ్మేళనమూ కాదు. అది లోకవృత్తానుకరణము. లోకవృత్తంలోని భావాలు ప్రకృతే; కళ కావు. తెరలమీది చిత్రాలూ, పాత్రల విన్యాసాలూ, ప్రకృతిలోని తునకలే, కళల తునకలు కావు.

రెండుకళలు కలుస్తాయన్నది భ్రమ. అందపు టూహ. స్వప్నము. రెండుకళల్ని కలిపేము అనగానే, దేన్నో దాన్ని తొక్కేశాము అన్నమాటే. త్యాగరాజస్వామి కీర్తనలలో సాహిత్యానికీ, సంగీతానికీ మేళము కుదిరిందని ఘట్టిగా చెప్తున్నారే భక్తులూ—

అది వట్టి అపోహ. తొప్పుడకండి, మనవి చేస్తున్నా, చిత్తగించండి. జయదేవుడూ, రామదాసూ, తాళ్ల పాకమువారూ రచించిన కీర్తనలలో అక్షరం అక్షరానికీ స్వరాలుంటాయి. సంగీత ప్రాబల్యం వాటిలో తక్కువే అనాలి. ఆ సంగీతాన్ని విని మహదానందం పడడానికి అవకాశమూ తక్కువే. త్యాగరాజస్వామి కీర్తనలలో అక్షరాలూ, మాటలూ ప్రాబల్యంకంటె సంగీతపు ప్రాబల్యం ఎక్కువ. సంగీతాన్ని అనుభవించడానికి అవకాశం ఎక్కువ. త్యాగరాజస్వామి పరమ భాగవతుడు. సాహిత్యపు అట్టహాసములేకుండా అందరికీ తెలిసేటట్టు తన ఆవేదనని కీర్తనలలో ఇమిడ్చాడు. సాహిత్యార్థమూ, సంగీత మాధుర్యమూ రెండూ సులభాలే అయినాయి. వీటి కేదో మేళము కుదిరిందను కోడము సుఖమైన, సుందరమైన ఊహ. కనక దాన్ని దొరకపుచ్చుకున్నారు ఎందరో మహానుభావులు! గమనించిచూస్తే ఈ సత్యం బోధఅవుతుంది. త్యాగరాజస్వామి కీర్తనలలో రమ్యమైన భావాలు గుప్పెడే, సంగీతరమ్యత అపారమంటున్నాను. ఆయన సంగీత రచన సాహిత్యభావాలకి అనుగుణంగా నడిచిందను కోడము ఆయనసంగీతసృష్టిని క్రించెపరచడమే. "ఇదుగో ఇక్కడ సంగీతం మంద్రంలో నడిచింది, అక్కడ భావానికి అనుగుణంగా తారస్థాయిలో నడిచింది" అని కనిపెట్టుకోడం, స్కేలు పట్టుకుని కొలిచి, "నీ మూతి ఎత్తు నీ ముక్కుకొలకి ఇన్నో భాగం, అందుకే నువ్విలా గున్నావు" అని నిర్ణయించడంలాంటిదే. క్షేత్రయ్య పరమరసికుడు; తనకున్న అనుభవ సంస్కారాన్ని తనపదాల్లో ఇమిడ్చాడు. త్యాగరాజస్వామి సాధకుడు. తన భక్తిని కీర్తనలలో వెలిబుచ్చాడు. మరొకరు వేశ్యాభుజంగులు. జావళీలు రాశారు. చిత్రకళని పటములాగే, వాగ్గేయకారులకు సాహిత్యం ఉపయోగపడింది. అంతమట్టుకే. అంతేగాని వీరి కీర్తనలలో సంగీత సాహిత్యాలకి మైత్రికుదిరింది, వారికి కుదరలేదను కోడం శుద్ధవెర్రి.

త్యాగరాజస్వామి కీర్తనలు ఆరు వందలదాకా వున్నాయి. వీటిలో తోడి, ఖరహరప్రియ రాగాలమీది కీర్తనలు చాలా వున్నాయంటారు తజ్ఞులు. ఈ కీర్తనలలోని సాహిత్యభావాలు (రాగము ఒకటైనంత మాత్రాన) సమరసంగా లేవు. ఒక రాగంలోవున్న కీర్తనల్ని అన్నిటినీ చూసి, వాటిలోని భావసామ సామరస్యాన్ని దేవితీసి, సంఖ్య మొత్తమ్మీద కుదిరే సామరస్యం కనబడితే అప్పుడనాలి 'ఇదుగో సామరస్యం' అని. అంతేగాని త్యాగరాజు కీర్తనలనే నదిలో గాలంవేసి, రొయ్యఒకటి పట్టుబడితే, ఈ నదిలో రొయ్యలుకూడా ఉన్నాయనడము హాస్యాస్పదము. ఎందుకు దానికనాకో అన్నది సందేహాస్పదమైన తోడిలో వున్నది మాత్రం కే అంటే, కోటినదులు, మునిరావణ భాషలు మాట ఏమిటని వెంటనే ప్రశ్న పుడుతుంది.

ఒక్కొక్క కీర్తనలో చరణాలు ఉంటాయి. వాటికి స్వరము ఒకటే. భావముమట్టుకు వేరుగా వుంటుంది. మరి సంగీత సాహిత్యాలకి చేరిక కుదిరిందంటే ఏమిటి! కీర్తనలో పల్లవీ, అనుపల్లవీ, చరణము అని మూడు భాగా లుంటాయి. పల్లవిలో రాగము యొక్క రేఖాచిత్రముంటుంది. అనుపల్లవి తారస్థాయి పంచమందాకా పోతుంది. చరణములో రాగములోని ఇతర సంచారము మొదటిభాగంలోనూ, అనుపల్లవి మాదిరిసంచారం రెండోభాగంలోనూ ఉంటుంది. పల్లవికీ, అనుపల్లవికీ చరణం ప్రథమభాగానికీ, చరమభాగానికీ కూడా మూడింటికీ తక్కువగాని సంగతు లుంటాయి. ఈ నాలుగు భాగాలలోనూ, ఒకదాన్ని విడిచి మరోదాన్ని అందుకున్నప్పుడు మూడు సంగతుల్ని పాడడము పరిపాటి. త్యాగరాజ స్వామి శిష్యప్రశిష్యులు ఈ రీతిగానే పాడుతున్నారు కనక ఇది ఆయనపద్ధతే అనడానికి సందేహము లేదు. కీర్తనల్ని పరిశీలిస్తే, "ఎంతని వర్ణింతును శబరీభాగ్యం"లోనూ, "వినతాసుత"లోనూ, "బాగాయెనయ్య" లోనూ చరణపు పూర్వభాగానికీ చరమభాగానికీ నడుమ సాహిత్యం అడ్డదిడ్డంగా విరుగుతుంది. సాహిత్యంకోసం చూస్తే సంగీతం గట్టెక్క అక్షరాలతో దొర్లుకుంటూ పోతుంది. సంగతులకోసం చూస్తే సాహిత్యం విరుగుతుంది.

త్యాగరాజస్వామి సంగీతానికే ప్రాముఖ్యత ఇచ్చినట్లు చక్కగా సాక్ష్యం ఇస్తాయి ఇలాంటి

కీర్తనలు. నేటి తెలుగుసంగీతవిద్వాంసులకు కొందరికి త్యాగరాజుకున్న కీర్తనాసాహిత్యంమీద ఆయనకంటే ఎక్కువ ప్రేమ! అది అరవవిద్వాంసుల నోటిలో నలిగి పోతూంటే వీరు పద్యాలు పాడినట్టు కీర్తనలు అనేసి సాహిత్యాన్ని చక్కగా రక్షిస్తున్నారు.

కలవవు రెండు కళలు! సంగీతమూ, సాహిత్యమూకూడా కలవవు. వింత యేమిటి? ఇవి ఆదిలో వేరుగా పుట్టేయి. భరతముని చేర్చికట్టినా, కాలక్రమ వికాసంలో వేరైపోతున్నాయి. అస్తు.

ఇంతకూ, రాగం చేర్చకపోతే పద్యానికి వచ్చే నష్టం ఏమిటి? పద్యగతి రాగవాహినిలో జారిపోక, తన విశిష్ట, విలక్షణగతితో ప్రత్యక్షమౌతుంది. పద్యగతి సౌందర్యం మనకి చక్కగా స్ఫురిస్తుంది. పద్యం పదహారణాల సాహిత్యమేగాని సంగీతాన్ని ఆశ్రయించే గేయంవంటిది కాదని అందరికీ అవగాహన అవుతుంది. పద్యసాహిత్యము సహజసౌందర్యంతో ప్రత్యక్షమౌతుంది. 'పాడగలవారి' కవిత్వము సంగీతపు బొంతలు పోయి నిజస్వరూపం చూపిస్తుంది. సభాస్తారులకు పద్యసాహిత్యం దగ్గిరౌతుంది. ప్రజల కావ్యరసాస్వాదనాశక్తి ఎక్కువౌతుంది. సంగీతము రాని కవులు సభాముఖాన్న తమ కవిత్వము వినిపించడానికి నిలదొక్కుకో వచ్చును. మరొకరి చేతిలో పెట్టి 'అమ్మా, నీయెంగిలి ప్రసాదం' అననక్కరలేదు.



# ఓ చుక్కా !

శ్రీ కె. వి. యస్. యల్. నరసింహారావు =

౧

ఓ చుక్కా
నీ రెక్కల
నొక్కసారి
ఇస్తావా ?
నీ కన్నా
నే మిన్నగ
స్వేచ్ఛా విహా
రాన్ని చేస్తు
ఎగిరి ఎగిరి
పోయివస్తు
ఓ చుక్కా !

౨

ఓ చుక్కా
నీ తళుక్కుల
నొక్కసారి
ఇస్తావా ?
నీ కన్నా
నే మిన్నగ
లోకమంత
కాంతి నిండ
మినుక్కుమంచు
వెల్గుతాను
ఓ చుక్కా !!

౩

ఓ చుక్కా
నీ వెందో
మా కక్కర
లేనిచోట
మినుక్కుమినుక్కు
నిలిచి ఉంట
లేని ఆశ
కల్పిస్తూ,
కాని కోర్కె
లదికిస్తూ,
తలచుకొంటు
మేం పస్తు
ఓ చుక్కా !!!



# డోంగేగారి

## బాలామృతము

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును



# కాశ్మీర్

అన్ని విధములగు దగ్గులు, ఉబ్బసము, ఆయాసము మొదలగు శ్లేష్మవ్యాధులకు అమోఘమైనది. సీసా రు.1-12-0. అన్ని మందుల షాపులలో అమ్మబడును.

## గిరిజా అండ్ కో,

దానవాయిపేట, రాజమండ్రి.

మద్రాసుస్టాకిస్టులు: జె. బాలాభాయి & కో,

చెనాబజార్ రోడ్.

## ఆయుర్వేద వైద్యనిలయంవారి

# "లుకోరియా క్యూర్"

స్త్రీల గర్భాశయ సంబంధమైన సమస్త వ్యాధులను నివారించి ఆరోగ్యవతులనుగా చేయుటలో సాటిలేని దివ్యౌషధము.

90 మాత్రల ప్యాకెటు రు. 2-8-0.

ప్యాకింగు పోస్టేజి అదనము.

## ఆయుర్వేద వైద్యనిలయం,

రామానాయుడుపేట, మచిలీపట్టణం.

భవానీ మెడికల్ స్టోర్సు—రాజమండ్రి.
శివరాం అండ్ సన్సు—మచిలీపట్టణం,
అన్ని మందుల షాపులలో అమ్మబడుచున్నది.

# ప్రసుధ

క్షీణించుచున్న వీర్యశక్తిని పెంపొందించును. నరములకు పటుత్వమును కండపుష్టి నిచ్చును.

మెదడుతో పని చేయువారికి ఆత్మమిత్రము.

---

పక్షవాతమునకు అమోఘమయిన ఔషధములు

## క్షీరబల (101 సార్లు ఆవర్తితము)

## అయువీరము

వాడిచూడుడు, తృప్తిచెందుడు.

కన్సల్టింగ ఫిజిషన్ :—
ఆయుర్వేదాచార్య ఎన్. మాధవమీనన్
ఎ. ఎం. ఎ. సి.

## మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు

నెం. 107-108, బ్రాడ్వే, మదరాసు

# ప్రాచీన భారతీయభాష

= శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి =

దికార్యులు భారతదేశానికి రాకపూర్వము, ద్రావిడులు ఈ పవిత్ర భూమిని చూడక పూర్వము, ఈ దేశీయులు కొందరుండేవారు. వారిని ఆస్ట్రాలాయిడ్సనీ, కొలేరియనులనీ పరిశోధకులు, ఐతిహాసికులు వ్యవహరిస్తారు. ఆస్ట్రేలియా, ఆఫ్రికాలలోని ఆదిమనివాసులైన వనచరులకూ వీరికీ సన్నిహితసంబంధము, సామ్యము కలదు. ఆకాలంలో ఉత్తర హిందూస్థానము లేదు. అది అంతా సముద్రమయము. వింధ్యాద్రికి దక్షిణమే భూమి. ఆ భూమి ఆఫ్రికా, ఆస్ట్రేలియాలను కలిసికొని ఉండేది. క్రీ. పూ. ౧౦,౦౦౦ లలోని హిమప్రళయానంతరము హిందూదేశము ఆ ఖండాల నుంచీ చీలిపోయినది. ఉత్తర హిందూస్థానమావిర్భవించినది. గంగా సింధుమైదానములు పైకొకినవి. డక్కన్‌పీఠభూమి యేర్పడినది.

ఈ కాలానికి పూర్వమున్న జాతులవి. వానిలో కోలులు, లేక కొలేరియనులు గమనించదగిన జాతులు. వీరు ప్రస్తుతము మహాదేవగిరిప్రాంతములందు ముండా జాతివారని, ఓఢ్రదేశప్రాంతములోని సవరలనీ, కొర్కులనీ వ్యవహరించబడుతున్నారు. వీ రాక్రమించుకొని యున్న దేశమును పులిందదేశమని ప్రాచీనులు బ్రాహ్మణములలో అన్నారు. వీరి భాష విచిత్రమైనది. ఈభాషలోని జీవపటిమ, శక్తి కొనియాడదగినవి. వారు పెట్టిన పేర్లే మనము నేటికైనా వీడలేకున్నామంటే, వారికెంత కృతజ్ఞులమై ఉండాలో చెప్పలేము. దేశమును కవలపిల్లలలాగా రాష్ట్రము లుండేటట్లు వీరే విభజించినారు. ఆ పేర్లలో కొన్ని—అంగ, వంగ; కళింగ, త్రిలింగ; భోజ, కాంభోజ; రూప, కామరూప; లాట, కర్నాట. ఈ సామ్యముతో సౌరాష్ట్ర మహారాష్ట్రము లేర్పడినవి.

గంగా, సింధు, యమునా, గోదావరి, కృష్ణా, కావేరీతి నదీనామము లీ ఆదిమనివాసుల భిక్షయే. వీటికి సంస్కృతభాషలో సరియైన వ్యుత్పత్తి కన్పించదు. వీరి భాషలో గంగ అనగా నిర్మల ప్రవాహము; సింధు అనగా ఒడుదుడుకుల గమనము; కృష్ణ అనగా నల్లనిది; యమున అనగా అదే అర్థము.

ఇంతేకాక పర్వతాదినామములు కూడా వీరి ప్రసాదమే. ముండాభాషలో తిత్తిరిపక్షిని 'చిత్రి' అంటారు. తిత్తిరులున్న కొండ కావటముచేత 'చిత్రకూట'మనే పేరు వచ్చినది. ఇలాగే సాకేతాది నగర నామములు. ఈశబ్దాలన్నీ సంస్కృతమును ప్రవేశించినవి. తర్వాత దేశభాషలలో ఎక్కినవి.

వీరితర్వాత క్రీ. పూ. ౧౦,౦౦౦ ల ప్రాంతమున మన దేశమునకు వచ్చినవారు ద్రావిడులు. వీరు క్రమముగా కోలులు మొదలగువారిని కొండలలోనికీ, అరణ్యాలలోనికి తరిమినారు. వీరి ఆదినివాసము యూరల్పర్వత ప్రాంతము. ఆర్యులు రెండుశాఖలుగా ఆర్కిటిక్ ప్రాంతమునుంచి బయలుదేరినట్లు వీరుకూడా రెండు తెగలైనారు. ఒకతెగవా రిప్పటికీ ఫిన్లండు హంగేరీ దేశాలలో కలరు. వీరి భాషలోనుంచి ఆర్యులు చాలా గ్రహించినారు. వీరి సంస్కృతిలోనుంచి కొంత స్వీకరించటమేకాక, వీరితో సంబంధబాంధవ్యాలనుగూడా ఆర్యులు చేసికొన్నారు. ఐతరేయ బ్రాహ్మణకాలానికి ఆర్యద్రావిడజాతుల మేళనము జరిగినది.

[1] దికార్యులు ఉత్తరధ్రువప్రాంతవాసులు. ఈ ప్రదేశమునే ఉత్తరకురుదేశ మన్నారు. మేరుపర్వత మీ ప్రాంతములోనిదే. వీరు రెండు తెగ

లుగా చీలి, ఐరోపా శాఖ శాఖగాను, ఆసియా శాఖ శాఖగాను వెడలినారు. భారత దేశమునకు వచ్చినవారతి ప్రాచీనులు. వీరు క్రీ. పూ. ౫౦౦౦ ప్రాంతములో వచ్చినారు. భారతీయ ఆర్యులు మిటన్నీ, హిటైటే ప్రజలతో కొంతకాలము కాపురమున్నారు. ఆ కాలములోనే వైదిక సంస్కృతి ఆ జాతులకు కొంత సంక్రమించినది. కావుననే హిటైటే సంధిశాసనములో మిత్రావరుణులు సంధికి సాక్షులుగా పిలువబడినారు. ఆపై వైదికార్యులకు చాల్డియనుల సంబంధము కల్గినది. ఈ కాలములో జ్యోతిషాది శాస్త్రవిజ్ఞానము, పరిశోధన ప్రారంభమైనవి. తర్వాత పారశీక దేశములో కొందరను వదలి, మిగిలినవారు మన దేశమునకు వచ్చినారు.

పారశీకులకు, వైదికార్యులకు భాష, మతము, విజ్ఞానము, సంస్కృతి మొదట ఒకటే. తర్వాత తర్వాత యుద్ధాలు రాగా పారశీకులు అసురులైనారు. వైదికార్యులు దేవతలైనారు. అవెస్తాలోను, ఋగ్వేదములోను అసురశబ్దము దేవతావాచి. వివాదముల కాలములో పారశీకుల దేవుళ్లు మనకసురులు, మన దేవుళ్లు వారలకు అసురులు ఐనారు. దేవశబ్ద మాభాషలో దైత్యవాచకము. ఇంద్రుడు రాక్షసుడే. కాని వృత్రఘ్నుడు దేవుడే!

ఐతరేయ బ్రాహ్మణకాలానికి ఆర్యద్రావిడ జాతుల సంకరము ప్రారంభమైనది. సరిహద్దులనున్న ఆర్యులు మొదట పతితులైనారు. అట్టివారితో చేరినవారు వంగదేశీయులు, బీహారుదేశీయులు, ఆంధ్రులు, మహారాష్ట్రులు. ఆంధ్రులు జాతిలోనే కాక భాషలో కూడా ఆర్యద్రావిడసంకరము తెచ్చుకొన్నారు. ఈ సమ్మేళనమును వైదికసంస్కృతివ్యాపన కుపయోగింప దలచినవారిలో కొందరు అగస్త్యుని అనుచరులై దక్షిణ దేశయాత్ర జేసినారు. ఈవిధముగా భారత దేశమునకు వచ్చిన ఆర్యులుకూడా రెండుసార్లు వచ్చినారు. వీరే సూర్యవంశీయులు, చంద్రవంశీయులని యెంచబడినారు.

వైదికార్యుల భాష పారశీకుల గాథలకతి సన్నిహితము. రేఫీకరణ మప్పుడే ప్రారంభమైనది. రానురాను చాలా మార్పులు కల్గినవి. ప్రాచీనభాషలోని రెండు బహువచనప్రత్యయాలు, లేట్ మొదలైనవి పోయినవి. కృత్తులు చాలా తగ్గిపోయినవి. దీనికి కారణము అన్యభాషా సంపర్కము. వైదికభాషలో ఆ వైదికపదాలు, ప్రయోగాలు చాలా కనబడుచున్నవి: "తుర్ఫరీజర్ఫరీ" ఇత్యాదిపదాలతోను, 'వంసగేవప్లావర్వాశం బాతా' అనే ప్రయోగాలతోను (X. ౧౦౬) చాలా వేదభాషలోని పదాలు బయలుదేరినవి. బబర, కీకట, నీచాశాఖశబ్దము లే జాతివో, ఏ భాషలోనివో చెప్పలేము. కణ్వప్రస్కణ్వులు, ఘృష్టిక ప్రిష్టికులు, మేధాతిథి, మేధ్యాతిథి, నీపాతిథి అతిథి నామము లే జాతివారివో తెలియదు. పర్యతనామములు వైదికులు కారేమోనని సందేహము. ప్రగాథవృత్తముకూడా తత్తుల్యమే. ఇవి ఇతర జాతుల ప్రాబల్యమును చూపునవి.

వైదికవర్ణములు మారినవి. సంస్కృతహకారము వైదిక గ, ధ, ఘ కారములుగాగలదు. వేదపాఠముల కొక్కొక్కదానికి అనేక పాఠాంతరములు కలవు. అన్యభాషాపదములు వైదికభాషలోనికి ప్రవేశించినవి. ప్రాచ్యప్రాకృత ప్రయోగమైన "సూరే దుహితా" వైదికమైనది. ఛందస్సున కనుగుణంగా "దుహితా" శబ్దము, ఆర్యమాత్రమైనా, 'ధీతా'గా మారినది. పాళీభాషలో "ధీతా" యుక్తము. అలాగే 'నృద్రి' శబ్దము 'రుదిర'గా ఉచ్చరింపబడినది. ప్రాకృతాలనుంచీ, అవైదిక భాషనుంచి మూర్ధన్యాక్షరాలు స్వీకరింపబడినవి. వైదికకవులు జజ్ఝతి, ద్యోతిస్ ఇత్యాది అప్రయోగాలను జక్షతి, ద్యోతిస్ మొదలగువానికి బదులుగా చేశారు.

ఈ కాలములోని Subjenctive Mood, లేట్ తర్వాతిరోజులలో మాయమైనవి. విభక్తి ప్రత్యయాలతో అవ్యయాలుగా ప్రయోగించబడిన జీవసే, సహధ్యై, జిషే, దామనే ఇత్యాదులు నశించిపోయినవి. కేవల తుమున్నర్థకమే మిగిలి దాతవే మొదలైనవి అప్రయుక్తాలైనవి. వైదిక కవులు యథేచ్ఛగా విరామమును కవితలో పాటించినారు. ఈకాలములో సంధి సూత్రాలు నిరంకుశాలు కావు. ఛందస్సు మాత్రాబద్ధము.

వీటిని పరిశీలిస్తే వైదికభాష వ్యావహారిక భాష అని తేలుతుంది. ఏయేభాషలలో ఏయే పదాలు స్వీక

రీతిస్తే భాష సజీవంగా ఉంటుందో ఆ కవులు భాషా తత్త్వవేత్తలు గ్రహించారు. దేశకాలానుగుణ్యంగా పదాలను, తదర్థాలను మార్చినారు. అదీగాక ఒకే భాషలో అనేకవిధాల ప్రయోగాలు, ఆచారాలు ఉండేవి. ప్రాచ్యవైదికానికి, ఔత్తరాహిక వైదికానికి భేదా లున్నవని కొన్నింటిని యాస్కాచార్యు డుదాహరించినాడు. శవశబ్ద మొకదిక్కులో 'గతికర్మ' గాను, మరొకదిక్కున మృతపురుషవాచి. ఇలాంటిదే కంబల శబ్దముకూడాను. ఈ Dialects అభివృద్ధి చెందటంతో సర్వగ్రాహ్యమైన గ్రాంథికభాష వింధ్యపర్వత ప్రాంతములో బయలుదేరినది.

ఒకవైపున వైదికభాష వ్యావహారికముగా పరిణామము చెందే రోజులలో యాజ్ఞికులు సజీవమైన భాషను నిర్జీవిగా చేయటానికి కట్టుబాట్లు చేశారు. ఈ కాలములో వేదాపౌరుషేయత, వేదపాఠక్రమ నియమాలు బయలుదేరినవి. సరస్వతీయోగముకూడా ఆవిర్భవించినది. కాని పతంజలిభగవత్పాదు లనినట్లు "యద్వాన స్తద్వానః" అనునది "యర్వాణ స్తర్వాణః" అనే మారింది. ఈ మార్పు దేశకాలనియమానుసూచితము.

కాని సంస్కృతిని ప్రతిఫలించేరీతిగా సర్వభూషణ భూషితమైన సంస్కృతమును తయారు చేసినారు. మూర్ధన్యీకరణము నియమానుసరణమైనది. ద్వికృత బహువచన ప్రత్యయాలు పోయినవి. ఉదాత్తాదిస్వరములు వ్యాకరణ గ్రంథస్థాలైనవి. ఈస్వర సన్న్యాసమే సంస్కృతము కృతకభాష యైనదనటానికి ప్రబలహేతువు. కావుననే ఉత్తమపాత్రలకు మాత్రమే నాటకములలో సంస్కృత మిచ్చినారు. విద్వత్పరిషత్తులలో సంస్కృతము ప్రయోగింపబడేవని చరకాది గ్రంథములనుంచి తెలుస్తుంది. వాత్స్యాయనుని మతముప్రకారము నాగరకుడు సంస్కృతముతోబాటు దేశభాషలనకూడా నేర్చుకోవాలి. బిల్హణునిరీత్యా సంస్కృతప్రాకృతజన్మభాషలు మూడూ నేర్చుకోవలసినవే. నాణెములలోను, శాసనములలోను క్రీ.పూ. ౨౬౩ నుంచి క్రీ. వె. ౩౨౦ దాకా ప్రాకృతాదిదేశభాషలే ప్రయుక్తాలు. అతః వ్యావహారికవైదిక భాషలలోనుంచి ఒక ప్రాంతభాష (Dialect) కట్టుదిట్టములకు గురియై (Standardize), కృతకమై సంస్కృతమనే పేరు పొందినది.

ఇట్టి సంస్కృతభాష ఎంత మడికట్టుకొని కూర్చున్నప్పటికీ, నాలుగుభాషల విరోధానికి ప్రాబల్యానికి సరికాలేకపోయినది. ప్రథమమున ఐరేనియనుల భాషాపదములను గ్రహించినది. పారశీకుల 'దిపి'శబ్దమును 'లిపి' గా సంస్కృతము స్వీకరించినది. క్షత్రప, ముద్రా, మిహిరశబ్దములు పారశీకులవే. గ్రీకుభాషలో నుంచి 'సురుంగ' (Syrinx), హ్యద్రోగ (Hyrdrochoos), క్రమేల (Kalamos), జవనికా మొదలైనవి వచ్చినవి. హాలుని సప్తశతి "కలమ" శబ్దమే కనబడుతుంది. ద్రావిడభాషలలోనుంచి మతుబాది ప్రత్యయాలు చాలా విరివిగా గ్రహించబడినవి. క్రియాపదమంతములో నుంచుట ద్రావిడాచారము. వాక్యనిర్మాణము ద్రావిడులదే. కపి, నీర్, కృష్ణేత్యాదిశబ్దములు వారివే. ఈ లక్షణాలు కేవలము ద్రావిడభాషలలోని వైశిష్ట్యాలు గావు. ఇవి అన్ని ప్రాకృతాలకు చెందినవి.

ఈ విశేషాలను పరిశీలించి ఆంగ్లభాషలోవలె సంస్కృతములోకూడా ఒకానొకప్పుడు సంకరసంస్కృతకాలమున్నదని డా. థామస్ అభిప్రాయము. సంకరమనగా ప్రాకృతసమ్మిళితము. ఇట్టిభాషలో "మహావస్తు" వ్రాయబడినది. కాని సంస్కృతమెన్నడైనా వ్యావహారికభాషగా ఉన్నదా? భావవేగమందు వర్ణముల ద్విరుక్తి, ప్రగృహ్యము అను పాణినీయ భావాలు వ్యావహారికదశానిర్దేశకాలు. ఏతదుపోద్బలప్రయోగాలు ఛందసి, నిగమే, మంత్రే, భాషాయాం ఇత్యాదులు. పాణిని అనేక వ్యావహారికప్రయోగాలను గుర్తించినాడు.

ఆతురతతో తినటానికి 'ఖాదఖాదేతి ఖాదతి'. కడుపునిండా తిన్న డనటానికి 'ఉదరపూరం భుంక్తే'. తినటం, తందనాలాడటం పని అనటానికి 'అత్ర ఖాదత మోదతా వర్తతే.' పడ్లకంకెలు నరుకుమనటానికి 'జహి స్తంబో ఽయం'. ఇలాగే దండాదండి, కేశాకేశీత్యాదులు వ్యాకరణసూత్రదుస్సాధ్యాలు. నీవు వంటలే వనేది 'అపచసి' అను వ్యావహారికప్రయోగము. నేను వెళ్ళుచున్నా ననటానికి 'యామకి'. ఇలాగే పృషోదరాదులు, గణపాఠము వ్యావహారికప్రకారాలిని వ్యక్తీకరించునవి.

ప్రాకృతములలో ఋ, ఌ వర్ణాలకు లోపము అయినది. ఋషి, కృషిశబ్దాలు ఇసి, కిసి ఐనవి. ఐ ఔలు అదృశ్యాలు. అనునాసికాక్షరాలు నకారముగాను, శషసహా కారాలు సకారముగాను మారిపోయినవి. 'శకుంతలా' శబ్దము ప్రాకృతములో 'సఉన్దలా' పొందింది. సంయుక్తాక్షరాలు ద్విత్వాలైనవి. హల్లులు కొన్ని అదృశ్యాలైనవి. 'సంయుక్త' శబ్దము ముఖ్యోద్దారణ. స్వాగతములలో మార్పువచ్చినది. అజంతత్వము ముఖ్యలక్షణమైనది. ఒత్తు అక్షరములు హకారముగా పరిణమించినవి. భవతి యన్నది హోది ఐనది. పరుషాలు సరళాలైనవి. యకారము జకారము కాగా, నకారము ణకారమైనది. అనగా సంస్కృతభాషా లక్షణా లీవిధముగా నైనవని యెంచరాదు. సంస్కృత భాషలోని విశేషా లీవిధంగా కనబడుతున్నవని యెంచవలెను. సంస్కృత ప్రాకృతాల పూర్వాపరత్వముపై ఆధారపడిన దీసమస్య. వైదికభాషలోని హ్రస్వ ఎకార ఒకారాలు ప్రాకృతాలలో నున్నవి.

అశోకుడు ఏదేశమువారికి ఆభాషలో తెలిసేటట్లు శాసనాలు వేయించినాడని ప్రతీతి. గుంటూరు జిల్లాదాకా అశోకుని శాసనా లున్నవి. ఈ శాసనాలు పాళీప్రాకృతభాషలకు సన్నిహితమైన భాషలో వ్రాయించబడినవి. ద్రావిడభాషలతో సంబంధము ఈ భాషకు లేదు. అనగా అశోకుని కాలమునకు ఆంధ్రదేశభాష ప్రాకృతభాషా విశేషమే. కావున నేటి తెలుగు తత్త్వత మన దేశానికి వచ్చినదా, లేక ఆ ప్రాకృతభాష పరిణామమే తెనుగుభాషా? గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృతములో ఆంధ్రదేశమున తన బృహత్కథ వ్రాశాడు. ఆంధ్రరాజైన హాలుడు ప్రాకృతములో తన సప్తశతిని వ్రాశాడు. పైశాచీ భాషలో సకారము, శ, ల, నకారా లున్నవి. భట్టిప్రోలుశాసనములో చకారముకూడా కనబడుతున్నది.

ప్రాకృతా లన్నింటిలోనూ తత్సమతద్భవదేశ్య పదా లున్నవంటారు. తన్మాత్రంచేత ప్రాకృతం సంస్కృతములోనుంచి శబ్దాలను మార్చిన దని యెంచరాదు. సంస్కృతశబ్దాలు వైదికకాలంనుంచీ ఎలా వచ్చినవో, అలాగే ప్రాకృతశబ్దాలు. వీనిలో తుల్య శబ్దాలను తత్సమా లన్నారు. ఇక్కడ తచ్ఛబ్దానికి సంస్కృతమని అర్థము చెప్పటం యుక్తంకాదు. వైదికమని చెప్పితీరాలి. ఆ తత్సమాలు సంస్కృతములో కూడా ఉన్నవి. అలాగే తద్భవాలు వైదకశబ్ద భవాలు. దేశ్య మనగా దేశకాలపరిస్థితుల కనుగుణంగా మారిపోయిన వైదికశబ్దాలని చెప్పుకోవాలి. ఇలా వ్యాఖ్యచేస్తే సంస్కృతంలోకూడా తత్సమతద్భవ దేశ్యాలు కన్పిస్తవి. ఈ విభాగనిర్ణేతలు సంస్కృతము సర్వభాషాజనని అనే మార్గములో బడి, వైదికభాషను విస్మరించారు. వైదికభాషలకు, నేటి భాషలకు గల క్రమము (Continuety) మరచి పోరానిది. నేటి భాషాతత్త్వవేత్తలుకూడా ఇదే తప్పులో పడిపోయినారు.

౫

దేశ్యపదాల సమూహం కల భాషను అపభ్రంశము అన్నారు. సంస్కృతము సర్వభాషాజనని అనేవారు ఋషి, ఇసి శబ్దాలను చూచి, ఇసి అపభ్రంశమంటారు. కాని వీనిలో ఏది ప్రాచీనము? ప్రాకృతాలు సాహిత్య భాషలైన కాలానికి అవికూడా Standardize ఐనవి. కృతకాలైనవి. కాని జనసామాన్యము సాహిత్యశ్రేష్ఠులు, ప్రాకృతవ్యాకర్తలు శాసము చెప్పినట్లు నడచుకోలేదు. తత్ఫలితముగా ప్రాబల్య మందిన భాషలను అపభ్రంశ భాషలన్నారు. ఇందులో దేశ్యశబ్దప్రాబల్యమున్నది. ఆభీరగుర్జరాదిజాతు లీ భాషను బాగా పైకి తెచ్చినవారు. వీటికి, వైదికభాషకు అనవచ్ఛిన్నక్రమము కలదు. వీనిలోనుంచి నేటి భారతీయభాష లుద్భవించినవి. అనగా నేటి భారతీయ భాషలకు పూర్వరూపము వైదికకాలములోని భాషా శాఖలు (Dialects). కావున భారతీయ భాషాతత్త్వశాస్త్రానికి, భారతీయ భాషారూప గ్రహణానికి వైదికభాషాశాఖల జ్ఞాన మత్యంతము అవసరము. ఋగ్వేద ఋషు లనినట్లు—

"దేవీం వాచ మజనయంత దేవాః
తాం విశ్వరూపాం పశవో వదంతి
సానో మంద్రేష మూర్జం దుహానా
ధేనుర్వా గస్మా నుపసుష్టు తైతు."

# నవలకు నవజీవనం పోసిన డాస్టోవస్కీ

'చతుర్వేది' —

'నన్ను ఎవరూ చంపలేరు. ఎవరికీ శక్యంకాదు. నేను చనిపోను' అనే ఆశ అతని గుండెల్లో గంతులువేస్తోంది. అది ఎంత అసంభవమైన ఆశ! ఆ పరిస్థితుల్లో అది ఎంత హాస్యాస్పదమైన ఆశ! నేరస్థులందరితోపాటు అతన్నికూడా బలివేదిక ఎక్కించారు. ముఖాన ముసుగు వేశారు. ఈ క్షణంలోనో, మరుసటి క్షణంలోనో అతని ప్రాణం ఎగిరిపోతుంది. మరణశిక్ష విధించింది ప్రభుత్వం. ఈ విప్లవకారుడి జీవితం ఇంతటితో అంతమైపోవాలని శాసించింది. ఇక దానికి తిరుగులేదు. ఇక క్షణాలలో వుంది తన బతుకు.

అయినప్పటికీ బతుకుతాననే ఆశ. బతికి తీరుతాననే నమ్మకం! అప్పటికే మిగిలిన నేరస్థులంతా తాము చనిపోయినవారిలో చేరినట్లు భావించారు. లోకానికి వీడ్కోలుచెప్పి మృత్యువుకోసం ఎదురుచూస్తున్నారు.

ఇంతలో దౌడుతీస్తూవస్తున్న గుర్రాలడెక్కల చప్పుడు! నిరాశలో ఆశ తళుక్కుమన్నది. ఎంత విపరీతం! ఎంత ఆశ్చర్యం! ప్రభుత్వం మరణశిక్షని ప్రవాసశిక్షగా మార్చింది. ఉరికంబాలమీది కెక్కిన నేరస్థులందరినీ బందీలుచేసి సైబీరియాకి పంపించమని ఉత్తరువు వచ్చింది. మృత్యుముఖంలో నిలబడిన నేరస్థులందరికీ అనుకోకుండా ఒక్కక్షణంలో జీవనప్రదానం జరిగింది. ఈ ఆనందానికి తట్టుకోలేక కొందరికి మతి చలించింది. ఆ ఖైదీమాత్రం 'నన్ను ఎవరూ చంపలేరని ఉప్పొంగిపోతున్నాడు.

ఆ విప్లవకారుడు, ఆ ఖైదీ ఎవరో కాదు. ప్రపంచ నవలాచరిత్రలో అద్భుతమైన స్థానాన్ని సంపాదించుకున్న ఫియోడర్ మైకలోవిచ్ డాస్టోవస్కీ. నిజంగా అతన్ని ఎవరూ చంపలేరు. ప్రభుత్వమే కాదు, కాలంకూడా అతని జోలికి పోలేదు. విశ్వసాహిత్యంలో డాస్టోవస్కీ అమరమూర్తియై నిలబడతాడు.

రష్యన్ నవలారచయితలలో డాస్టోవస్కీ ప్రముఖుడు. ఇతను టాల్‌స్టాయ్‌కి పూర్వుడు. ఇతను ౧౮౨౧ లో ఒక బతికిచెడిన కుటుంబంలో జన్మించాడు. పేదరికం ఇతని ఆబాల్యమిత్రుడు. దారిద్ర్యం ఇతని పీడని వదిలిపోదు.

చిన్నప్పుడు మిలిటరీవిద్య నేర్చుకున్నాడు. కాని ఉద్యోగంలో చేరలేదు. అప్పుల, జబ్బులతో తీసుకుంటూకూడా డాస్టోవస్కీ సాహిత్యాన్ని వరించాడు. ఎందుకనో దారిద్ర్యానికీ, సాహిత్యానికీ ఇంత దగ్గర చుట్టరికం!

ఇతనికి పూర్వులైన గొగోల్, పుష్కిన్లనూ, పరాసునవలా రచయితలైన బాల్జాక్, జార్జిసాండ్స్ వంటి ప్రముఖులనూ డాస్టోవస్కీ ఆదర్శంగా పెట్టుకుని సాహిత్యరంగంలో అడుగు పెట్టాడు.

ఇతని మొదటి నవల "బీదజనం". ఇది ఒక పేదగుమాస్తా ప్రేమగాథ. ప్రేయసి బలవంతాన ఒక ధనికుని పెళ్ళాడవలసివస్తుంది. ప్రియుడు భగ్నహృదయంతో మరణిస్తాడు. నవల నాయకుని సమాధి చేసే దృశ్యంతో ముగుస్తుంది. ఈ దృశ్యం పాఠకులని గజగజ వణికించేటంత శక్తితో వర్ణించాడు. ఈ నవలలో డాస్టోవస్కీ కరుణారసాన్నీ, బీభత్సాన్నీ పోషించటంలో తనకున్న అద్భుతసామర్థ్యాన్ని వెల్లడించాడు. ఈ నవల అందరినీ ముగ్ధులను చేసింది.

ఇంతలో డాస్టోవస్కీ విప్లవభావాలు కలిగిన యువకులబృందంలో చేరాడు. ఈ బృందంమీద ప్రభుత్వంకన్ను పడింది. వెంటనే అందరినీ నిర్బంధించారు. పేరుకిమాత్రం విచారణ జరిపి అందరికీ మరణశిక్ష విధించారు. ౧౮౪౯ వ సంవత్సరం డిసెంబరు ౨౨ వ తేదీన ఇంకొన్ని క్షణాలలో ఉరితీసివేస్తారనగా ప్రభుత్వం మరణశిక్షని ఉపసంహరించుకుని నేరస్థులందరినీ సైబీరియాకి ప్రవాసంపంపింది.

డాస్టోవస్కీ నాలుగుయుగాలుగా గడిచిన నాలుగుసంవత్సరాలు సైబీరియాలో ప్రవాసజీవితం గడిపాడు. సైబీరియాలోని దుర్భరజీవనమూ, దారుణమైన బాధలూ డాస్టోవస్కీ "జీవన్మృతి" అనే పుస్తకంలో

కళ్లకుకట్టేట్లుగా, కలకాలమూ నిలిచిపోయి చదువరులను జలదరింపజేసేట్లుగా వర్ణించాడు.

ఈ దుర్భరమైన ప్రవాసజీవనం డొస్టొవ్‌స్కీ హృదయంమీద చెరిగిపోని ముద్ర వేసింది. వయసుకి మించిన ముసలితనం అతని రూపంలో పొడగట్టేది. కుంగదీసే దుఃఖభారంతో అణగారిపోతున్నట్లుగా వుండేది అతని ముఖం. అతని సదరు ముసురుకుంటున్న చీకటిమబ్బులతో అలుముకుపోయినట్లుండేది. ఈ కష్టానుభవాలవల్ల అతని మనసు విరిగిపోయింది. ఎప్పుడూ ఏవో పీడకలలు కంటూవుండేవాడు. జుగుప్సనీ, భీతినీ కలిగించే భావాలతో కాపురముండేవాడు. సృష్టిలో ఎదురుగా కనిపించే విపరీతప్రవృత్తులని సృష్టిస్తూ ఆనందించేవాడు. జీవితంలోని చేదువిషాన్ని చవిచూచిన డొస్టొవ్‌స్కీ ఇటువంటి అనుభవాలనీ, పాత్రలనీ చిత్రించటంలో ఆశ్చర్యమేముంది?

సైబీరియా నరకకూపంనుంచి బైటపడగానే డొస్టొవ్‌స్కీ పెళ్ళి చేసుకున్నాడు. సంసారస్వర్గంలో కొంత ఆశతో అడుగుపెట్టాడు. గత జీవితంలోని దుఃఖాన్నంతనీ మరిపించివేయగల సుఖం దొరుకుతుందని ఆశించాడు. కాని ఆశలన్నీ అడియాసలైనయ్. భార్య రూపంలో డొస్టొవ్‌స్కీ జీవితంలో మనఃపుశాంతిని చికాకూ, అశాంతీ, బాధా వచ్చి జొరబడినయ్. ఇక్కడకూడా అతనికి దుఃఖమే ఎదురైనది. ఇంట్లో తుపాను రేగని రోజు లేదు. బొత్తిగా మనసులు కలవని కాపురం. అదీకాక గయ్యాళిపెళ్ళాం. ఇంకేం కావాలి? అదివరకే జీవితంలోని దుఃఖంతో రోసిపోయిన డొస్టొవ్‌స్కీమనస్సు మరీ వికలమైపోయింది.

ఈ కష్టానుభవం వ్యర్థంగా పోదు. డొస్టొవ్‌స్కీ అనుభవించిన దుఃఖమే అతని సాహిత్యసృష్టికి అమూల్యమైన సామగ్రిని సమకూర్చింది. కన్నీటితో అతనికున్న చెలికారమే కరుణరసాన్ని పోషించటంలో డొస్టొవ్‌స్కీ నేర్పుకి కారణం.

సైబీరియాలో డొస్టొవ్‌స్కీ యావజ్జీవశిక్షని అనుభవిస్తున్న హంతకులతోనూ, నేరస్థులతోనూ కలిసిమెలిసి జీవించాడు. ఈ అనుభవంమూలంగా డొస్టొవ్‌స్కీకి అసాధారణమైన దృష్టి అలవడింది. మనుష్యప్రకృతిలోని చీకటినీ, పాపాన్నీ, మానవజీవితంలోని కలుషాన్నీ సానుభూతితో, సహనంతో చూడగల శక్తి అలవడింది. అన్నిటినీ చొచ్చుకుపోగల చురుకైన కవిచూపు డొస్టొవ్‌స్కీ పొందగలిగాడు. మనిషిస్వభావంలో మంచిచెడ్డలు అల్లిబిల్లిగా, కలగాపులగంగా కలిసి వుంటయ్యనే అమూల్యసత్యాన్ని కనుగొన్నాడు. మనిషి ఎంత పతితుడైనప్పటికీ, ఎంత నీచుడైనప్పటికీ అతనిలో అణగిపడివున్న మానవత్వం ఒక్కసారిగా బైటపడి కళ్లు మిరుమిట్లు గొలిపే దివ్యమైన క్షణాలు కొన్ని వుంటయ్. ఇటువంటి ఘట్టాలెన్నో డొస్టొవ్‌స్కీ నవలల్లో మనకి కనిపిస్తయ్. ఈ ఘట్టాలే మానవజీవితాన్ని తరచిచూడగలిగిన అతని శక్తికి నిదర్శనాలు. మనుష్యులను కేవలం దేవతలుగానూ, లేకపోతే కేవలం రాక్షసులుగానూ చూసే దృష్టి సాధారణమైన సంకుచితదృష్టి. అల్లా కాకుండా మనుష్యుల్లో వెలుగుచీకటుల వింతకలయికని చూసి విస్మయం చెందే శక్తి అసాధారణమైన, విశాలమైన దృక్పథంవల్లనే లభిస్తుంది. ఈ అద్భుతశక్తి డొస్టొవ్‌స్కీ సొమ్ము.

ఈ శక్తిని "నేరం-శిక్ష" అనే నవలలో డొస్టొవ్‌స్కీ కళ్లు మిరుమిట్లు గొలిపేట్లుగా ప్రదర్శించాడు. ఈ నవల ప్రపంచసాహిత్యంలోని గొప్పనవలల్లో ఒకటి. ఇది డొస్టొవ్‌స్కీ నవల లన్నిటిలోనూ మేటినవల.

రాస్కల్‌నికోవ్ అనే బీదవిద్యార్థి ఈ నవలకి నాయకుడు. డబ్బులేక మధ్యలో చదువు మానేశాడు! తన బీదరికాన్నీ, తనచుట్టూ తాండవిస్తున్న దౌర్భాగ్యాన్నీ చూసి కంపించిపోతాడు. తన వస్తువులు తాకట్టుపెట్టుకుని అప్పుపెట్టే ముసలమ్మ ఒకతె వుంటుంది. ఎల్లాగైనాసరే ఆ ముసలమ్మని చంపి దాని డబ్బుని సద్వినియోగం చెయ్యాలనే కోరిక అతన్ని పట్టి పీడిస్తుంది. చంపకుండా వూరుకోలేకపోతాడు. ఒకరోజున ఖూనీచేస్తాడు. కాని చంపిన క్షణంనుంచీ అతని మనసు పశ్చాత్తాపంతో కుంగిపోతుంది. మనస్సులో నరకయాతన అనుభవిస్తాడు. తన నేరం ఒప్పుకోవాలనిపిస్తుంది. ఎవరితోనైనా చెప్పుకుంటేకాని తనకి శాంతి దొరకదు. ఎవరితో చెప్పుకోటం? తల్లీ, చెల్లెలూ, ప్రాణమిత్రులూ వున్నారు. కాని వీరెవరికీ తన రహస్యం వెల్లడించడు. వీరెవరిముందూ తన మనసు విప్పుకో బుద్ధిపుట్టదు. తాగుబోతు తండ్రినీ, సవతితల్లినీ, సవతితమ్ముళ్ళనీ, చెల్లెళ్లనీ పోషించటంకోసం చిన్న వయసులోనే శీలాన్ని కోల్పోయిన సోనియా అనే యువతిని అతను ప్రేమించాడు. అందరూ ఛీ అని తోసేవేసిన సోనియాముందు అతనికి తన నేరం ఒప్పుకోవాలనీ, తన

మనసు విప్పుకోవాలనీ అనిపించింది. ఆమెకి చెప్పుకుంటూవుంటే అతని గుండెలమీద బరువుదించినట్లనిపిస్తుంది. ఆ క్షణంలోనే తన పాపానికి ప్రాయశ్చిత్తం ఆరంభమైనట్లు తోస్తుంది. ఈ ఘట్టంలో డొస్టొవ్‌స్కీ కరుణతో గుండెలు కరిగిస్తాడు. జాలితో జలదరింపజేస్తాడు. ఈ నవల ఒకసారి చదివినవాళ్ళకి ఈ దృశ్యం ఎన్నటికీ మరుపురాదు. చివరికి రాస్కల్‌నికోవ్ తనంతటతనే తప్పు ఒప్పుకొని పోలీసులకి చిక్కుతాడు. ప్రభుత్వం ప్రవాసశిక్ష విధించి సైబీరియాకి పంపుతుంది. ప్రవాసంలోకూడా సోనియా అతన్ని నీడకనీడలాగా వెన్నంటుతుంది. జాలితోనూ, భయంతోనూ చదువరులను కంపింపజేసే తన అద్భుతశక్తులన్నీ డొస్టొవ్‌స్కీ ఈ నవలలో ప్రదర్శించాడు.

ఈ నవలని మెచ్చుకోనివాళ్లు లేరు. కాని ఇందువల్ల డొస్టొవ్‌స్కీ జీవితంలో, స్థితిలో ఏ విశేషమైన మార్పూరాలేదు. ౧౮౬౭ నుంచీ పీటర్సుబర్గులో నివాసం ఏర్పరుచుకుని ఎన్నో పత్రికలూ, ప్రచురణలూ ప్రారంభించాడు. ఆర్థికంగా అన్నింటిలోనూ తట్టుకోలేని దెబ్బలు తాకినయ్. ఇల్లు కదిలితే చాలు అప్పులవాళ్లు జోరీగల్లాగా పట్టుకుని పీడించేవాళ్లు. చివరికి అప్పులవాళ్ల బాధ పడలేక డొస్టొవ్‌స్కీ జన్మభూమియైన రష్యాని వదిలేసి జర్మనీకి పారిపోయి తలదాచుకోవలసి వచ్చింది. అప్పులవాళ్ల బాధ తప్పినా పెళ్లాం పెట్టే బాధలు తప్పలేదు. మాటిమాటికీ మూర్ఛపడిపోతూ వుండేవాడు. అయినప్పటికీ అతని కలం మాత్రం ఊరుకోలేదు. ఈ బాధలన్నిటినీ తన మంత్రశక్తివల్ల సాహిత్యంగా మార్చివేసింది అతని లేఖిని.

ఎట్లాగో తిరిగి స్వదేశానికి చేరుకున్నాడు. డొస్టొవ్‌స్కీ జీవితంలో చివరి ఎనిమిది సంవత్సరాలూ శాంతంగా గడిచిపోయినై. ఇన్నాళ్లనుంచీ పీడించిన కష్టాలకి ఇప్పటికి అతనిమీద జాలికలిగింది కాబోలు. ౧౮౮౧ ఫిబ్రవరి ౯వ తేదీన డొస్టొవ్‌స్కీ మరణించాడు. అతన్ని సమాధిచేసిన రోజున ప్రజలు సమూహంగాకూడి జరిపిన ఉత్సవం రాజాధిరాజులకుకూడా జరగను. బతికుండగా డొస్టొవ్‌స్కీ ఎందరి అప్పులో ఎగగొట్టాడు. కాని ఆ సంగతంతా మరిచిపోయారు కాబోలు. తమరే అతనికి ఋణపడి వున్నట్లుగా, తమ ఋణం తీరదన్నట్లుగా కళ్ళనీళ్లు కుక్కుకుంటూ వేలకొలది జనులు అతని శవంవెంబడి ఊరేగారు. అంతకుపూర్వం రష్యన్ ప్రజ ఏ రచయితనీ ఇంత గౌరవించి ఎరుగరు.

డొస్టొవ్‌స్కీ నవలారచయితగా విశ్వసాహిత్యంలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించాడు. "మానవ ప్రకృతిలోని లోతులుచూడగల [illegible] డొస్టొవ్‌స్కీ నవలాసామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడు" అంతకుముందు హంతకులనూ, పతితులనూ అంత సానుభూతితో చిత్రించిన నవలారచయితలు లేరు. అతని నవలల్లో కథకీ, ఘటనలకీ ప్రాధాన్యం లేదు. ప్రతి వాక్యమూ పాఠకులకి పాత్రల చిత్తవృత్తులని పరిచయం చేస్తుంది. పాత్రల మనోభావాలు సుడిగుండాలలాగా పాఠకుడి మనస్సుని గిరగిర తిప్పుతూ లోపలికి లాక్కుపోతయ్. "రూపం, వేషం అనే బాహ్య ప్రతిబంధకాలను దాటిపోతాడు. [illegible] ఉద్రేకాలనీ, కోరికలనీ, మనస్సునీ విప్పులవిడిగా తన పేజీలలో విహరింపజేస్తాడు." పాత్రల రూపాలనీ, వేషాలనీ దాటిపోయి పాఠకులుకూడా డొస్టొవ్‌స్కీ పాత్రల మనఃప్రవృత్తులతో, భావోద్వేగాలతో కలిసిపోతారు. ఇతని పుటలలో ఘట్టాలనీ, బాహ్యరూపాలనీ దాటిపోయిన మనస్సు రెక్కలుకట్టుకుని ఎగురుతున్నట్లు కనిపిస్తుంది. తనతోపాటు చదువరులనుకూడా పాత్రల అంతరాళంలోకి తోడ్కొనిపోతాడు. ఇదే డొస్టొవ్‌స్కీ సాధించిన విజయం. ఇదే నవలకు డొస్టొవ్‌స్కీ ప్రసాదించిన కొత్త శక్తి.

నవలారచయితగా డొస్టొవ్‌స్కీ మునుపెవ్వరూ సాహసించని సీమలలో జొరబడి తన జయపతాకాన్ని ప్రతిష్ఠించాడు. నవలకు నవజీవనప్రదానం చేశాడు.

---



# తలుపు కిరకిర



[కథానిక]

శ్రీ. కపిలకాశీపతి

"చిన్నమ్మా, ఎవరే ఆతలుపు తీస్తోంటూరు?"

"ఏ తలుపమ్మగారూ?"

"ఆ ఒక్కమూలిన తలుపే, ఆ గదిదీ."

"పెద్దమ్మగారి గదితలుపేనా?"

"ఆ, పెద్దమ్మదే, వెధవతలుపు, కిరకిరలాడుతూ, ఎందుకే, అల్లా తీస్తావూ? అది తియ్యకూడదే."

"నే నిక్కడుంటే ఆ తలుపెవరు తీశారమ్మగారూ? మీరు నామీద కేకలేస్తారు!"

"కేకలేమిటే, కిరకిరలాడుతూ, తలుపు తీస్తోంటేను!"

"ఎంత పెద్దొట్టు పడితే అంత పెద్దొట్టమ్మగారూ. నే సాగరిమోనా పోలేదండీ. మరి మీ రే తలుపుచప్పుడిన్నారోనూ."

"స్పష్టంగా వినబడుతోంటే, తలుపు బలవంతంగా తీసినట్టు. నువ్వు కాకపోతే నేను తీశానా! ఇంట్లో మూడోమనిమన్నా లేరాయె."

"ఏమోనమ్మా, మీరన్నీ గాల్లోకబుర్లంటారు."

శాంత పడగ్గదిలోంచి ఇవతలికొచ్చి, వరండా దాటి ఎదురుగుండా వున్న మూసిన గదితలుపు దగ్గిర నుంచుని పరీక్షిస్తోంది. ఆ గది ప్రస్తుతం మూసివెయ్యబడింది. నెలరోజులైంది. అదివరకు పదేళ్లు ఆ తలుపు రాత్రింబగళ్లూ తెరిచేవుండేది. బూజు దులపడానికి కూడా ఎప్పుడన్నా అటూ ఇటూ కదిల్చిన జ్ఞాపకం కూడా శాంతకి లేదు. నాలుగు కిటికీలూ తెరుచుకుని, తలుపు బార్లా తీసుకుని, గదిమధ్య మంచంమీద పక్కేసుకుని పడుకునేది ఆవిడ. పెద్దమ్మగారు. శాంత అత్తగారు. పోయి సరిగ్గా నెలరోజులైంది. చెడ్డనక్షత్రం కావడంవల్ల ఆగది ప్రస్తుతం మూసెయ్యవలసివొచ్చింది. అందుకు శాంతకి విచారం లేదు. మూసేసివుంచడమే ఆవిడ ఉద్దేశ్యం. ఆ గది ఎందుకూ వుపయోగించాలని ఆవిడికి లేదు. అసలు అత్తగారు పోయినందుకే విచారం లేదు. కేవలం తను కోడలూ, పోయినావిడ అత్తగారూ అనే సహజసంప్రదాయిక కారణంవల్లనే కాదు. శాంత కాపరాని కొచ్చి పదేళ్లయింది. ఇన్ని సంవత్సరాలూ అత్తగారు లేచి తిరగ్గా ఆవిడ బహిరంగంగా చూడలేదు. అంతా పడుకున్న తర్వాత ఆవిడ లేచి గదిలో పచార్లు చేస్తూవుండేవని శాంతకి తెలుసును. అది కేవలం వో నమ్మకం కాదు. చిన్నమ్మి చూసింది. తనకీ చూపించింది. అందరూ మేలుకుండగా ఎందుకు అల్లా పడుకుని వుండేవో. ఈ పడక ప్రారంభం, శాంత అత్తారింట్లో అడుగుపెట్టడం ఒక్కమాటే జరిగాయి. పునస్సంధానం తర్వాత మూడునిద్దర్లకి వొచ్చింది శాంత. బండి దిగి గుమ్మం ఎక్కుతోంటే చిన్నమ్మి కాళ్లుకడుక్కునేందుకు నీళ్లు తెచ్చియిచ్చింది. ఏవో ఎర్రనీళ్లు దిగదుడిచి పోసింది. అత్తగారుమాత్రం గదిలోంచి రాలేదు. చూస్తే పక్కమీదే కూచుంది. స్ఫురద్రూపి. పచ్చని శరీరం. నిండైన జుట్టు. పోయేదాకా కేశఖండన కాలేదు. మామగారు చిన్నప్పుడే పోయినా. మెళ్లో గొలుసు, దుద్దులు, ముక్కుపుడకా, చేతులికి సన్నటివి నాలుగు జతల గాజులూ, మల్లెపువ్వులాటి తెల్లని జరీనేతచీర— డవేజరురాణీలా వుండేది. తక్కిన వేషం అంతా ఎంత

కళకళలాడుతూవుందో, ఆ ముఖం అంత ధుమధుమలాడుతోంది. చివరదాకా అల్లాగే వుండేది. అత్తగారి నవ్వు శాంత ఎరగదు. నవ్వితే అందంగానే వుండి వుండేది. అసలు ఆవిడ ఎప్పుడన్నా నవ్విందో లేదో! తనెరిగున్నంతవరకు సంధ్యారాగంలో నల్లని మబ్బులా వుండేది ఆమనిషి. ఎంతో గంభీరం, పౌరుషం, వొయ్యారం. నిజంగా భర్త వయసుతనంలో ఈవిడ్ని విడిచిపెట్టలేక పోయివుండవచ్చు. ఆసుఖమైనా ఎన్నాళ్ళు? చిన్నతనంలోనే ఆయన వెళ్లిపోయారు. ఒక్క కొడుకుని మాత్రం తన పేరుమీదుగా ప్రసాదించి. రమణారావంటే తల్లికి ప్రాణం. తండ్రిపోయేసరికి రెండేళ్ళు. మళ్ళీ తండ్రి పోలికే. సర్గ్గా ఆయన నోట్లోంచి వూడిపడ్డాడు. ఆ కొడుకుని చూసుకుని బతికేదట. మామగారు పోయిన పదోరోజుని ముసలమ్మలూ, ముసలయ్యలూ వొచ్చి శేశఖండనం కావాలంటే, ఆవిడ ససేమిరా అంది. "నా చిట్టితండ్రి నన్ను చూసి హడిలిపోతాడు. వాడి కోసం నేను జీవించాలి. ఆ వికృతరూపంతో వాణ్ణి నేను పెంచదల్చుకోలే" దంది. అప్పట్నించీ ఒక్క పసుపూకుంకం తప్ప తక్కిన ఏ బహిరంగ అలంకారమూ ఆవిడ మానలేదు. గదిలో ఎప్పుడూ అగరొత్తులు వెలుగుతూవుండవలిసిందే. తల కెప్పుడూ అగరునూనే. గంధంసబ్బుతప్ప మరోటి పనికిరాదు. కాశ్మీరంనించి వొచ్చిన పునుగుసీసాలు బల్లమీద వుండేవి పచ్చకర్పూరంతో తాంబూలం వేసుకుంటే ఘుమఘుమ లాడిపోవలిసిందే. ఆ ఎర్రని పెదవులు పోయే వయసుని కప్పేసేవి. అంత అందగత్తెకి గర్వం వుండడం తప్పుకాదు. కానైతే సంతోషంగా ఎందు కుండకూడదని శాంత సందేహం. ఎప్పుడు తను చూసినా తుమ్మల్లో పొద్దు కూకుతున్నట్టు వుండేది. ఒక్కగా నొక్క కొడుకు. పోరూ పొక్కూ లేదు. పుట్టింటి దగ్గర్నించి లేచివొచ్చి స్వయంగా, స్వతంత్రంగా పట్నంలో కాపరంపెట్టి, మగవాడికంటే ఎక్కువగా వ్యవహారాలన్నీ చక్కబెట్టుకుని, కొడుక్కి చక్కగా చదువుసంధ్యలు నేర్పించి, వో యింటివాణ్ణి చేసింది. తను స్వయంగా ఏరికోరి, ఎంతమందినో చూసి వెనకాముందూ ఎవరూ లేకపోయినా శాంతని మెచ్చుకుని ఇంటికోడలుగా చేసుకుంది. ఆ కోడలూ కొడుకూ సుఖంగా కాపురం చేస్తోంటే చూసి సంతోషించలేదా? ఏమిటో ప్రకృతి అని శాంతకి శాశ్వతసందేహం.

శాంత మెట్లెక్కి లోపలి కెళ్లగానే, వనకాలే రమణరావు వొచ్చాడు. భార్యని తీసుకెళ్లి, దంపతి సహితంగా తల్లికి దణ్ణం పెట్టాడు. వెంటనే లేచి కావలించుకుంటుందేమో అనుకుంది శాంత. ఇంత సౌందర్యవతి, సంభ్రమవతి, సద్గుణశాలి, ఆ పేరుమంచుకురాలు తనకి అత్తగారు కావడం తన పూర్వజన్మ పరిపాకం అనుకుంది, అత్తింటి కొత్తకోడలు శాంత.

అత్తగారు అలాంటి పని ఏమీ చెయ్యలేదు. వెంటనే బొడ్లోంచి, వెండిగొలుసుకి వేలాడుతున్న తాళపుచేతులగుత్తి తీసి కొడుకుచేతులో పెట్టేసి "నాయనా, నా అధికారం అయిపోయింది. చాల్లే నప్పజెప్పేస్తున్నాను. ఈ ఇంటికి యజమానురాలు ఇకమీద ఆవిడ. మీరూ మీరూ ఏం చేసుకుంటారో మీ యిష్టం" అంది.

శాంతగుండె గుభేలుమంది. రమణరావు చిక్క మొహం వేసి భార్యకేసి చూశాడు. ఆవిడ తలవొంచుకుని వుంది. అయినా తేరుకుని, "అదేమిటమ్మా, దానికేం తెలుసును? చిన్నపిల్ల! ఈ ఇల్లు ఇదివరకెల్లా జరుగుతోందో అల్లాగే జరగడం నా వుద్దేశ్యం. నీకే సర్వాధికారం."

"అనగానే సరా నాయనా! ఈ వేళ కాకపోతే, రేపైనా అప్పజెప్పవలసినదాన్నే. అంత్య నిష్ఠూరంకంటె ఆదినిష్ఠూరం మెరుగు. నా కేమీ పెత్తనం, పెదబొబ్బలూ వొద్దు నాయనా" అని కొంగు కంటికి చేర్చి ఏడవడం మొదలుపెట్టింది.

శాంతకి పంచప్రాణాలూ పైకి పోయాయి. చిన్నమ్మ వొచ్చి లోపలికి తీసుకెళ్లి, వేడినీళ్లు పోసి ముస్తాబు చేసింది.

తర్వాత తల్లీకొడుకూ ఏంమాట్లాడుకొన్నారో, ఆ రోజు మొదలు అత్తగారుపోయేదాకా తల్లీ, కొడుకూ తన యెదురుగుండా మాట్లాడుకోడం శాంత చూడలేదు. మాట్లాడుకోలేదని కాదు. మాట్లాడుకునేవారు. తనఎదు

రుగా మాత్రం వారు ఎప్పుడూ ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకోవడం తనెరగదు.

రాత్రి వొంట్లో బాగుండలేదని అత్తగారు భోజనానికి రాలేదు. ఆ తర్వాత ఆవిడ పంక్తిభోజనం చెయ్యలేదు.

శాంత పడగ్గదిలో కుర్చీమీద కూచుని గోడమీద ఎదురుగా వున్న రమణరావు చిన్నతనం ఫోటోగ్రాఫులు చూస్తోంది.

తల్లి గదిలోంచి రమణరావు వొచ్చి, గది తలుపులు నెమ్మదిగా వేసి, శాంతపక్కని కుర్చీ చెయ్యిమీద కూచున్నాడు. శాంత ఏమీ మాట్లాడలేదు. అత్తగారి విపరీతస్వభావం సంగతే ఆవిడ ఆలోచిస్తోంది. అతను కూడా అదే ఆలోచిస్తున్నాడని ఆవిడకి తెలుసును. అతనికి తల్లిమీద ఎంతఅపేక్షో కూడా తెలుసును. "నాకు దేవుడూ, దెయ్యమూ కూడా ఆవిడే. ఈ లోకంలో ఆవిడకంటే నాకు ఎవరూ లేరు. తక్కిన వారంతా ఆవిడతర్వాతనే" అన్నాడు. మొదటిరోజు పరిచయంలోనే. ఆ రోజునే తనకీ, ఆవిడకీ రమణా రావు హృదయంలో వుండే తరతమాలు శాంత అర్థం చేసుకుంది. అవును. ఆశ్చర్యం ఏమిటి? చిన్నప్పట్నించీ పెంచింది. కన్నతల్లి కొడుకుకంటే ఆవిడకి మరెవరు? కొడుక్కి ఆ తల్లికంటె మరెవరు? కొత్తగా కాపురానికొచ్చిన చిన్నతనంలో, కాపురంలో కష్టసుఖాలు వొంటికి పట్టని అర్థంకాని భయంతో కూడిన ఆ నూతన సంసారంలో ఆవిడకి ఈ విషయం గమనింపులోకి రాలేదు. క్రమేణా వయస్సు వృద్ధిఅయి, స్త్రీత్వం వికసించి, దాంతోపాటు భర్తఅంటే ఏమిటో పూర్తిగా తెలుసుకొని, అతనిమీద అపేక్ష కలిగి, అది అతిశయించి, తత్వం బోధపడేసరికి, శాంతకి పార్వతీదేవిలా అర్థనారీశ్వరం కావాలనిపించింది. కాని దీనికో పెద్ద ప్రతిబంధకం కలిగింది. ఆ ప్రతిబంధకమే అత్తగారు. శాంతకి అసూయ కలిగింది. అనుమానం కలిగింది. అత్తగారు తనకంటే అందంగా ఉండాలని ప్రయత్నిస్తోందా? ఉండనీ, వుంటే తనకేం? కాని తన భర్తకీ, తనకీ మధ్య సంసారసుఖం హాని చెయ్యడం ఎందుకు? పానకంలో పుడకలాగ ఈవిడెవరు? భర్తతల్లి. తల్లయితే తల్లిలావుండమను. చిన్నపిల్లవాడా పొత్తుల్లో పెంచడానికి? ఆయనకి స్వేచ్ఛ ఎందుకు ఇవ్వదు? —ఇవే శాంత తెగని సమస్యలు. అసలు ఈ అనుమానమే ఆవిడకి కలిగేదికాదు; అత్తవారింట్లో తొలినాటి సంఘటన అంత విడ్డూరంగా లేకపోతే.

ఏవో రెండు మెతుకులు నోట్లో వేసుకుని భర్తా, తనూ గదిలో కూచున్నారు. అంతకిక్రితం మూడు నాలుగురోజులు జాగారంతో, బడలికతో, వేడినీళ్ళ స్నానంతో, అత్తగారి ఉదాసీనంతో నలిగి నల్లేరయిపోయిన ఆ ముగ్ధ ఈ కొత్త వాతావరణంలో పురుగులు కొరికి విడిగా గాలిలో వేలాడే తాటియాకులా రెపరెపలాడిపోతోంది. అత్తగారి విపరీత స్వభావం విషయం భర్తతో చర్చించడానికి వీలులేదు. అతని మనస్సులో బాధగా ఉందని తనకి తెలుసును. తన మనస్సులో బాధగావున్న సంగతి అతను గ్రహించాడు. పెద్దదైన తల్లిమీద అపేక్ష, గౌరవం, కొత్త భార్యమీద మమకారం, ముభావం, వీటిమధ్య ఆ కుర్రవాడుకూడా ఏం చెయ్యడానికీ తోచక, ఎల్లా పలకరించాలో పాలుపోక మెల్లిగా శాంతితల నిమురుతున్నాడు.

అప్పుడు సంభవించింది ఆ సంఘటన. బైట తలుపువగ్గిర పెద్ద చప్పుడైంది. తలుపు ఎవరో శరీరం అంతా ప్రయోగించి దౌర్జన్యంగా తోసినట్లయింది. తీసేసరికి వరండాలో మూటకట్టినట్టు కుదేలబడివుంది అత్తగారు; ఒగరుస్తూ, కళ్లు తేలేస్తూ, చేతులూ కాళ్లూ ఆడిస్తూ. ఆ కళ్లలో స్పృహ పూర్తిగా వున్నట్టు శాంతకి అనిపించింది. పాపం! అల్లా అనుకోకూడదనుకుంది. భర్త డాక్టరుకోసం వెడితే వొచ్చేదాకా శైత్యోపచారాలు చేసింది. కూచున్నంతసేపూ శాంతకి ఒకటేమాట జ్ఞాపకం వొచ్చింది—"నాకు దేవుడూ, దెయ్యమూకూడా ఆవిడే."

నిజమే. దేవతాంశం అయిపోయి, దెయ్యంపాత్ర ప్రారంభించింది కాబోలు. పరమేశ్వరుడా ఏమిగతి? ఈ రాక్షసకొంపలో ఎల్లా ఉండడం అని శాంతహృదయం కుమిలిపోయింది.

డాక్టరు వొచ్చి మొగుడుతో ఏం చెప్పాడో ఆ నాటికీ, ఈ నాటికీ శాంతకి తెలియదు. ఆవిడ భర్తని అడగలేదు. ఆయనా చెప్పలేదు. కాని ఆ రాత్రి మొదలు పోయేవరకూ అత్తగారుపడుకున్న పక్కమీంచి లేచి కూచోడమే గాని, అందరూ చూస్తోండగా నడవ లేదు. అల్లా కూలబడిపోయింది. తన సింగారంమాత్రం మానలేదు. భోజనాది కార్యక్రమం ఆ గదిలోనే. ఇల్లు కూడా ఆవిడ అనుకూలంకోసం మార్పించి కట్టించారు. చిన్నమ్మీ, కొడుకూ అజ్ఞ లేకుండా ఆ గదిలోకి వెళ్ళొచ్చు. కోడలుమాత్రం, కొడుకుతోపాటు పొద్దున్న కాఫీ ఆ గదిలో పుచ్చుకోవాలి. శాంతకి ఈ నాటికీ కాఫీమీద రుచిపోయింది.

ఆవిడ ఆ వేళ ఎందుకు పడిపోయింది? తనూ, కొడుకూ ఓ గదిలో ఉండటం చూసి సంతోషిద్దామనా? కాశీకి వెళ్ళినంత పుణ్యంట. చూడలేకపోయిందా? చిన్నమ్మి అనడం గుండెజబ్బంది. పదేళ్లులేవలేని గుండెజబ్బేమిటి? కొడుకుమీద ఆపేక్ష మలుచుకోలేక పోయింది గావును. తనలోంచి పుట్టి, తనచుట్టూ ఉపగ్రహంలా తిరిగే కొడుకు మరోగ్రహంచుట్టూ తిరగడం ఇష్టం లేకపోయింది. సహించలేకపోయింది. తన ఆకర్షణ, అధికారం వృద్ధిచేసుకుని, కొడుకు ఉపగ్రహాన్ని తన వేపు లాక్కుందామని ప్రయత్నించింది. భూమికీ సూర్యుడికీ మధ్య చంద్రుడిలా వుంది రమణరావు పని. శాంతికి మాత్రం నిత్యగ్రహణాలతో కాలం వెళ్లిపోయింది. ఒక రోజా, రెండు రోజులా? పదేళ్లు. రాళ్లలాటి పదేళ్లు. సంసారసుఖం లేని, పిల్లలులేని, సంతోషంలేని పదీ × మూడువొందలా అరవైఅయిదు రాత్రుళ్ళూ, పగళ్ళూ! అబ్బ! ఎల్లా భరించింది?

ఆ తలుపుదగ్గిర నుంచుని కిరకిరశబ్దకారణం అన్వేషిస్తున్న శాంతకి ఈ పది సంవత్సరాల జీవితచర్యా తలలో సినీమాలా గిర్రున తిరిగింది. తల గిరగిర తిరిగింది. వొళ్లు తూలిపోయింది. కింద పడిపోయింది.

ఆ వేళే అత్తగారి నెలమాసికం. రమణరావు ఏవో పట్టుకురావడానికి బజారు వెళ్లాడు. వంటమనిషి ఇంకా రాలేదు. చప్పుడు విని చిన్నమ్మి వొచ్చిచూసింది. అవిడైంది, ఇంక నీవిడా అనుకుంది. 'అమ్మయ్యో! అయ్యా కెంత కష్టం వొచ్చిందనుకుంది. నెమ్మదిగా శాంతని గదిలోకి తీసుకెళ్లి పడుకోపెట్టి ముఖాన్ని కాసిని చన్నీళ్లు కొట్టింది. నెమ్మదిగా ఆవిడ తెప్పరిల్లింది.

"చిన్నమ్మీ! పెద్దమ్మగారు నన్ను వొదలిపెట్ట లేదే. దెయ్యమై బాధిస్తోందే. ఆ తలుపు తెరిచి నేను ఏంచేస్తున్నానో చూస్తోందే" అంది.

"ఏంటమ్మగారూ? అన్నీ పైత్యపు మాటలూ. మాట్లాడక పడుకోండి. అయ్యగారింటే హడిలిపోతారు. ఇప్పటికైనా ఆయన్ని సుఖపడనియ్యండమ్మా"...

అంటోండగానే కూరలసంచీ పట్టుకుని రమణరావు వొచ్చాడు. వొస్తూనే భార్యని వెతుక్కుంటూ గదిలో ప్రవేశించాడు. అతనికి ఇంకెవరున్నారు, భార్యతప్ప. అందుకనే గబగబా ఆవిడ గదిలోకి వొచ్చాడు. వొచ్చే సరికి ఈ దృశ్యం! అతను నిలువునా నీరైపోయాడు.

"భగవంతుడా, పదేళ్లు తల్లయింది. ఇప్పుడు పెళ్ళామా?" అని వాపోయాడు.

చిన్నమ్మి జరిగిందంతా చెప్పింది. చివరికి ఏడుస్తూ "పెద్దమ్మగారు దెయ్యమై పట్టుకున్నారని పలవరిస్తున్నారండీ" అంది.

అతను భరించలేకపోయాడు. ఏదో అంతా అయిపోయింది, ఇప్పటికైనా సుఖపడదామనుకుంటే ఇదేమి ఖర్మంరా అనుకున్నాడు. వెంటనే వెయ్యివూహలతో, బాధలతో, బరువులతో, అడీఆడని కాళ్లతో డాక్టరు దగ్గిరికి వెళ్లాడు. డాక్టరు వొచ్చి అంతా విన్నాడు. అన్నీ పరీక్షించాడు. శాంతవొళ్లు కొంచెం వెచ్చగా ఉంది. డాక్టరుతోపాటే రమణరావుకూడా పగటివేళ ఆవిణ్ణి మొదటిసారి పూర్తిగా పరీక్షించాడు. ముఖం పాలిపోయింది. గుండెలు రైలులా పరుగెత్తుతున్నాయి. డాక్టరికి ఏమీ తోచలేదు. డాక్టర్ని పిలిపించమన్నాడు. రమణారావు వెళ్లాడు. ఈ లోగా శాంత పేలాపన ప్రారంభించింది. "అత్తయ్యా, మిమ్మల్ని నేనేం చేశాను? మనస్సులో ఏమన్నా అనుకుంటే క్షమించండి. చిన్నతనం. తెలియదు. నన్ను చూసి కాక పోయినా మీ కొడుకుసుఖంకోసమైనా మీరు ఇల్లువిడిచి వెళ్లిపోండి. మిమ్మల్ని మా మనస్సుల్లో పూజిస్తాం. అత్త

య్యా, నాముద్దు ఒక్కటీ చెల్లించరూ" అంటో ఏదో ఏదో అంటోంది. మాట్లాడుతోనే వుంది. విపరీతమైన వికారంతో లేచి బ్రహ్మాండంగా వాంతులు చేసుకుటోంది. వెళ్లిపోడానికి లోపల ఆధరువు ఏమీ వున్నట్టు లేదు. లేత తమలపాకువంటి మనిషి ఆ వికారపు పట్టులో ఎర్రగా కందిపోయింది. యమబాధపడుతోంది. చిన్నమ్మి తల పట్టుకుంది.

లేడీడాక్టరూ, రమణారావూ వొచ్చారు. ఆవిడ కథంతా వింది. అత్తగారి గదితలుపు తెరిపించి అంతా పరీక్షచేసింది. తిరిగి వొచ్చి శాంతని బుజ్జగించి ప్రసన్నం చేసుకుంది. మగడాక్టర్నీ, రమణారావునీ గదిలోంచి వెళ్ళిపొమ్మంది. తలుపేసింది. పరీక్షచేసింది. ఆవిడ పరీక్షచేస్తూండగానే శాంతకి వాంతి వొచ్చింది. ఆ పట్టు వదిలినతర్వాత డాక్టరు చిరునవ్వుతో శాంతని అడిగింది:

"అమ్మా, నీకు ఈ యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోదామని వుందా?"

శాంత పాలినముఖంలో చిరునవ్వు ఉదయించి, అవునన్నట్టు తలవూపింది.

"కూర్తాళం వెడతావా?"

"ఎందుకు?"

"అక్కడ ఆశ్రమంలో స్వామి సాన్నిధ్యంలో వుంటే ఏ దెయ్యాలూ నిన్ను బాధించలేవు."

శాంతముఖం విప్పారింది. "వెడతాను" అంది.

"తీసుకెళ్ళమని మీ వారితో చెప్పనా?"

"చెప్పండి"

"అంతేనా నీ రుగ్మత?"

శాంత తల వూపింది.

డాక్టరు తలుపు తీసింది. అవతలికి వెళ్లి, మగ డాక్టర్నీ రమణారావునీ పిలిచి దూరంగా తీసుకెళ్లింది. ఆదుర్దాతో రమణారావు చేతులు జోడించుకుని వింటున్నాడు.

"అపాయం ఏమీ లేదుగదా?"

"త్వరలో మేలుకున్నారుగనక లేదు"

"జబ్బేమిటి?"

"కొంచెం గ్రహసంబంధమైనదే"

రమణారావుకి కోపం వొచ్చింది. వొళ్లు మండిపోయింది. "మీరు భూతవైద్యులా?" అన్నాడు కోపం బిగపట్టుకొని.

"అవసరం వొస్తే"నని డాక్టరు చిరునవ్వు నవ్వింది.

మగ డాక్టరు తెల్లబోతున్నాడు.

అప్పుడు లేడీడాక్టరు చెప్పింది: "నిజమేనండీ. ఆవిణ్ణి మీదోషం ఆవేశించింది. మీ అమ్మగారో, మీ నాన్నగారో ఎనిమిదినెలలదాకా చెప్పడానికి వీల్లేదు. వెంటనే స్థలంమార్చి కూర్తాళం తీసుకెళ్ళండి."

మగడాక్టరు పొట్టచెక్కలయేటట్టు నవ్వడం ప్రారంభించాడు.

రమణారావుభార్య గదితలుపు తోసుకుని వెడుతోంటే అది కిరకిరలాడింది.

# అహంభావము

## శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఇది నా కేలివి మామకాంగుళులు నా దీకంఠ నాదమ్ము మో
మిది నా దీ తను వస్మదీయమని—ఇంతేగాని గర్వమ్ముతో
ఇదియే నేనని చెప్పి చూపుకొన నా మృన్నిర్మితాంగమ్ములో
నెదియున్ లేదెట దాచినాడవు, ప్రభూ, ఈలో నహంభావమున్ ?

ఈ రుధిరాస్థిమాంసయుతమృణ్మయదేహప్రమోదఖేద సం
భారము నాదె యన్ తలపు మాయిక మం చొకసారి, నేనుగా
కే రివి పొందువా రనుచు నింకొకసారి తలంతు : నా అహం
కారము నన్ను లోగొని వికారుని జేయు నితాంత మీగతిన్.

ఏనను చిన్నిమాటను కుదించితి వెంత బృహద్విశేష మీ
మేనున గానరా దిది భ్రమింపగజేయు ననుక్షణమ్ము దా
లో నెటనో రహస్యమగు లోతుల దాగొని సర్వభారమున్
బూనుచునున్న రీతిని—కనుంగొనజాలను దీని నో ప్రభూ !

భ్రమ యని యంటిగాని యనరా దటు లున్నది దెందో : కాని తత్
ప్రమ నెటు లేనెఱుంగగ గలాడను ? స్రష్టవు నీ వెఱుంగవా ?
శ్రమపడు నాకు జ్ఞానము ప్రసాదముసేయుము తండ్రి ! ఇన్ని నా
ళ్లు మహి "స్వ"రూప మెయ్యదో ఎఱుంగకయుండిన నేను మూఢుడన్.

# డిడిటి

మిక్కిలి మేలైనది పదునగా..

# న్యూసిడ్

నూటికి పది వంతులు డి.డి.టి కలిసిన పౌడరు
గాయగి గారిచే తయారు చేయబడినది

DJK 6019 TEL.

★ చాలా కాలమువరకు గుణము నిలిచియుండును.
★ దీనిని తాకిన కీటకములు చనిపోవును.
★ మానవులకు నిరపాయకరమైనది.

దక్షిణ హిందూదేశమునకు డిస్ట్రిబ్యూటర్లు
ఎడిసన్ అండు కంపెని లిమిటెడ్.
మౌంటురోడ్డు.
మద్రాసు.




హైదరాబాదు సంస్థానమునకు, బీదర్ జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు
మహమ్మద్ రహీమ్ ఖలీలి.
89.బి అస్మాన్‌ఖాన్ రోడ్డు.
బెంగుళూరు పేట.

గాయగి ఇన్సెక్టిసైడ్స్ లిమిటెడ్, నెవిల్లెహౌస్, నికల్‌రోడ్డు, బల్లార్డ్ ఎస్టేటు, బొంబాయి.

# జాతకతాజకముల పరస్పర సంబంధము



= శ్రీ రాళ్ళపల్లి లు =

ఇతర శాస్త్రవిషయములలో ఎట్లోకాని, జ్యోతిష శాస్త్ర విచారమునమాత్రము మన ప్రాచీనుల దృష్టి మిక్కిలి ఉదారమైనది. ఎన్నియో శతాబ్దముల అనుభవములను క్రోడీకరించి దివ్యదృష్టిసంపన్నులు, యోగసిద్ధులు నగు వశిష్ఠపరాశరాది మహర్షిపుంగవులు లోకహితార్థమై ప్రతిపాదించిన సంప్రదాయము లనేకము లుండినా, అన్యదేశీయపండితుల హోరాశాస్త్రవిజ్ఞానానుభవములను మన ప్రాచీనులు నిరాదరించినవారు కారు. పైగా, వారి యుక్తులను, సిద్ధాంతములను, సంప్రదాయములను గమనించి, తమ యనుభవమునకు తెచ్చుకొని, క్రమక్రమముగా వానికి తమ గ్రంథములలో యుక్తస్థానము నిచ్చి గౌరవించినారుకూడ. ఇట్టి కార్యము శాస్త్రాభివృద్ధికి వాస్తవముగా అత్యంతావసరము. కావుననే,

"యథా క్షారాదిసంతాపై
ర్హేమ్నశ్శీ ర్వర్ధతేతరాం,
తథైవ యుక్తిసోపాయై
శ్శాస్త్రం నిర్మలతాం వ్రజేత్."

అని మన ప్రాచీనులు శాస్త్రాభివృద్ధికి మార్గము నుపదేశించినారు. ఇది పరోపదేశ పాండిత్యప్రకటనము కాదు. ఈ ధర్మమునకు తామే మార్గదర్శకు లయినారు వారు.

చూడుడు! జ్యోతిశ్శాస్త్రప్రవర్తకులగు ఆచార్యుల పట్టికలో అన్యదేశీయులగు యవనాదులను చేర్చి గౌరవించి మన ప్రాచీనులు తమ భావౌదార్యమును, శాస్త్రాభిమానమును సహా వెల్లడించిరి. ఇదే ఆ పట్టిక:-

"సూర్యః పితామహో వ్యాసో
వశిష్ఠోఽత్రిః పరాశరః,
కశ్యపో నారదో గర్గో
మరీచి ర్మను రంగిరాః,
లోమశః పౌలిశ శ్చైవ
చ్యవనో యవనో గురుః,
శౌనకో ష్టాదశ హ్యేతే
జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః"

(కాశ్యపుడు)

ఇందు పేర్కొన్న యవనాచార్యు డెవరో, అతని నామ మేమో, మనకు తెలియదు. యవనశబ్దము గ్రీసుదేశవాసులకు అన్వయించుట సంప్రదాయము. పౌలిశశబ్దమునహా ఖండాంతరశాస్త్రజ్ఞుని సూచించునదే యందురు. క్రీస్తుశకారంభమునకు పూర్వమే—అనగా దాదాపు రెండువేల సంవత్సరములకు మునుపే—గ్రీసు, చాల్డియా, ఈజిప్టు మున్నగు దేశములలో జ్యోతిశ్శాస్త్రము విశేషముగా వ్యాప్తిలో నుండినది. దిగ్దంతుల వంటి జ్యోతిశ్శాస్త్రపండితు లుండిరి. అలెగ్జాండరు చక్రవర్తి దండెత్తివచ్చినపుడు అతని వెంట గ్రీసుదేశపు జ్యోతిషపండితులు కొందరు మన దేశమునకు వచ్చి యుండిరట! క్రీ. శ. రెండవశతాబ్దమువాడగు క్లాడి యస్టాలెమీ అను సుప్రసిద్ధశాస్త్రవేత్త వ్రాసిన సూత్రములు నేటికిని పాశ్చాత్యదేశములలో ప్రచారమందుండు హోరాశాస్త్ర సంప్రదాయములకు పరమాధారము. దండయాత్రలు, మతప్రచారము, వాణిజ్యము మొదలగు కారణములచే ఖండాంతరములవారితో మన దేశమువారికి రాకపోకల సంబంధ మేర్పడుటవలన అన్యదేశ శాస్త్రసంప్రదాయములు కొన్ని క్రమక్రమముగా మన దేశములో వాడుకకువచ్చినవి. ఖండాంతరముల వారు సయితము మన మహర్షి సంప్రదాయములు కొన్ని నేర్చుకొనిపోయియుందురనుట తప్పుకాదు.

కావుననే క్రీ. శ. నాలుగైదు శతాబ్దముల నాటికి యవనసంప్రదాయములు కొన్ని మనవారి పద్ధతులలో మిళితమైయుండినవి. యవనమతముపై వరాహమిహిరాచార్యునికి గొప్ప విశ్వాసము. యవన భాషాపదములను తన గ్రంథములలో నతడుపయోగించినాడు. యవనసంప్రదాయమునుండి నాభసయోగములను స్వీకరించి తన బృహజ్జాతకములో నితడు వివరించెను. గ్రహముల నైసర్గికమైత్రి విషయములో మహర్షిమతముకంటె యవనమతము భిన్నముగా నున్నది. గురుకుజులు సనాతన సంప్రదాయములో అన్యోన్యమిత్రులుగా నుండగా, యవనులు వారిని అన్యోన్యశత్రువు లనిరి. ఇట్లు పరస్పర విరుద్ధములగు సంప్రదాయములు రెంటిని వరాహమిహిరాచార్యుడు తన గ్రంథములో వరుసగా వ్రాసెనుకాని, ఏ పద్ధతినైనా తప్పనలేదు. భిన్నదృక్పథముతో చూచినపుడు కాని, భిన్నవిషయముల వ్యవస్థ యున్నపుడుకాని, ఈ పద్ధతులు రెండును సమంజసములే యని అతని యభిప్రాయము కాబోలును. తరువాతివారిలో కేశవార్కుడు దీనిని విపులముగా చర్చించి, వివాహపు పొంతనములను చూచు విషయములో గ్రహమైత్రిని చర్చించుసందర్భమున యవనసంప్రదాయమే ఆదరణీయ మనియు, వరాహమిహిరాచార్యుని కది అభిమత మనియు సయుక్తికముగా సాధించినాడు:—

"ఇద ముదీర్య వరాహవిరోచనో
నిజమతేనతు దూషితవాక్ పుటః,
స బహుమన్యత ఏవ యథాతథం
జయతి శాస్త్ర మిదం యవనేష్వపి."
(వివాహబృందావనము)

ఇంత ఏల? వరాహమిహిరాచార్యునికి యవనులపై నున్న గౌరవమునకు అతని బృహత్సంహితలోని యీ క్రింది శ్లోకమే. సాక్షి:—

"మ్లేచ్ఛాహి యవనా స్తేషు,
సమ్యక్శాస్త్ర మిదం స్థితం,
ఋషివ త్తేపి పూజ్యంతే,
కింపున ర్దైవవి ద్ద్విజః."

క్రీ. శ. ౧౦ నుండి ౧౫ శతాబ్దముల కాలము మన దేశమున హోరాశాస్త్రమును పునరుజ్జీవింపజేసిన నూతన యుగ మనవచ్చును. ప్రాచీనతంత్రగ్రంథము లనేకములను సంశోధించిన భట్టోత్పలాచార్యునివంటి గ్రంథకర్తలు, ఖగోళగణితశాస్త్ర పారంగతులగు భాస్కరాచార్య ప్రభృతి శాస్త్రజ్ఞులు, జాతక కర్మపద్ధతినిగూర్చి విపుల పరిశోధనచేసి యుద్గ్రంథములను వ్రాసిన శ్రీపత్యాచార్యుడు మున్నగు హోరాతంత్రవేత్తలు జనించి శాస్త్రమునకు నూతనకళ నొసగినారు.

కాని, అప్పటికి వాడుకలో నున్న దశాపద్ధతుల వలన సాధించిన ఫలములు తరువాతికాలపు విమర్శకులకు కాలనిర్దేశవిషయమున సార్వత్రికముగా తృప్తి నిచ్చినవి కావు. దైనందినానుభవములను సూచించు దశాపద్ధతి అవసరమని వారికి తోచినది. యవనసంప్రదాయములో వాడుకలో నుండిన వర్ష జాతక దశాపద్ధతిని వా రనుభవమునకు తెచ్చుకొన్నారు. అంతేకాక, ఈ పద్ధతిని విస్తరించి మాసదశ, దినదశ మున్నగు వివరములను గూర్చి విపులగ్రంథములనే వారు వ్రాసియుంచిరి. అప్పటికి ఉత్తర హిందూస్థానములో మొఘలు సామ్రాజ్యము నాశ్రయించియుండిన అన్యదేశీయ సంస్కారము సయితము మనవారికి కొంత సాయపడియుండె ననుటకు సందియ ముండదు.

అప్పటి పరిశోధకుల నెదుర్కొన్న మరియొక సమస్య కలదు. జాతకమునందలి తన్వాది ద్వాదశభావములలో ఒక్కొక్కటి నానావిధవిషయములను తెలుపజాలిన వనుట సుప్రసిద్ధవిషయము. అట్టి భావములలో ఏదైనా యొకటి దుష్ఫలమును సూచించినపుడు, ఆ భావమునకు సంబంధించిన విషయము లన్నియు సార్వత్రికముగా విషమఫలము నిచ్చుట అనుభవవిరుద్ధ విషయము. ఉదాహరణార్థమై ఆరవభావమును తీసుకొందము. ఇది సామాన్యముగా ఋణ, రోగ, శత్రువులను తెలుపు ననుట సంప్రదాయము. ఈ భావము చెడినపుడు ఆరోగ్యము చెడుట, ఋణబాధ కలుగుట, శత్రుపీడ సంభవించుట—ఈ మూడుఫలములు సర్వసాధారణముగా వచ్చుట కష్టముకదా? ఇట్టి సందర్భములయందు భావమునకు చెందిన ఫలము దానికి సంబంధించిన నానా

విధ విషయములలో ఏ ప్రత్యేకాంశమునకు మాత్రమే అన్వయించునో, దానిని సూచించుటకు ఉపాయాంతరము కావలసివచ్చినది. పై ఉదాహరణములోని మూడు విషయములలో ఒక్కొక్కదానినిమాత్రము ప్రత్యేకముగా తెలుపు విశిష్టబిందువు కల దనుకొందము. అట్టి బిందుత్రయములో ఏది స్థానదృష్ట్యాదుల మూలమున దుష్టమగునో, ఆవిషయమునమాత్రము భావఫలము ప్రకటిత మగునని సులభముగా సూచించుటకు వీలు కలుగునుగదా ? యవనపద్ధతి నాశ్రయించి ఇట్టి విశిష్ట బిందువులను సాధించి ఉపయోగించు మార్గములను ఆ కాలపు శాస్త్రజ్ఞు లలవాటుచేసుకొనిరి. ఈ బిందువులకే 'సహమ'ములని పేరు. భిన్న విషయములను సూచించుటకై రమారమి నూరుసహమములు సాధింపబడినవి. వీనికి సంబంధించిన యోగములనుగూర్చి విస్తారముగా మనవారు గ్రంథజాలమును నిర్మించినారు.

మఱియు, సనాతన సంప్రదాయములో గ్రహముల దృష్టికి మంచిదృష్టి యని, చెడ్డదృష్టియని భేదము లేదు. శుభగ్రహముల దృష్టి మంచిదే అనియు, పాపగ్రహముల దృష్టి చెడ్డదే అనియు వారు సిద్ధాంతీకరించిరి. ఆధ్యాత్మికదృష్టితో విమర్శించినప్పుడు ఈ వాదమునకు గొప్ప విలువ యుండవచ్చునేమో కాని, సామాన్యజనుల నిత్యజీవనమునగూర్చి చర్చించుపట్ల ప్రాపంచికదృష్టితో దీని నన్వయించుట చాలకష్టము. ఇంతే కాదు. స్థితివలననేమి, ఆధిపత్యమువలననేమి, పాపగ్రహములకు సైతము కొన్ని సమయములలో శుభఫలప్రదత్వము సనాతన సంప్రదాయమువా రంగీకరించియే యున్నారు. అట్టిచో, దృష్టికిమాత్రము, కొన్ని సందర్భములలోనైనా, శుభత్వమో, ఆనుకూల్యమో లేకుండుట నిష్పక్షపాతదృష్టి కల పరిశోధకులకు సమంజసముగా తోచినది కాదు. యవనసంప్రదాయములో కేంద్రదృష్టి శత్రుదృష్టి యనియు, కోణదృష్టి మిత్రదృష్టి యనియు వ్యవహారము. ఈ పద్ధతినే మనవారు స్వీకరించి దృష్టిబలాబల వివేకముగూర్చి పెక్కు సూత్రములనే వ్రాసిరి.

మఱియొక్కటి. వాడుకలో నుండిన పద్ధతిలో గ్రహము పూర్ణదృష్టిస్థానమునకు కొంత వెనుకయుండినా, ముందుండినా, ఫలస్వరూపములో వ్యత్యాస ముండలేదు. బలపరిమాణములో మాత్రము స్వల్పభేదము చెప్పవచ్చునేమోకాని, వస్తుస్వభావములో మార్పు లేదు. సమసప్తకదృష్టిని ౬ భాగలలో గ్రహ మభిలషించునప్పుడు ఆ దృష్టి నూటికి ౮౦ వంతులు బలము కలది యనియు, సమసప్తకస్థానమును దాటి ౬ భాగల దూరములో గ్రహమున్నప్పుడు ఆదృష్టి నూటికి ౯౪ వంతులు బలముకలదనియు శ్రీపత్యాచార్యుని మతము. అంతేకాని, ఫలస్వభావములో మార్పు సూచించబడలేదు. దృష్టిస్థానము నతిక్రమించిన గ్రహమునకు కాక, దాని నభిలషించు గ్రహమునకే ఫలప్రదత్వము యవన సంప్రదాయములో విశ్వసించబడుచున్నది. ఒక చిన్న దృష్టాంత మిది. అస్తమానము నభిలషించు సూర్యుడు త్వరలో మనకు రాత్రిని సంపాదించి యీగలడు. కాని, అస్తమించియున్న సూర్యుడు మన కీయగల దేమియు లేదుకదా ! అనుభవములో యవనసంప్రదాయమునకు విలువయున్నదని కనుగొన్న మనవారు దృష్టి ఫలనిర్ణయవిషయమున ఇత్థశాలాది యోగములు మన శాస్త్రమునందు చేర్చి శాస్త్రాభ్యున్నతికి త్రోవ చూపినారు.

పైన సూచించిన యవన సంప్రదాయములకు మొత్తముమీద 'తాజక' పద్ధతి యని వ్యవహారము. జాతకమను పదమును వర్ణవ్యత్యాసము చేసి ఎగతాళికై తాజక మని మనవారు పేరుపెట్టిరని కొంద రందురు. తాజకశబ్దము సామాన్యముగా మ్లేచ్ఛతురుష్కాదులను సూచించుచుండెనని క్రీ. శ. ౧౧ వ శతాబ్దపు సోమదేవభట్టుని 'కథాసరిత్సాగరము'లో ఈ క్రింది శ్లోకము తెలుపుచున్నది :—

"తత్ర తేనైవ సహితః పథి ప్రాప్యైవ తాజకైః,
నీత్వా పరస్మై మూల్యేన దత్తోభూత్తాజకాయసః
తేనాపి తావద్భృత్యానాం హస్తే శోకాలికాకృతే
మురవారాభిధానస్య తురుష్కస్య వ్యసృజ్యత"

(కథాసరిత్సాగరము-రత్నప్రభాలంబకము)

యవనాచార్యుడు పారసీభాషలో వ్రాసిన జ్యోతిశ్శాస్త్రమందలి వర్షజాతక సంప్రదాయమునకు తాజక మని వ్యవహార మున్నట్లు తన 'హాయనరత్న'

మన బలభద్రుడు నిర్వచించినాడు ఇది యిట్లుండ నిండు. సూర్యభగవానుడే ఈ ... మును యవనుని కుపదేశము చేసెనట!

"బ్రహ్మణా గదితం భానోః
భానునా యవనాయ యత్,
యవనేనచ యత్ప్రోక్తం
తాజకం తత్ప్రకాశితం."

అని 'రోమకుడు' సెలవిచ్చినాడట! ఈ రోమక మహాశయు డెవడో ఇటలీదేశపు సిద్ధాంతిగా నుండు నను టకు సంశయముండదు. కానీ, ఇతనికి సయితము మన బ్రహ్మపై నంత భక్తి! పోనిండు! ఇచట నొక చిత్ర మైన ఐతిహ్య మున్నది. పూర్వ మెప్పుడో బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముగ్గురును సూర్యునికి శాపమిచ్చిరట! ఏల శాపమిచ్చిరో, సూర్యుని అపరాధమేమో తెలి యదు. ఆ శాపఫలముగా సూర్యభగవానునికి మ్లేచ్ఛ త్వము వచ్చెనట! పాపము! ఆ మ్లేచ్ఛరూపధారి సూర్యుడు ఇటలీదేశమందలి రోమకపట్టణములో ఈ తాజకశాస్త్రమును చెప్పెనట! మన పుణ్యభూమిలోనే చెప్పియుండకూడదా? ఆ సూర్యభగవానుడు చెప్పిన కారణమున ఈ తాజకశాస్త్రము పవిత్రము, అధ్యయన యోగ్యము అయినదట! ఈ క్రిందివాక్యములను గమ నింపుడు :-

"శశివిష్ణుముఖ నిర్గతశాపాత్
మ్లేచ్ఛతాధిగత తిగ్మమరీచేః,
రోమకేచ పురి లబ్ధ మశేషం
తద్ద్విజాతిభి రతోధ్యయనీయం"

(హిల్లాజుడు)

"బ్రహ్మద్వేషి ఖురువ్య సంభవ మిదం
తాజ్రీయకం విద్య
శాస్త్రం యద్యపి సద్భిఃజ్ఞైరపి తథా
ఘు మర్హ్యాం భవేత్."

(తాజకభూషణము)

ఇంతేకాదు. కలియుగమున తాజకశాస్త్రమే సత్యమని దాని ప్రామాణ్యము నుద్ఘోషించు శ్లోక మొకటి తాజక గ్రంథములలో నుదాహరించబడు చున్నది

"కృతే పైతామహం శాస్త్రం
త్రేతాయాం బాదరాయణం,
గార్గీయం ద్వాపరే ప్రోక్తం
సుసత్యం తాజకం కలౌ."

(జీర్ణతాజకము)

సనాతనాచారపరులగు మన ప్రాచీనులు శాస్త్రాభివృద్ధికై ఖండాంతర సంప్రదాయములను వాడుకచేసు కొని స్వమతమునచేర్చి వాని కెంతటిగౌరవము నిచ్చిరో చూపుట కింత చాలు ననుకొందును. వరాహమిహిరా చార్యుని కాలమునుండి మొన్న మొన్నటిదాక మన జ్యోతిశ్శాస్త్రవేత్తల కిట్టి విశాలదృష్టియే పట్టువడి యుండుట మన అదృష్టము. అట్లుకాక, "న వదే ద్యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి" అను ధర్మ శాస్త్రవాక్యమునే వారు నమ్మికొని యుండిరేని, మన దేశమున ఇప్పటి కెన్నియో శతాబ్దములకు పూర్వమే ఈశాస్త్రము రూపనామక్రియలు లేకనశించియుండెడిది.

కాని, ఏమి కారణమో, ఇటీవల మన కార్తాంతికులకు ఇట్టి విశాలభావములు తగ్గిపోవసాగి నవి. సత్యమును విచారించితిమేని, మునుపటికాలమున కన్న ఇప్పుడే మన కిట్టి విజ్ఞానాభివృద్ధి కార్యములకు హెచ్చుగా సౌకర్యము లున్నవనుట సర్వవిదితము. అట్లుండియు, నూతనోపాయముల పట్ల మనవారిపుడు ద్వేషమో, వైముఖ్యమో చూపుచుండుట మాత్రము చింతాకరము. కావుననే శాస్త్రము త్రుప్పుపట్టసాగి నది. ఇతరశాస్త్రముల విషయమున సర్వతోముఖముగా వికాసము కలుగుచున్న ఈ కాలమున అతి ప్రాచీనమై వేదాంగముగా భావించబడుచున్న ఈ పవిత్రశాస్త్రము కళదక్కి నిద్రించుచున్నది. సామాన్యజనుల కింకను ఈ శాస్త్రముపై నభిమానము పోలేదు. వార్తాపత్రికలు 'వారఫలము'లకు చోటిచ్చుచుండుటే దీనికి నిదర్శ నము. కాని, ప్రతిభావంతులగు విద్యాధికులు ఈ శాస్త్రముపట్ల ఔదాసీన్యమో, అవిశ్వాసమో చూపు చున్నారు. కళాశాలలు, విశ్వవిద్యాలయములు దీనికి అస్పృశ్యతాదోషము నంటగట్టినవి. మన కథ యిట్లుం డగా, ఖండాంతరములలోని పండితు లిపుడు హోరా శాస్త్రవిషయమున విపులపరిశోధనలు సలుపుచున్నారు;

కళాశాలలు నెలకొల్పి విద్వత్సభలు స్థాపించినారు; అసాధారణముగా గ్రంథసామగ్రి పెరుగుచున్నది; అపూర్వవిషయము లెన్నో ఆ పండితులు కనుగొని సాధించినారు. వానినెల్ల మనవారు గమనించి ఉపయుక్తములగు అంశములను మన సంప్రదాయములో చేర్చుకొనవలసి యున్నది. నూతనోపాయములచే మన శాస్త్రమునకు వన్నె రావలసియున్నది. అట్లు కానిచో అది నిర్జీవమగుట తప్పదు.

మచ్చునకు కొన్ని ముఖ్యవిషయముల నిచట సూచించుచున్నాను :—

(i) దూరదర్శక యంత్రసాహాయ్యముచే నేమి, గణితశాస్త్రశక్తిచే నేమి, ఇంద్ర (నెప్ట్యూను), వరుణ (యురేనసు) గ్రహములను శాస్త్రజ్ఞులు కనిపెట్టి వాని దైనికచారమును తెలుపు సూత్రములు సిద్ధపరచినారు.* ఆ గ్రహములయొక్క రాశిభావస్థితులు, దృష్ట్యాది యోగములు, గ్రహావేశలు మున్నగువాని మూలమున వ్యక్తిజాతకములందేమి, సంస్థాజాతకములందేమి కలుగు ఫలవిశేషములను గూర్చి విస్తారముగా గ్రంథములు వ్రాయబడినవి. జాతక ముహూర్త ప్రశ్న చక్రములలో ఈ గ్రహములను వదలివేయుటచే శాస్త్రదృష్టితో మనకు గొప్పనష్టము వాటిల్లినది. నిష్పక్షపాతదృష్టితో విమర్శించువారికి పైయర్థమందలి సత్యము విశ్వాసార్హముగా కానవచ్చుటకు సందేహము లేదు.

(ii) పై నూతన గ్రహములను మన జాతక చక్రములలో నుపయోగింత మనుకొనుడు. సనాతన సంప్రదాయమునే ఆశ్రయించువారికి అప్పుడొక చిక్కు రాగలదు. ఏమనగా, దశలు కట్టునపుడు మన ప్రాచీన పద్ధతులలో ఈ నూతన గ్రహములకు స్థలము లేదు. ప్రాచీనులకాలములో నీగ్రహములు కనుగొనబడి యుండలేదు కనుక, వానికి మన ప్రాచీనులు దశలలో చోటు చూపరైరి. నూతనగ్రహములకు ఫలము చెప్పి దశలలో మాత్రము వాని నుపయోగించకుండుట శాస్త్రధర్మము కాదు. అగుటచే, పాశ్చాత్యులలో వాడుకలో నున్న దశాపద్ధతులనే మన మభ్యసించి వాడవలసియున్నది. రెండు శతాబ్దముల క్రిందనే మన దేశపు కార్తాంతికులు కొందరు కొంత కొంత పాశ్చాత్యదశాపద్ధతుల రుచి చూచినట్లు సూచనలు కానవచ్చుచున్నవి.

"జన్మతః ప్రాగ్విలోక్య తృతీయే దినే,
చంద్రమాశ్చేచ్ఛుభై ర్వ్యక్త దృష్టో భవేత్,
జన్మత స్తర్హి వర్షే తృతీయే శుభం
వాచ్య మేవం ఖలై ర్బాలక స్యాన్యథా."

(సంకేతనిధి)

"ఏవం ప్రాగ్జన్మతస్సప్త
మేహ్ని ఖాద్రి మితేదినే,
సదసద్దృష్టియుక్తేజ్జే
తన్మితేబ్దే తథా ఫలం"

(జాతకాదేశమార్గము)

పైశ్లోకములలో సూచింపబడిన సంప్రదాయమునకే 'దినవర్ష పద్ధతి' అనియు, 'దేవమానపద్ధతి' అనియు వ్యవహారము. ఇది పాశ్చాత్యులలో సర్వసాధారణముగా వాడుకలో నున్నది.

"ఏకాంశకేన గణయేత్ మనుజస్య వర్షాన్"

(మనుష్యజాతకము)

అను దశాక్రమము పాశ్చాత్యులలో ప్రచారములోనున్న 'ఏకాంశవర్ష పద్ధతి' అను దశాసంప్రదాయమును సూచించుచున్నది.

విమర్శించిచూచినచో ఈ రెండుపద్ధతులకు మూలసూత్ర మొకటే. దేవతల కొక దినమే మానవుల కొక సంవత్సరమని. ఈ సిద్ధాంతము మన ప్రాచీనులు బాగుగా నెఱుగుదురనుట కనేకనిదర్శనము లున్నవి. ఏడాది కొకమారు శ్రాద్ధముచేయుట, నాలుగుదినముల శిశువునకు, నాలుగుసంవత్సరముల బాలునికి సమాన ప్రక్రియతో బాలగ్రహశాంత్యాదులు చేయుట—ఇత్యా

* యమగ్రహ (ప్లూటో)మని నూతనముగా గ్రహ మొకటి ౧౯౩౦ లో కనుగొనబడినది. ఈ గ్రహము యొక్క చారమునయితము ఖండాంతరముల వారి పంచాంగములలో ఇటీవల కానవచ్చుచున్నది. జాతకములలో దీని ఫలములనుగూర్చి పరిశోధనలు జరుగుచున్నవి. దీనినిసైతము మనవారు మరవరాదు.

దులన్నియు ఈ సూత్రముపై నాధారపడినవే. అగుటచే, ఈదశాపద్ధతులు మన ప్రాచీనులకు తెలిసియుండ లేదని తలచుట సాహసము. కాని, ప్రాచీన గ్రంథములలో వీని సూచన కానరాదనుట సత్యము. అనేక విషయములను రహస్యముగా నుంచినట్లు దీనినిసైతము ప్రాచీనులు దాచియుంచిరా? చెప్పజాలము. లేక ఎన్ని తంత్రగ్రంథములు నశించినవో!

అది యట్లుండె. మనుష్య జాతకాదిగ్రంథములలో నీపద్ధతులు విపులముగా వ్రాయబడలేదు. అప్పటికి ఈ సంప్రదాయములు మనవారికి బాగుగా అనుభవమునకు వచ్చియుండలే దనుకొందును. ఇటీవల పాశ్చాత్యశాస్త్రవేత్తలు పై సంప్రదాయమును గూర్చి హెచ్చుగా పరిశోధనచేసి అనేకముగా పథకగ్రంథములు, ఫలగ్రంథములు వ్రాసియున్నారు. ఇవి నిరాదరించినచో లోపము మన శాస్త్రమునకే. మహర్షులు చెప్పినదశాపద్ధతులు నిస్సారములని నా ఆశయము కాదు, నూతనోపాయములచే వాని కెట్లు మెరుగు పెట్టవలయునో, శాస్త్రవేత్తలు శోధించవలసియున్నదని మాత్రమే నా మనవి.

(iii) ఆధానలగ్నమునుగూర్చి మన ప్రాచీన గ్రంథములలో కొన్ని యంశములు కానవచ్చుచున్నవి. కాని, జాతకఫలాదేశవిషయములో ఆధానలగ్నము నుపయోగించు సంప్రదాయము నా యెఱిగినంతలో మన కార్తాంతికుల కిపుడు వాడుకలో లేదు. సత్సంతాన సౌభాగ్యఫలప్రాప్తికై ఆధానమునకు లగ్నమును నిర్ధరించుట మన మహర్షిసంప్రదాయ మనుట అందరు నెఱిగిన విషయము. కాని, ఇప్పటి సాంఘికనాగరికతలో ఆధానకర్మకు లగ్నమే కాదు - దినశుద్ధి సయితము అక్కరలేకపోవుచున్నది. పోనిత్తము. జన్మకాలమునకు ఆధానకాలముతోగల పరస్పరసంబంధమును గూర్చి పాశ్చాత్యులలో కొందరు మహనీయులు అపార పరిశోధనలు సలిపి నూతనాంశములను కొన్నింటిని కనుగొన్నారు. ఆధానకాలలగ్నచంద్రులతో జన్మకాల చంద్రలగ్నములకు ఒక నిర్ణీతసంబంధమున్నదని వారి సిద్ధాంతము. అట్లే, గర్భస్థపిండ ప్రథమచలనకాలము సయితము ఆధానజన్మకాలములతో సన్నిహితసంబంధము కలదని వారు నిర్ణయించినారు. గర్భస్థశిశువునకు కలుగు అంగవైరూప్యాదులు ఆధానలగ్నమునుండియే నిర్ణయమగుననియు వారు చూపగలిగిరి. ఇంతే కాదు. నిషేకకాలమునుండి ఆధానకాలమును, జన్మకాలమును సాధించుటకూడ సాధ్యమని 'బెయిలీ' అను బ్రిటిషు హోరాశాస్త్రవేత్త చాటిచెప్పుచున్నాడు ఇట్టి జ్యోతిశ్శాస్త్రమర్మములు మన ప్రాచీనమహర్షుల బాగుగా ఎఱిగియే యుండిరి. కానిచో, నిషేకమునకు ఆధానమునకు సుముహూర్తములు నిర్ణయించుపద్ధతి వా రంత ప్రాముఖ్యము నిచ్చియుండరు. ఇపు డాదృష్టి మనకు నశించినది. ఖండాంతరములవారి ఊహాలు, సిద్ధాంతములు గ్రహించి మహర్షిమతములలో మన కిపుడు లభ్యములుగ నున్న సూత్రఖండములతో సమన్వయము చేయవలసియున్నది.

(iv) సామాన్యముగా మన ప్రాచీనగ్రంథములలో లభించు నుదాహరణములను గమనించినచో, లగ్నమును రాశి, భాగ, కల, వికలలుగా విభజించి— అనగా, రాశిని ౧,౦౮, ౦౦౦ పాళ్లుగా విభాగము చేసి యనుట — భావకుండలిలో నుపయోగించు నాచారము మన ప్రాచీనులకు వాడుకలో నుండినదని స్పష్టమగును. కాని, ఇపుడు సర్వసాధారణముగా కేవలరాశికుండలితోనే మన జ్యోతిష్కులు, గ్రంథకర్తలు కాలముగడపుచున్నారు. ఇట్టి అభ్యాసము మన ప్రాచీనులదృష్టికే క్షంతవ్యమని తోచదు. ఇట్టి ఆచారము ప్రబలుటకొలది గణితసాధ్యములగు ప్రాచీనపద్ధతులనేకములు మనలో అడుగంటినవి. లగ్నము, దశమకేంద్రము, ఏ అక్షాంశకైనా, సులభముగా భాగకలలలోనైనా సాధించుటకును, దైనందిన స్ఫుటగ్రహచారమును భాగకలలలో గుర్తించుటకును పాశ్చాత్యులుపయోగించుచున్న పథకగ్రంథములవంటివి మన శాస్త్రవేత్తలుసయితము సిద్ధపరచుట అత్యా వశ్యకము.

ఇంతే కాదు. అతిసూక్ష్మముగా లగ్నాదిభావములు సాధించవలసియుండుటచే, జన్మకాలమును శుద్ధముగా సవరించుట తప్పనిసరి యగుచున్నది. లగ్నశుద్ధిక్రమమునుగూర్చిన సూచనలు కొన్ని ప్రాచీన

గ్రంథములలో కానవచ్చుచున్నవి. కాని వాని ప్రయోగ సంప్రదాయము నశించిన దనవచ్చును. వాడుకలో లగ్నశుద్ధికై కొన్ని పద్ధతు లుపయోగింపబడుచున్న వన్నమాట వాస్తవమే. కాని, అవి విమర్శసహములు కావు పాశ్చాత్యులలో లగ్నశోధనవిషయమున కొన్ని గణితపద్ధతులు ప్రచారములోనున్నవి. వీనిని గూర్చి ప్రత్యేకగ్రంథములే కలవు. ఈ పద్ధతులను గ్రహించి మన ప్రాచీనగ్రంథములలో సూచించబడిన మార్గములతో వీనిని సమన్వయపరచుట ముఖ్యము.

(V) ఋతుధర్మము లిపుడు మారిన వనుట సుప్రసిద్ధవిషయము. అనగా, ఋతుచక్రముతో మనము వ్యవహారములో నుపయోగించుచున్న సంవత్సరచక్రమునకు పూర్వముండిన సంబంధము ఇపుడు వ్యత్యస్తమైనదనుట. ఋతుచక్రమునందలి మార్పులననుసరించియే భూదేవి జీవితమున మార్పులు వచ్చుచున్నవికదా? భూగోళవాసులకు మన జీవితముపైన సయితము ఋతుచక్రమునందలి మార్పులకు వ్యాప్తియుండుట తప్పదు. ఈ ధర్మమును విశ్వసించితిమేని, మన జీవితములకు సంబంధించిన జాతక చక్రములను ఋతుచక్రముతో సర్వదా సమంజస పడునట్లు సరిచూచుకొనుట యుక్తియుక్తముగా తోచకమానదు. పాశ్చాత్త్యు లుపయోగించు జాతక చక్రము ఋతుచక్రముయొక్క మార్పునకు సవరించబడినదే. మన ప్రాచీనులలో కూడ ఈ పద్ధతిని (అనగా, సాయనపద్ధతిని) వశిష్ఠాదిమహర్షులు కొందరు స్వీకరించియుండి రనుటకు సూచనలు కానవచ్చుచున్నవి.

కేచి దాహు ర్మ
న్నైత న్మమ మతం; యస్మా
న్నప్రతీత క్రాంతికక్షయా,
చలసంస్కృతతిగ్మాంశో
స్సంక్రమో య స్సుసంక్రమః,
అజాగళ స్తనఇవ
రాశిసంక్రాంతి రుచ్యతే."

అని వశిష్ఠమహర్షి నిరయనపద్ధతిని (అనగా స్థిర ఋతుచక్రపద్ధతిని) హేళనముచేసెనట! మరి, ఏమికారణమో కాని, నిరయనపద్ధతి మనదేశమున గట్టిగా పాదుకొని వేళ్లు పారినది.

ఈ నిరయనపద్ధతిలోనైనా మన పండితులలో ఐకకంఠ్యము లేదు. ఇప్పటి కయనాంశ లెన్ని యను విచారమున ఏడెనిమిది భిన్నసంప్రదాయము లున్నవట! ఏసంప్రదాయమువారి కాసంప్రదాయమే సర్వోత్తమమైనది. ఈ భిన్న సంప్రదాయమువారు నల్గురొక వ్యక్తికి జాతకము వ్రాసినచో, ఆ నాలుగుజాతకములు ఒక వ్యక్తివేయని గుర్తించుట కష్టమగు పరిస్థితి యేర్పడినది. ఇది శాస్త్రదృష్టిలో అవ్యవస్థ. ఈ విషయమున సయితము పరిశోధన జరుగవలయును.

ఇప్పటి కింత చాలును. చెప్పవచ్చినదేమనగా, ఇప్పటి జ్యోతిష్కులు శాస్త్రాభ్యున్నతినే ప్రధానముగా మనస్సున నుంచుకొని, అన్యదేశీయుల సంప్రదాయములపై, యుక్తులపై అసూయను మాని, నిష్పక్షపాత విశాలదృష్టితో పరిశోధనలు సలిపిరేని, మన దేశపు హోరాశాస్త్రసంస్కారము ప్రపంచమున వన్నెకెక్కగల దనుటకు సందియ ముండదు.

ఒక్క మనవి. అన్యదేశీయుల శాస్త్రములే పరమప్రమాణములని నా అభిప్రాయ మనుకొనరాదు. పాశ్చాత్త్యు లింక వేయిసంవత్సరములు కష్టపడి శోధనచేసి కనుగొనగల ప్రకృతిధర్మరహస్యములు మన ప్రాచీనమహర్షుల సూత్రములలోనే చూడవచ్చునను ఆశయో, అభిమానమో, గర్వమో నాకు సయితము సమృద్ధిగానున్నది. కాని, ఇప్పటి మన సంకుచితదృష్టి ప్రాచీనసూత్రములను అర్థముచేసుకొనుటకు చాలలేదు. కాక, ప్రయోగసంప్రదాయము లనేకములు ఖిలములయినవి. ఇట్టి స్థితిలో, మనకిపుడు లభించిన విజ్ఞానమే, దొరకిన గ్రంథములే చాలు ననుకొను యథాలాభసంతుష్టి అనర్థకరము. దృష్టాంత మొకటి చూపి చాలింతును.

మన దక్షిణదేశములో సర్వసాధారణముగా వాడుకలో నున్నది ఉడుదశ యను నామాంతరము గల వింశోత్తరీపద్ధతి. నక్షత్రముల పేరు చెప్పగలవారందరు ఈ దశను గురించిన అంశములను కొన్నింటి

నైనా ఎఱుఁగుదురు. జ్యోతిష్కుని వద్దకు వచ్చి, నాకు ఫలానాదశ ఎప్పుడు వచ్చునని అడుగుట ఆచారమైనది. కార్తాంతికులు చేయు ఫలాదేశమంతయు సామాన్యముగా ఈ దశాపద్ధతి ననుసరించియే. సరికదా? జ్యోతిషాచార్యు డనదగిన వరాహమిహిరుడు ఈ దశ పేరైనా చెప్పలేదు. కల్యాణవర్మ సృష్టిలో దీనికి విలువ కానరాదు. ఇపుడు మనవారు నమ్ముచున్నంత విలువ ఈ దశాపద్ధతికి వాస్తవముగా నుండెనేని, ఆ మహనీయులు దీనిని నిరాదరించుచుండిరా? దీనికి వచ్చిన ప్రఖ్యాతికంతయు ప్రబలకారణము ఇది పరాశరప్రోక్త మనుట. "కలౌ పారాశర స్మృతిః" అని స్మృతులలో పరాశరస్మృతికి వెలయుండగా, "తలకంతా ఒకటే సూత్ర" మను సామెతచొప్పున జాతకవిషయమున సహా పరాశరవాక్యమే పరమప్రమాణ మనవలయునా? అసలు, ఆ పరాశరగ్రంథ మేదో నిర్ణయించుట అసాధ్యము. క్రీ. శ. ౧౦ వ శతాబ్దమువాడగు భట్టోత్పలాచార్యునికే ఆ గ్రంథమును చూచు భాగ్యము లభించలేదట! అప్పటికే అది నామావశిష్టమై యుండినదేమో? ఇపుడు మనకు దొరకుచున్న 'బృహత్పరాశరహోర' అను గ్రంథ మొక పెద్ద 'కలగూరగంప'. శైలినిబట్టి, విషయవిభాగమునుబట్టి చూచినచో, ఈ గ్రంథమున కంతయు ఒకడే కర్తయని నమ్ముట కష్టము. భిన్న భిన్నమతముల సంప్రదాయము లనేకములు పూర్వాపర సంబంధముపై దృష్టి లేక గందరగోళముగా ఈ గ్రంథములో ఇముడ్చబడియున్నవి. కొన్ని విషయములు దుర్గ్రాహ్యములుకూడ. ఇది యిట్లుండనిండు. ఈ గ్రంథరాజములో వేరువేరురకముల నలుబదిరెండు దశాసంప్రదాయములు చెప్పబడియున్నవి. అన్నింటిలో ఈ వింశో ఒక్కటి. ఇదియే సర్వోత్తమమని కాని, సమస్తమానవులకు ఇదియే ఫలించునని కాని ఆ గ్రంథములో కానరాదు. విశేష మేమనగా, ఏయే యోగము కల జాతకమునకు ఏ దశాపద్ధతి నుపయోగించవలెనో, ఆ నిర్ణయమునుగూర్చి అనేక సూత్రము లీగ్రంథములో వ్రాయబడినవి. ఈవింశోత్తరీదశననుసరించి సయితము అట్టి నిబంధన యొకటి ఈ గ్రంథములోనే చూడగలము. ఇట్టి పరిస్థితులలో, ఏ జాతకమునకైనాసరే, ఈ దశాపద్ధతినే ఉపయోగించుట శాస్త్రసమ్మతమా, పరాశరప్రీతియా? 'గతానుగతికో లోకః' అను న్యాయము తప్ప వేరుతర్క మిందులో కానరాదన్నను. విద్యార్థుల ఉపయోగము కొరకైనా, దీనిని శాస్త్రజ్ఞులు పరిశోధించనక్కరలేదా?

ప్రాచీనసంప్రదాయములను వదలుట ధర్మము కాదనుట సత్యమే. కాని, వానిని విమర్శించి శోధించి వాని నంటియున్న మాలిన్యమును నూతన సంస్కారములచేత తొలగించుట అనర్హ మనరాదు. ఇతరుల అభిప్రాయములతో మన పద్ధతులను పోల్చిచూచినపుడే మన సంప్రదాయమందలి లోటుపాటులు మన కర్థమగును. వలసినచోట్ల తగిన సంస్కారమును చేసుకొను నేర్పు మన కలవడగలదు. అనూచానకాలమునుండి మన ప్రాచీనులు శాస్త్రవిషయమున ఈమార్గమును చూపినారు. నేడు సయితము మన పండితు లీకార్యమునకు ముందంజవేసి భారతజ్యోతిశ్శాస్త్రమునకు కీర్తి గడింతురని ఆశ.

"పురాణ మిత్యేవ న సాధు సర్వం
నచాపి కావ్యం నవ మిత్యవద్యం,
సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

(కాళిదాసమహాకవి)



# 'మహా విద్వేషావహా'

(రేఖాచిత్రం)

## శ్రీ హనుమచ్ఛాస్త్రి

పగలు...ఒంటిగంట—

వార్తలు మోసుకువచ్చే పొడుగాటి కాగితాలు...నురుగులు కక్కుతుంటూ పరుగెత్తుకువచ్చి... ఎదుట...నించున్నాయి.

తేరి చూశాను.

కళ్లు భగ్గుమన్నాయి.

అడ్డంగా...నిలువుగా—
రెక్కలు తొడుక్కున్న క్రౌర్యంలా—
బాకులు...ఎగురుతున్నాయి.
'ధన్...ధన్...ధనా'
తుపాకులు పేలుతున్నాయి.
చుట్టూ తుపాకిమందు...క్రూరవాసన.
ఎగిరిన పాగాలు—
ఇగిరిన గొంతుకులు—
చిదికిన గడ్డాలు—
విచ్చిన గుండెలు—
తిరిగే కన్నులు—
ఒరిగే దేహాలు—
పాలరంగు పాపలబుగ్గల్లో..
ఏనుగుదంతపువన్నె ఆడపడుచు...వక్షంలో.
బాకులు గుచ్చిన నెత్తురు...
బుసబుసలు...
అన్నిటిలోంచీ ఒక్కటే రంగు... నెతురు.
దిక్కుమాలిన రక్తానికి ...వర్ణ భే: లేదు గాబోలు !!

అరరే—

చూశావా !

అన్ని కళేబరాల గాయాలూ...ఒకేఒక్క ఆఘాతమై...ఆ తల్లి దేహవల్లినుంచి...ఎట్లా...రక్తపు చారికలుగా దిగజారుతున్నాయో—

తలమీద బలమైన లాఠీ విరిగింది.
కళ్లల్లో చీకట్లు—
అల్లా !
అల్లా చూడు.

* * *

మూడువందలేళ్లు—

వెనక్కి ఒదిగిఒదిగి తప్పుకున్నాయి.

అద్భుతపరిమళాలు వెదజల్లే...అగరుపొగ—

పల్చని నల్లకలువరేకురంగు సొగసుతీగలుగా సాగి...ధూమకరండకం నుంచి లేచి...ప్రాంతభూమిని మత్తులో ముంచుతూన్నది.

ఆ చంద్రశిలా మహారాజప్రాసాదంలోకి... నడువు...భయం లేదు.

భారతచక్రవర్తి మహేంద్రవైభవోపేత సభాభవనంలో...కాలుపెట్టు.

గోడలమీద శిల్పాల్లో నిలిచి...రంగురంగు ఈరెండలు కాసే పద్మరాగగోమేధికమాణిక్యాల వెలుగుకు కళ్లను సర్దుకుని. నెమ్మదిగా ముందుకు కదులు—

వజ్రాల అంచులతో మరకతాల తీరులతాది మధ్యచిత్రాలతో ధగధగ మెరిసే...విశాల రత్నకంబలం మీద...

తెల్లపట్టు మస్నద్‌ను ఆనుకొని...

శ్రీ షాజహాన్ చక్రవర్తి—

పక్కగా—

చక్రవర్తి ప్రియపుత్రుడు...దారాషుకో...

కావ్యకళాప్రియుడు...

చక్రవర్తి...చిటికెనవేలి నీలపు ఉంగరం ...చరాలున మెరిసేలా ... సవిలాసంగా ... హుక్కా అందుకుని...రెండుగుక్కలు పీల్చి...సన్నజాజుల...కటుగంధధూమలతలను నెమ్మదిగా ఊదుతున్నాడు—

మంత్రి సామంతాదుల...శుష్కరాజనీతి...ఎగయని శాంతసుభగవాతావరణం.

ఆ విశాలసభాభవనంలో—

మూడవ సభ్యుడు—

ఒక మధురశ్రోత్రియమూర్తి—

మేలిమిబంగారపు తీగతో చుట్టిన...రుద్రాక్షతావళంలోని...వజ్రం...అతని మెడమీద...ధగధగ మెరుస్తున్నది.

చల్లని శ్రీరాగంతో...

మెల్లగా...అందుకున్నాడు—

తదవధి కుశలీ...

పురాణశాస్త్రస్మృతిశతచారువిచారజో వివేకః
యదవధి న పదం దధాతి చిత్తే
హరిణకిశోరదృశో
దృశో ర్విలాసః.

"అచ్ఛా...బహుత్ అచ్ఛా"

ఆకవితామాధుర్యానికి...కుడ్యరత్నచిత్రాలు...కిలకిలమన్నాయి.

సౌధోపరిభాగంలోని...గులాబీ మేలిముసుగుల మృదుకంకణనిక్వాణం ముఖరితమైంది—

బాదుషా...పెదవివద్దకు తెచ్చిన హుక్కా...ఆపి...

మహాకవీ!

జగన్నాథా!

పండితరాజా!

మూగవోయిన ఈ రంగురాళ్లు కావు...మా సభాభవనరత్నాలు—

మీరు మా సభామందిర...దివ్యరత్నం!

తన చేతులతో...మహాకవిచేతులను... ఆప్యాయంగా అందుకున్నాడు.

తళతళమనే రెండు ఆనందాశ్రువులు... మొగల్ సార్వభౌముని...కళ్లల్లో...మెరిసి చెక్కిళ్ల మీదుగా జారాయి.

"ఏ తీరున నను దయజూచెదవో
ఇనవంశోత్తమ రామా!
నా తరమా........"

జైలుగోడలు జాలితో చెమర్చాయి.

అతని విశ్వాసానికి...జైలుతలుపు...ఊచలు...కడ్డీలు నిశ్వసించాయి. కాని—

ఆడ బ్బెవరిది?

అధికారదుర్వినియోగం—

............

కాదులే—

అంధవిశ్వాసం.

............

తప్పు

............

ఆత్మత్యాగం.

నవాబుధనంతో...కాఫిర్ గుడిగోపురాలు...

కదూ!

తహస్సీల్ దారుతల...ఎగిరిపోతుంది.

పాపం—

............

"ఖోలో"

"...దర్వాజ్ ఖోలో—"

కారాగారపు ఉక్కుతలుపులు...లోభిపిడికిలి లా...బద్ధకంగా తెరుచుకున్నాయి.

"గోపన్నా...భాయీసాబ్ !"

"ప్రభూ, ప్రభూ, వచ్చావా ?...రామా !

నయనాభిరామా !

పట్టాభిరామా !

దయచేశావా ?...ఇప్పటికి"—

"గాభరా వద్దు...భాయీ !

నన్ను చూడండి—

గోల్కొండ...

మీమీద వాదులు...విని బందీలో వేశాం."

"ప్రభువులు...తల తీయించండి. నా భద్ర మూర్తిని...త్వరగా చేరుకుంటాను."

"తొందరవద్దు...

తప్పులు చెయ్యడం ఎంత సహజమో, దిద్దుకోవడం అంత సులభం—

ఆలుబిడ్డలకోసం...మీ భోగంకోసం ... చెయ్యలేదు. నిజం.

అల్లా ఆజ్ఞ...

మీ చేతిమీదుగా ఖర్చుపడింది.

ఫర్వాలేదు.

మీరు కట్టించిన గుడి అందం చూశాను.

కాఫిర్ ద్వేషం లేదు. ఖుషీ కలిగింది.

ఇక మీకు స్వేచ్ఛ...

మీ రాముడిలో అల్లాను...చూస్తాను."

............

బందిఖానా ...హఠాత్తుగా...భద్రాచల......రామాలయం.

శ్రీరామనవమి...గర్భాలయపు గంటలు...

అమోఘంగా...మోగుతున్నాయి.

చిరునవ్వుతో...వింటూ

ఎదుట...నిలిచిన...

గోల్కొండనవాబు—

తానీషా !

* * *

అదిగో—

నిషాపురి !

పారశీక సుందరసీమలు—

ఆ ఉద్యానంలో...విరియబూసిన ... కొమ్మలతో ఊగే గులాబిపొదలవద్ద...

ఎవరు వారు ?

తెల్లని అంగరఖాలో...మెరిసే...

పండుతమలపాకు రంగు......పచ్చని...శరీరం.

పండిన గడ్డం.

విజ్ఞాన సీమల్లో...విస్తరించిన...రెండునేత్రాలు.

లోకాతీత సుందరానుభూతులు...చూపించే...రెండుదీపాలు.

............

ఒక పద్యాల పుస్తకం—

ద్రాక్షారసంతో...నింపిన...రెండుకూజాలు.

ఒక సరకం—

ఎదుట—

............

"అచ్ఛా—

స్వేచ్ఛాజీవీ !"

............

ప్రక్క—

కూజా సవరించి...అమృతం వడ్డించే పారశీక మోహిని...

ఆమె చక్కని నేత్రాల నీడలతో...ఆ మధువు మరీ మత్తుగా తియ్యగా ఉందా ?

సాఖీ !

ఆ మోహిని...

కోటిమొగలిపూల సుసుపుతో పొంగే వక్షం అతని మీదకు వంచి...ఇంకొక చషకం మధువునింపి...అమరమాధురులు ఒలికించే అతని పెదవులకుఅందించి—

నవ్వింది.

అతడు—

తెల్లని ఆమెనవ్వును—

ఎర్రని మధువును...
త్రాగి...మైకంతో కన్నులు అరమోడ్చి..
"అచ్చరవంటి నెచ్చెలి...
రసాంచిత కావ్యము.
కెంపు పానకంబు...
ఇచ్చగ...అమనిం దొరకనేని...
మసీదుల గుళ్ల దాస్యమున్—
మెచ్చక—
ముక్తులై—
సుఖముమీర చరింతురు...
జాగరూకులై..."

"భేష్...భేషక్"

............

ఎవరు వారు ?

పూర్వం—

నిషాపూరు ఉండి చెరిగిపోయిన చోటు—

ఒక విశాలజీర్ణోద్యానం—

ఏవేవో పర్షియామసలిచెట్లు...ఎత్తుగా పెరిగి ముసురుకొనే జ్ఞాపకాల బరువుతో...నెమ్మదిగా... తలలు కదుపుతున్నాయి.

చల్లని చెట్లనీడల్లో...బతికినవాడు భరించలేని నిశ్శబ్దమృత్యుశైత్యం—

ఎదుటిగోడను ఆనుకొని...ఒక జీర్ణమైనసమాధి-

గాలికి కదలే ఉన్నతవృక్షాగ్రాలనుంచి...

చెట్లను పెనవైచుకున్న తీగలకొనలనుంచి... ఉండిఉండి ఆకులూ...పూలూ...

ఆ సమాధిమీద రాలుతున్నాయి.

నలుగురు—

ఆధునికభారతీయకవులు—

స్విన్న వదనాలతో...ఆర్ద్రనయనాలతో ఆ సమాధిముందు...చేతులుమోడ్చి...నిలుచున్నారు.

ఒక గొంతు...

ఆ మృతనీరవప్రకృతికి...ఊపిరి కల్పిస్తూ,

"ఓయీ ఉమ్రఖయాము!
నీవు చని ఎన్నో ఏండ్లు పూండ్లాయె;
తే బ్రాయంపుం జెలి సాఖియున్—
ధరణి గర్భంబందు నిద్రించె;
గుర్తే యాపట్టిక నీ నిషాపురము...
...ంచెం గదా!,
నీదు గోరీయైనన్ సడలున్,
రుబాయి తోకలే...
స్మృత్యంకమై నిల్చెడున్."

*　　*　　*

ఎక్కడి పారశీక దేశం ?
ఎక్కడి భారతీయ సీమలు?
ఏ హృదయానురాగ బంధం—
ఇద్దరినీ...కలిపిందో-

గ్రామంలో రంజాన్ పండుగ—బ్రహ్మాండంగా జరుగుతున్నది.

వాడవాడలా...హిందూ పులులు ... ముసల్మానుల్లో...ములిగి చెలగి ఆడుతున్నాయి.

పీర్లకు దండంపెట్టుకున్న అమాయికపు పేరంటాళ్లు...పసుపు కుంకాలు, పళ్లు.....మొక్కుబడి చెల్లించి మరలుతున్నారు.

విద్యాలయానికి వెడుతూ...మసీదు దగ్గరికి వచ్చాను.

రంగు చెమ్లాలు...

ఫెజ్ టోపీలు—

అంగరఖాలు—

ముసిం యువకులు...

త్సవంగా ... ఉత్సాహంగా ... ఎదురువస్తున్నారు.

మసీదులోంచి ... మంచిరకం అగరొత్తుల... వాసన...గాల్లో కలిసి సుఖంగా ఒస్తోంది.

హఠాత్తుగా...కల్లోలం...

చిటికెలో పెద్దధూళి.

ధూళిని మించిన కేకలు...

అలజడి...అల్లరి.

కారణం తెలియదు...

పదులు...వందలు...దిక్కు తెలియని ధూళిలోకి పరుగెత్తుతున్నారు.

లాఠీల టకటకలతో ... చెవులు చిల్లులు పడుతున్నాయి.

ఆక్రోశాలు ... హాహాకారాలు...

కోపాలు...శాపాలు...

పాగాలు...ఎగిరాయి.

టోపీలు...చిరిగాయి.

ధూళితెర...భయంకర జాతిద్వేషంలా ఆకాశానికి లేచింది.

తలవని తలంపుగా...

కల్లోలంమధ్య...నేను.

తెర కవతలనుంచి ఒక జనప్రవాహం...

ముందుకు దూకుతున్నది.

మసకలో...

దృశ్యాదృశ్య...

పరిచిత...

ముస్లిం యువకులు...

ముగ్గురు.

మస్తాన్—

మహబూబ్—

రహిమాన్—

చరాలున...ఒక బాకుచేయి...ధూళిని చీల్చుకొని...నా గుండెకు సూటిగా...వచ్చింది.

బాకు పిడికిలివెనక—పచ్చని షెర్వాణీతో—దూసుకువచ్చే శరీరం...దగ్గరకు వచ్చింది—

"మస్తాన్!"

కెవ్వున అరిచాను.

ఎదుటికళ్లలోని ఎరుపు తెల్లబోయింది.

గొంతు ఒణికింది.

"మాస్టరు సాబ్!!"

"ఇదిగో...గుండె...ఆలోచించకు. నీ చెయ్యి మంచిది."

ఎదిరిని దహించే చిరునవ్వు—

"మీరాశీ"

పాపం. తడికళ్లు తుడుచుకుంటున్నాడు.

రెండు లాఠీలు...తలదాకా...వెళ్లి ... హఠాత్తుగా...ఆగాయి.

గట్టిగా నవ్వాను.

"కానీండి"

"నమస్కారం, నమస్కారం."

"పిచ్చివాళ్లు..."

గట్టిగా కౌగలించుకున్నాను.

"సహనా వవతు—

నా విద్విషావహై"

కిలకిల నవ్వారు.

* * * *

కళ్లు విప్పాను.

భారతపటం నుదుటిమీద—

గాడినగాయాల్లోంచి—

వేడివేడి నెత్తురు చుక్కలు...



# అంతము

శ్రీ సుందరాచారి =

నీ చెంత కూర్చుండ
నిముసంపు చనువు
దయసేయు మందురా—
తక్కుపను లెల్ల!
అవల చేసెదగాని
అందుకేమిపుడు ?

నీమోము గనకున్న
ఏమేమొ యయిపోయి
విశ్రాంతి లేక యెద
విసుగు; నాపనులు
కడలేని కడగండ్ల
కడలిలో పాఱాను.

వచ్చె ముర్మరులతో,
వెచ్చటూర్పులతోడ,
వచ్చె గ్రీష్మము నా గ
వాక్షమ్ము చెంత—

పూపొదరుకొలువులో,
పూలగుబురులలోన,
ఆనందముగ తేటు
లాలపించెడు చూడు !

నిశ్శబ్దముగ పొంగు
నీ విరామపు వేళ,
జీవితాంకితపదము
చెవి కింపుగా పాడ,
కనుమూసి కూర్చుండ
కాల మిదియేరా !

నీవు నా యెదుట—
నేను నీ యెదుట..

* రవీంద్రునికి తెనుగు.



# విద్యుల్లోకము

= శ్రీ వేలూరి శివరామశాస్త్రి =

## నవీనవిజ్ఞానము

౧

భూమిని ద్రవ్యపు లోలోఁతులకుఁ బోయినకొలఁది మన కంటికి కొన్ని పొర లగుపడుచుండును. ఆరీతిగనే వాయు మండలములందును కొన్ని పొరలు యంత్ర సాహాయ్యమునఁ గనఁబడు నని నవీన వైజ్ఞాసికులు రుజువు చేయుచున్నారు.

పృథివిమీఁద సుమారు పండ్రెండు కిలోమీటర్ల * పర్యంతము ఒకపొర కలదు. దేశకాలభేదముల ననుసరించి యీ పొర ౫ మైళ్ళు మొదలుకొని ౧౦ మైళ్ల వఱకును వ్యాపించియుండు నని కొందఱు కనుఁగొనిరి. వాయుస్తరములలో దీని విస్తృతి కొలఁది. అయినను ఇచట వాయవ్యములగు పదార్థములలో నూటికిఁ దొంబది పాళ్లున్నవి. దానఁ జేసి అన్యస్తరములకంటె నీ స్తరము సాంద్రతమము. ఇచట ఆక్సిజని, నత్రజని, ఆవిరి మొదలగు ద్రవ్యములు క్షీరనీరన్యాయమునను, జలతైలన్యాయమునను కలగూరగంపగాఁ గలసియున్నవి. ఈ స్తరము భూదేవిని జిలుగుసెల్లావలె సంపూర్ణముగాఁ గప్పియుండుటచే భూమిమీఁద నే ప్రాంతమున నెంత వేడిమి కలదో అంత వేఁడిమిని ఇది గ్రహించును. సూర్యకిరణములచే వేడి యెక్కిన భూమితో సామీప్య సంబంధమువలన నిచటి ఆక్సిజని మొదలగు వాయువు లెల్లపుడును సీసాలో నీరుపోసి గలపరించినటు లగుచున్నవి. ఏ గ్యాసునందేని వేఁడి యెక్కుడగుచో నచటి అణువుల చలన మెక్కుడగును. కావున ఈ పొరలోని పవనాణువు లప్పసము తప్తములై పదపడి క్షుబ్ధములై నలుదెసలకును, క్రిందుమీఁదులకును పరుగు లిడుచుండును. సుమారు ఈ పదిమైళ్ళ ప్రదేశములో ఎత్తునకుఁ బోయినకొలఁది గాలి పలుచబడుటయ కాక చల్లఁబడియు నుండును. ఇది వాత్యలకును వానలకును, నీరదములకును నిర్ఘాతములకును క్రీడారంగము. తాపము కలిమిని తాపమండల మనియు, క్షోభము కలిమిని క్షుబ్ధమండల మనియును దీనికి పేరు (Troposphere).

* ఒక కిలోమీటరు $\frac{5}{8}$ మైళ్ళు. కా॥ గా $\frac{5}{8} \times 12 = 7\frac{1}{2}$ మైళ్ళు

స్థిరమండలము

తాపమండలమున కెగువ ఇంచుమించొక మైలు మొదలుకొని ఒకటిన్నర మైలు వఱకుఁ గల ప్రదేశమున నీతాపము హఠాత్తుగా ఆఁగినటులు కనుఁగొందుము. ఇచటి యాకాశము చిరనిర్మలము. ఇచట మబ్బులు లేవు. వేఁడిమి సుమారు ౪౫ డిగ్రీ సెంటిగ్రేడ్. కావున దీనికి స్థిరతాప మండల మని పేరు (Tropopause).

హిమమండలము

తాప మండలమున పయిఁ బయికిఁ బోయినకొలఁది గాలి చల్లచల్లగ నగును. హిమమండలమున నటులు కాక పయికిఁ బయికిఁ బోయినకొలఁది గాలి వేఁడివేఁడిగ నగును. ఇచట వేఁడిమి సుమారు ౫౫ డిగ్రీ సెంటిగ్రేడ్. సముద్రము మీఁది ఒత్తిడిలో పదునొకండవవంతు ఒత్తిడి యిట నుండును.

భూపృష్ఠము ౯ మైళ్ళు మొదలుకొని ౬౦ మైళ్ళవఱకును హిమమండల వ్యాప్తి. ఇచటనుండి వాయువు లన్నియు విభక్తము లగుట కారంభించును. ఉదజని, నత్రజని మొదలగు బలువుకల వాయువులు ఇటనుండి ఉదకబిందువుల వలెఁ గ్రిందికిఁ బడఁదొడఁగును. హీలియమ్, హైడ్రోజెన్ మొదలగు తేలిక గాలులు మీఁది మీఁదికిఁ దేలాడుచుఁ బోవఁదొడఁగును.

ఇది మేఘరాజ్యమున కావలిది గాన నిట నున్నచో సూర్యనక్షత్రాదుల దర్శన మెల్లయపుడు చేసికొన వచ్చును. ఇచట మబ్బు లుండవు గాన వానలు నుండవు. ఇట నుండి చూచినచో ఆకాశము కారునలుపుగాఁ గానిపించును. భూమి చెట్టుచేమలతోడను, పుట్టగుట్టలతోడను ఏకాకారమై ఏమియుఁ గానిపింపదు. సముద్రము మాత్రము అద్దమువలె తలతల మెఱయుచుఁ గనఁబడును. ఈ హిమమండలమునకు Stratosphere అని ఆంగ్లనామధేయము.

ఓజోన్ మండలము

సూర్య కిరణములకు పలు రంగులు కలవు. బయటి కమ్మరవాని కొలిమికడ నిలువఁబడి చూతము. కమ్మర వాఁడు మొదట నిప్పువేసిన తరువాత ఇనుప ముక్క పెట్టి దానిపై నింత ఊఁక పోయును. అంత దూది పింజలవలె పొగ లెగయఁదొడఁగును. పిదప ఆకు పచ్చగను, పాటలముగను, తెల్లగను, అరుణముగను మంట రంగు కనిపించును. కావున కాలుచున్న వస్తువునుబట్టి మంట రంగు మాఱుచున్న దని మనము గ్రహింతుము.

సూర్యుఁడు గూడ నొక కొలిమి. భూమిలోఁ గల ౯౨ మూల పదార్థములలో చాలవట్టి సూర్యునిలోఁగూడ నున్నవని వైజ్ఞానికులందురు. మఱియు నీ కొలిమిలో నాలుగు మండు గాడ్పుల పొరలున్నవఁట. ఒకటి ఆలోకమండలము, లేక Photosphere; రెండు ప్రతిఫలక స్తరము, లేక Reversing layer; మూఁడు వర్ణమండలము, లేక Chromosphere; నాలుగు ఛటాకిరీటము, లేక Corona

క్రాఁగిన ధాతువులయు, ఆవిరులయు ఒత్తిడి ఎక్కుడయినపు డగ్ని పర్వతములు పగులును. ఆ పగుళ్ళనుండి లోలోపల నున్న ధాతువులును, ద్రవాదులును, బాష్పమును ప్రచండ వేగముతో ఫూత్కరించినటులు వెలువడును. ఆ చందముగనే సూర్యమండల మున తుకతుకలాడు ఆవిరులు మితిలేని వేగ ముతో పైకిలేచుచుండును. అపు డా సందుల నుండి వెలుపటి వాయువులు లోపలి కేఁగు చుండును. ఈ రీతిగా ఆవర్తమాలికలు ఘూర్ణమానము లగునపుడు పెద్ద పెద్ద బీట లేర్పడును. ఆ బీటల గుండ ప్రచండవేగమున లెక్క లేనన్ని అణువులును, పరమాణువు లును, అతిపరమాణువులును, మాత్రలును, ఎలెక్ట్రానులును అంబుల పొదినుండి శర జాలమువలె నంతటఁ బడుచుండును. ఇట్టి మంటలతో శబలమగు నీ కొలిమినుండి భూమండలముమీఁదికి వచ్చు నీకిరణములు మనకుఁ దెల్లగాఁ గనఁబడునుగాని అన లవి తెల్లవిమాత్రమే కావు. ముక్కోణ మగు గాజుముక్క తెచ్చి సూర్యుని కెదురుగా పట్టు కొని చూచితిమేని యింద్రధనుస్సునందలి రంగులఁబోలు రంగులు మన కంటికిఁ గనఁ బడును.

గారడీవాఁడు కొన్ని రంగులు గల తాటాకుల పొత్త మొకటి తెచ్చి విడఁబఱచి త్రిప్పుచు మనకుఁ జూపును. అపుడది మనకుఁ దెల్లగాఁ గానిపించును. ఆఁపినచో భిన్న భిన్నము లగు వర్ణము లాయాకులపైఁ గాని పించును. ఆరీతిగనే సూర్యకిరణములు గూడ కిరణపింఛములు. పింఛమును విప్పినచో పలు రంగులు. కలిపినచో ఒక రంగే. అది తెలుపు.

ఈరీతి పరీక్షలో కనఁబడు రంగులివి :

| | | |
|---|---|---|
| ౧. ధూమలము [హిందీ: ఊదా] | | Voilet |
| ౨. అతినీలము [నీలిమందు రంగు] | | Indigo |
| 3. నీలము | | Blue |
| ౪. ఆకుపచ్చ | | Green |
| ౫. పసుపుపచ్చ | [పీత] | Yellow |
| ౬. నారంగ | | Orange |
| ౭. లోహిత | [ఎఱుపు] | Red |

ఈ వర్ణమాల మన కంటి కగపడును. వీనిలో మొదటి ధూమల వర్ణమున కును, చివర లోహిత వర్ణమునకును వెలుపట రెండు రంగు లున్నవి. మఱియు మన కింకను తెలియని రంగు లెన్నో యున్న వని యూహించుట కెంతయో యవకాశము కలదు. ధూమల లోహిత వర్ణములకు వెలు పటఁగల రెండువర్ణములలో మొదటిది బహి ర్ధూమల రశ్మి, లేక Ultra Voilet light. ప్రకృతము దీనితో మనకు పని.

పలు వన్నెలు కల యీ సూర్యకిరణ ములలో నీ బహిర్ధూమల కిరణములు హిమ మండలమునం దున్న ఆక్సిజని మీఁదుగాఁ బ్రసరించును. దాని వలన ఓజోన్ స్పష్ట మగును.

ఇదికాక మేరు ప్రదేశములందు చాల ఓజోన్ ఉన్నది. వసంతర్తువులో ద్రాఘిష్ఠ మగు మేరు రాత్రి శేషమున వాయుమండల

మందు చాల ఎత్తుగా ఈ ఓజోన్ కానిపించును. ఆ యెత్తున విద్యుత్ స్ఫురణమువలన ఓజోన్ స్పష్టమగునని వైజ్ఞానికులు చెప్పుదురు.

భూమిపయినుండి ౧౫ మైళ్లు మొదలుకొని 30, 31 మైళ్ళవఱకును ఓజోన్ మండల వ్యాప్తి. ఓజోన్ స్తరమే లేనిచో మనము గ్రుడ్డివార మయ్యెడివారము, లేక మలమల మాడి చచ్చెడివారము. ఏమనఁగా సూర్యుని యీ బహిర్ధూమల కిరణములను ఈ ఓజోన్ ర మద్దుడు కాగితమువలె పీల్చి జీవుల కుపకరించు భాగమును మాత్రమే వదులుచున్నది. ఈ ఓజోన్ మండలగుణ మిట్టిది. కావుననే సూర్యుని వర్ణపింఛపుఁ దేజము బహిర్ధూమల వర్ణము దెస (Ultra Voilet light)నొకానొకట మిక్కిలి తగ్గిపోవుచున్న దని వైజ్ఞానికుల ప్రవాదము.

ద్యున్మండలము

ఓజోన్ మండలము పైని విద్యున్మండల మున్నది. భూమిపై ౫౬ మైళ్ళ యెత్తునుండి దీని యారంభము. ఈప్రదేశమునందు తటిదాశ్రితములగు జడకణములును, ఎలక్ట్రానులును గలవు. వీని కలిమినే యీ విద్యుత్ స్తరము విద్యుత్పరిచాలకము.

ఈ స్తరము జ ౧, జ ౨; చ ౧, చ ౨ అని నలు దెఱఁగులు. జ ౧ యు, జ ౨ ను క్రిందివి. చ ౧ యు, చ ౨ ను మీఁదివి. క్రిందివాని కాంగ్లమున E 1 అనియు, E 2 అనియు లేక కెనేలీ హెవిసాయిడ్ స్తరమనియు, మీఁదివానికి F 1 అనియు, F 2 అనియు,లేక ఆపుల్‌టన్ స్తరమనియు వ్యవహారము. క్రింది జ-స్తరము భూమి మీఁదినుండి *౬౨ మైళ్లనుండియు, మీఁది చ-స్తరము సుమారు ౧౫౬ మైళ్ల యెత్తునుండియు నారబ్ధము లయినవి.

తటిల్లోకమునకు సూర్యుని బహిర్ధూమల కిరణములు (Ultra voilet rays) ఒక ప్రధానకారణమని నేఁటికి నిస్సందిగ్ధముగనే వైజ్ఞానికులు నిర్ణయించిరి. ఈ యతిధూమల కిరణములు ప్రసరించినంతనే వాయవీయములగు అణువులనుండియు, పరమాణువులనుండియు, అతి పరమాణువులనుండియు, మాత్రలనుండియు ఎలక్ట్రానులు బయలుదేఱి సూర్యకిరణముల వలెనే ప్రసరించి అన్ని దెసలకును తుర్రుమని పరుగులెత్తనారంభించును. దీనిని ప్రసరణ మనియు, వికిరణమనియు, విచ్ఛురణ మనియు వాడ నగును. దీని నాంగ్లమున Ionization అని అందురు. ఈ ప్రసరణమునకు ఫలితముగా వాయువునందు ఎలక్ట్రానులును, తటిదాశ్రితములగు నణువులు పరమాణువులుమాత్రలు మొదలగునవియు పుట్టుకొనివచ్చును. ఇటు లివి పుట్టుకొనివచ్చినందువలన విద్యుల్లోకమునందలి వాయువు విద్యుత్పరిచాలక

*ప్రాచీన విజ్ఞానమున ఈ విషయమునుగుఱించి ముందు సంచికలలోఁ జూడఁగలరు.

మగును. కావున సూర్యుని బహిర్ధామల కాంతులు (Ultra voilet rays) మీఁది స్తరములలో నున్న విద్యున్మండలమునకుఁ గారణము.

భరతఖండమునందలి ప్రాచీనవిజ్ఞానమీ విద్యుదాదికమునుగూర్చి యేమి చెప్పుచున్నదో ఆ విషయమునుగూడ సంగ్రహముగా రాఁబోవు సంచికలోఁ జూతము.

ఈ మండలముల కీ దిగువ-



# రా య ల నా టి
# రమణీయజీవితము-హంపీక్షేత్రము

= శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు =

హంపీ అనేపేరు వింటూనే - రాయలవారు చేసిన యుద్ధాలూ, సాధించిన విజయాలూ యెట్లావున్నా - మన ప్రతిభాదృష్టిలో భాసించేవి ముఖ్యంగా రెండు. ఒకటి సమగ్రసుందరమై మహారాసిక్యంతో కూడిన ఆ జనులజీవితం. సర్వతోముఖంగా వ్యాప్తమై, ఒక "ప్రత్యేకతనే" కూడగట్టుకున్న ఆ కళావిజృంభణం రెండోది. ఒకటి గొజ్జగినీటి వెల్లువ. రెండోది గోవజవాదుల నిగ్గు. ఆ బ్రతుకువంటిది తెలుఁగులు మరి బ్రదికి యెఱుఁగరు. ఆ కళవంటిది- మరి సృష్టించి ఎఱుఁగరు. అందుకే ఆ అనుభవం ఒక కల్పనాగాని, సత్యమున్నాగాని భావనామాత్రంగా నిలుస్తుంది. "అలాంటికాలం ఒకటి వుండెనా!" అంటుంది మనస్సు. "అవునని సవాలుచేస్తుంది" చరిత్ర. ఈ రెంటి మధ్యా యెటూ మనం నమ్మలేక తికమకలాడుతాం.

విజయనగరం ఒక మహాపట్టణం. అంతటిపట్టణమూ, అట్టి జనాకీర్ణతా యెక్కడా తాము చూడలేదని పాశ్చాత్య పారసీకుల వ్రాతలు. దానికి చుట్టూరా సుమారు డెబ్భైరెండుమైళ్ల మేరకు ఆవరించుకునివున్న పర్వతమాలికలు పెట్టనికోటలు. వానిలో "కులిశధారాహతి పాలువునఁ బైనుండి యడుగుమోవఁగ జేవురైన తటులూ", "చలువలైన యేటి కెలకులూ", దట్టంగా పెరిగి, సూర్యకాంతుల్నిగూడా పడనివ్వని "క్రముక పున్నాగ నారంగరంభా నారికేళాదులు"—ఆ లోయలన్నీనీ "పికశారికాకీర కేకిభృంగసారసధ్వనులతో" ఆఘూర్ణితాలేనట!!

ఆ నగరాని కేడుకోటలు. ఏడవ కోటలో రాజుల మహళ్లూ, రచ్చకూటాలూ, మంత్రిదండనాయకుల మందిరాలూ, మహోద్యానాలూవుండేవి. ఇక్కడే "పిలిచిన పలికే" యిరవైలక్షుల మూలబలం. వారు ఆ మహారాజ్యానికి యిన్నూటయి రేవుపట్టణాలను సాధించారు. ఇన్నూటానలభైలక్షుల ఆదాయాన్ని - సాలుకు- సంపాదించారు. కటకంనుంచి కన్యాకుమారి వరకున్నా సామ్రాజ్యాన్ని విస్తరింపఁజేశారు. ఇఁక పట్టణమంతా యెక్కడఁజూచినా పూలతోఁటలే - వుద్యానవనాలే! వరిపొలాలలో "తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువలు." చెఱకుతోఁటలలోనే తమలపాకుల తీవెలూ - పూగ వృక్షాలూ-ధూపితధూమకుంతలాలు విచ్చి "సొగసంతా మాదే చూడు"మంటూన్న దాడిమీవనాలు. ఇవిగాక "కాయమానజటిల ద్రాక్షాగుళుచ్ఛాలూ." వరిపంటలలో అనేకరకాలు వారు నాటేవారు. ఈ క్రింది పద్యం చూడండి!

"సారిదిం జేర్చిన తీగెమల్లియలు, ఖ
ర్జూరంబులు న్బవ్వయం
జరులు న్మామిడిగుత్తులు న్గసుముముల్
సంపంగెలు న్బచ్చిగ
న్నెరులు న్బాళెలు గల్గి-రాజనముగాం
తిన్నారుము ల్పాపి-చే
లరుదారన్నగుఁ బూవుఁదోఁటలబలా
కానీకదంభంబునన్"

పై పద్యంలో చెప్పిన వన్నీనీ ధాన్యభేదాలు. పువ్వుదోఁటలకూ, వరిచేలకూ పోటీవచ్చిందఁట. పూఁదోఁటలలోని సుమజాతులన్నీ తమలో వుంటూ-పైగా మిసమిసలాడే రాజనాలు ఒకటి హెచ్చుగా వుండడంతో-వరిపొలాలు తోఁటల్ని హాస్యమాడుతున్నా

యంటాడు రాయలు. ఈ వరితోటలన్నీ కూడా తుంగభద్రానదీజలంతో యేమోగాని-ఫలరసాలచేతనే పండి పక్వమయ్యేవని తెన్నాలికవి ఉత్ప్రేక్ష!

ఆ జనులు వీథులకు రెండువైపులా పుష్పిత వృక్షాలు పెంచేవారు. వేసంగుల్లో ఆ చెట్ల క్రీనీడల్లో "చలివెందరులు" యేర్పాటుచేస్తారు. యౌవ్వనం మిసమిసలాడే జవ్వనులు తమ కలకలనవ్వుల్నే పోలిన గాజుల గలగలలతో సాక్షాత్కరించిన మన్మథసామ్రాజ్య అధిదేవతలవలె వానిలో నిలిచివుంటారు. చలివెందర్లలో పనిచెయ్యటానికి పురుషులు వొప్పుకోరు. ఒకవేళ యెవరైనా అరసికులు వొప్పుకున్నా-ఆ ప్రపాసమితిలోకి బాటసార్లు అడుగే పెట్టరు. "ఒయ్యారంబునం జంద్రిక ల్దనుకం జూచెడి" చూపులు లేని ఆ ఆవరంలో వారికి రుచిలేదు. వచ్చినవాడు చెలువుడైతే వాడు నీరు త్రాగుతూనే-ఆవిడ నీరుపోస్తూనే-చూపులతోటే పరస్పరం మాట్లాడుకుంటారు. దారినబోతూండేవా రెవ్వరున్నా ఆ "ప్రథమప్రణయ పరిచయాన్ని" అడ్డగించటానికి పూనుకోరు. "చెలువప్పవాని గన్గొనిన జెల్వకు జూపుల గావె మాటముల్" అనే హృదయవాదాన్ని ఆనాటి సంఘం యెంతో గౌరవించింది.

విద్యానగరంలో యెటు చూచినా సౌధాలే. మనుచరిత్రకారుడు అవన్నీ "సుధాప్రభాధవళిత ప్రాలేయరుఙ్మండలీహరిణాలూ" అంటాడు. ఆ గృహాలకు బ్రహ్మాండమైన తోరణాలూ, వాని మణితోరణాలు. గోడలపైన చిత్రాలైన చిత్తరువులు. స్తంభాలకు అమూల్యశిల్పాలు. ప్రతియింటికీ ముందు ఒక పరిమితమైన పూలతోటా, వెనకవైపు ఒక వుద్యానవనం ఉండేవి. ఇంటిముందు యెప్పుడూ పుష్పాల్లతో నిండిన రెండు చలువరాళ్ల వితర్దికలు. వాని మొదళ్లలో "తరుణసహాకారం"లాంటి ఒకటిరెండు చెట్లు. సుకుమారహస్త విన్యాసాలతోటే "లోనికి రమ్మని" ఆహ్వానిస్తున్నట్లుండే-రెండు చిత్తరుల బొమ్మలు. ఇండ్ల వెనుకటి ఉద్యానాల్లో నానారకాల పూలజాతులూ, ఫలవృక్షాలూ, నికుంజాలూ చలువరాతి వితర్దికలూ వుంటాయి. ఆ వనంల్లో తామరలు గలిగిన ఒక చిన్న కొలనూ-చక్రవాకాలూ లకుమూకులు. పటికపుదొనల గుండా "కొంతల చనుమిట్టలం దొఱగు దట్టపుతట్టు పునుంగువాసనల"తో తుంగభద్రానది కాల్వపారుతూంటుంది. కొందరు భాగ్యవంతులకు ఉద్యానవనాల్లోనే కృత్రకాద్రులుండేవి. ఆ దంపతులు వానిపై గూర్చుండి "సాయంసమారంభ చక్రవాకద్వంద్వ విరహావలోకన విభ్రమాలు" చూస్తూంటారు. ప్రతి యింటి ముంగిటా రంగురంగుల ముగ్గులూ-పూలున్నూ.

ఆ నగరరాజవీథులు విశాలంగా "సూత్రపట్టినట్లు" చక్కగా వుంటాయి. ప్రతిబజారుకున్నూ మొదటా, కడపటా ఆకాశాన్ని దూసుకపొయ్యే గోపురాలు. ఆపైని పెద్ద తాళ్వారాలపై కమానులు తీర్చి వుంటాయి. అవి రమణీయశిల్పాలంకృతాలు. రాచనగరుల ద్వారాలన్నీ రత్నకీలితాలేనట! ఏల కారాదు! రత్నాలూ, ముత్యాలూ రాసులూ, జొన్నలవలె వీథుల్లో పోసి అమ్మడమే నిజమట! రాజద్వారాలకుమాత్రం రత్నపరిచయం వుండకూడదా! ఆ కాలంలో యేనాదులూ, దొమ్మరులూకూడా బంగారునగలను ధరిస్తూండిరని కన్నులతో చూచిన "న్యూనిజ్" వ్రాయలేదా! రాత్రిళ్లల్లో దేవాలయాలలోని వేయారుకాచదీపాల కాంతులతో ఆ విగ్రహాల రత్నాభరణాలు ఒక పట్టపగలునే సృష్టించుకునేవి. ఆ వెలుగుల్లో "సీవాగతాబ్జముఖుల" నవ్వుల కలకలలూ, మేఖలాఘలంఘలలూ—

ఆనాటి జనసముదాయం మహారసికమైంది. వారు జీవితాన్ని సర్వతోముఖంగా, సర్వాంగసుందరంగా అనుభవించారు. పురుషులూ, స్త్రీలూ అందరికీ అదే సాధన. స్వర్గలోకంపైనపోటీకి నిలిచినవారివలె భూమిపైనే ఒక స్వర్గఖండాన్ని కల్పింపబూనారు. ఏ లలిత భావమూ, సన్నివేశమూ వారినుండీ తప్పించుకుపోలేదు: నిరాదరింపబడలేదు. వారి వీణాతంత్రులవలెనే మనస్సులున్నూ మహాలలితాలు. వారి "కళసాపురప్రాంతకదళీవనాంతర ద్రాక్షాలతాఫలస్తబకాల"వలెనే అనుభవించిన సుఖాలున్నూ రసదిగ్ధాలు. పైపైని సాధించిన విజయాలతో కలిగిన వుద్రిక్తతతోనో, మహమ్మదీయసంస్కృతి చుట్టూముట్టి హైందవనాగరికతపై తన పలుకుబడిని చల్లడంచేతనో విజయనగర సామ్రాజ్యకాలంలో ధర్మము ఉపసర్జనీభూతమై రాసిక్యం ప్రధానమయింది.

అందున్నూ రాయలకాలంలో అదింకా మితిమీరింది. స్త్రీ పురుషుల్లో యెవ్వరేకానీ "ఆ యింపే పరబ్రహ్మము"అనే అనుభూతికి వంచితులు కారాదని వారి తలపు.

ఆ ప్రజలకు కళాభిమానం వెన్నతోపుట్టింది. సంగీతసాహిత్యశిల్పనృత్యాదులలో వారు అభ్యసించనిదీ, ఆదరించనిదీ ఒక్కటిన్నీ లేదు. స్త్రీ పురుషులందరూ వీణాసాధన చేస్తూండిరి. ఆ నిరంతరసాధనతో వారి మాటల్లోకూడా ఒక శ్రుతీ, ఒక లయా వుండేవి. వేదగానం చేసే బ్రాహ్మలుకూడాజన్మతోనే కంఠాలకు శ్రుతిగలుపుకునివచ్చినవారివలె "విపంచీస్వరంతో"తప్ప జటలుచెప్పడంలేదు. సాయంసమయాలలో ప్రతిగృహోద్యానంలోని పొదరిండ్లున్నూ "తరుణాంగుళీఘాతతంత్రీస్వరాలతో, ఆలాపగతి సొక్కిన అరమోడ్పుగన్నుల"తో "నాటా" మొదలైన రాగాలలో "జిలిబిలి" పాటలు "యింపుదళుకొత్త" వీణలలోఁ గలిపి పాడుతూండే "విద్యుల్లతావిగ్రహాల"తో పులకిస్తూనేవుండేవి. వారు "జంత్రగాత్రాలు" రెంటియందున్నూ ప్రవీణులు. గానానంతరం తమ మనోహరసంగీతాలతో కరిగిన చలువరాళ్లను ఆవిడలు ప్రత్యక్షంగా చూస్తూండిరి. మనోహరశిల్పాలను తమ యిండ్లముంగిళ్ల బెట్టుకొనిరి. ఇండ్లలో బెట్టుకొనిరి. ఇండ్లవెనుక పెంచుకొన్న పొదరిండ్లలో వుంచుకొని కనులు తనివోవకచూచిరి. ప్రతిస్త్రీ కూడా అంతో యింతో నాట్యాన్నికూడా అభ్యసిస్తూండేది. ఇంటింటా "తుంగభద్రాసముత్తుంగవీచీఘటా గంభీరఘుమఘుమారంనాల"తో పందెం వేసుకుని మురజాలు మ్రోగుతూంటాయి. కాని ముఖ్యంగా యీ విద్య ఆనాటి వారకాంతలు చేపట్టారు. ఆ భోగినీస్త్రీలు "రంభాదులైన నాఅయఁ గాసె కొంగువనే వారించి కడపఁగలరఁట. దసరా మొదలైన వుత్సవాలలో వెయ్యిమంది నాట్యస్త్రీలు పట్టే పతాకహస్తాలతో రాయల రత్నసింహాసనం జిగజిగలాడేది. ఇఁక కవితావని కంటారా! విజయనగరమే జన్మస్థానం. "కర్ణాట కటకపద్మవనహేళి, శ్రీనాథభట్టసుకవి"కి కనకాభిషేకం చేసే భాగ్యాన్ని వలచికొన్న "ముత్యాలశాల" నవ్వుతూనేవుండింది. అల్లసాని పెద్దన పెండేకం "ఘలుఘల్లుమంటూ" యీకాలానికి అధిష్ఠాత ఇతడేనని పలుకుతూండేది.

అరుణగిరినాథుని సంస్కృత సాహిత్యం "పంపాపతి" వుత్సవానికి చిరాయువు నొసంగింది. ఇకఁను "తిమ్మణ్ణా" మొదలైన కన్నడకవులు కుప్పతెప్పలుగా విద్యానగరంలో కాపురముండిరి. తమిళకవులు అడపదడప మరియాదలందుతూండిరి. ఆనాటి వ్యాసంగరంగాలు ముఖ్యంగా సంస్కృతాంధ్రాలు. సుడికారానికీ, లాలిత్యానికీ పేరుమోసిన కన్నడం ప్రాంతీయభాష. దానితో విద్యానగరపౌరులకు సాధారణంగా యీమూడుభాషల్లో పలుకుబడి వుండేది. వారు కఠినోచ్చారణానికి యేమాత్రమున్నూ ఒప్పుకోలేరు. ఏకవిన్నీ కఠినపదసమ్మేళనాన్ని చేయలేడు. శిల్పికి తన వులి కొంచెం గట్టిగా శబ్దించిందంటే-ప్రాణా లెగిరిపోతాయి. ప్రతిఒకడున్నూ "ఉలిచేరాలకు జక్కిలింత లిడి" అంతకుముందే ఆ శిలాగర్భంలో దాక్కొనివున్న రమణీయమూర్తిని మేలుకొలిపి పిలిచినవాఁడే గాని చెక్కినవాఁడుగాదు. నాకు తెలిసినంతవరకూ విజయనగరసామ్రాజ్యంనాడు ఆంధ్ర కన్నడ సాహిత్యాలలో కలిగిన "నిగ్గు" మరి కలుగలేదు.

ఆ ప్రజకు పూవులంటే మహాప్రాణం. అన్నం లేకుండా జీవిస్తారుగాని పూలులేకుండా బ్రదుకలేరు. అందులోనూ-గులాబీలూ, తామరలూ వారి ఆరాధ్యదేవతలు. వానిని కొప్పులలోఁ బెట్టుకొనిరి. కొప్పులవలలుగా ధరించిరి. మెడలలో వేసుకొనిరి. ఇండ్లముంగిటఁ జల్లిరి. స్తంభాలకు వ్రేలాడఁగట్టిరి. వితర్దికలపైనా, వీథులలోనూ చల్లిరి. పాన్పులపైనా, వలభులలోనూ శృంగారించుకొనిరి.స్నానము "గొజ్జంగిపూఁబొదల్గురియంగఁ బటికంపు దొనల నిండినయట్టి తుహినజలము"తో దప్ప చేసినవారే కాదు. వారి వసంతాభరణాలు చూస్తామా! కర్ణములయందు గొజ్జగులు, శిరోజాలలో సంపెగలు, చేతులకు కుంకుమపూవు, వకుళపుష్పాలతోడి మేఖలలు-ముఖాలకు లోధ్రరజస్సు-పొన్నపుష్పాదుల తావులు ప్రోదిగట్టుకున్న వనము



దేవదాసి

(కొయ్యమీద చెక్కిన చిత్రము – Wood-cut)

చిత్రకారుడు : శ్రీ సుధాంశుకుమారరాయ్

లలో విహారం! వీరు నిజంగా బ్రదికి జీవించిన మానవులేనా! భావనాకల్పిత దేవకాంతలు గాదుగదా!

ఇఁక అప్పటి పురుషులందామా! వారు రస స్వరూపులు. ప్రతిఒకనికినీ "యక్షతనయేందు జయంత వసంతకంతులను" చక్కదనంలో గెలువఁజాలెననే పట్టుదల. వారి శరీరం "కుందనము"వలెనే నిగనిగలాడుతూండేది. స్త్రీలవలెనే వారున్నూ "నిడుదపెన్నెఱి గుంపులు" పెంచిరి. "చెంగలువకచ్చులు" ధరించిరి. మృగనాభిసంకుమదాదుల పూఁతలతో మిసమిసలాడుతూండిరి. కస్తూరితోడనే బొట్టును దీర్చుకొనిరి. "కామినీనఖముఖశిఖరకలితజాతనూత్నక్షతాంకాల"తో పచ్చడాని కంటుకున్న తమ్ములపుకఱ్ఱలతో, యావక చిహ్నలతో బయటికి రావడానికి పురుషుఁడు జంకలేదు. ప్రణయకుపితయైన స్త్రీ తన ప్రియుని శిరస్సును "వామపాదంతో తొలఁగఁద్రోయడం"కూడా అపచారమనుకోలేదు. పురుషుఁడున్నూ ఆ ప్రణయగౌరవాన్ని "మహాప్రసాద"మని గ్రహించడానికి వెనుకఁబడలేదు. అన్ని భోగ్యపదార్థాలనూ వాడటంలో పురుషులకు యెంత అధికారమో, దాహమో-స్త్రీల విషయంలో కూడా ఆనాడు అంతే. ప్రౌఢదేవరాయలకు పంద్రెండువేలమంది భార్యలఁట! మరియొక రాజుకు ఏడునూర్లమంది. వీరు చాలక పైగా ఉంపుడుకత్తెలు. ఈ అలవాటులతో-ఆనాటి స్త్రీల కేమిన్నీ నొప్పి కలగలేదా? వారి సాహిత్యము యేమాత్రమున్నూ వెల్లడింపని రహస్య మిది. ఆ కవులకు స్త్రీలపై సానుభూతి లేదందామా! అలా అనడం అపచారం. ఇంతమాత్రమే గాదు-ప్రతిపనికీగూడా విలాసినులనే వారు వాడుకున్నారు. తమ్మపడిగాలు జట్టను తరుణులే. చామరాలు వేయను సరసాంగులే. పాదుకాకళాచికాది రాజదర్జాలకున్నూ వారే. తలంటనూ, నీరుపోయనూ, తడియొత్తనూ-సర్వోపచారాలకూ సారంగనేత్రలే. ఆనాఁటి పురుషుల దృష్టిలో విలాసినులు లేని సన్నివేశానికి రుచి లేదు. వారిని చూడని నిమిషానికి ప్రాణం లేదు. నాఁటి రాజులకు సామంతులు తెచ్చే మాణిక్యాలతోపాటు గాణిక్యాలు లేకుంటే ఉపశాంతి లేదు. "వారిగృహావసరశంఖాకర్ణనా" సమయాల్లోగూడా దేవుని పిలుపు గాక స్త్రీల "కడగంటిజిగి"నే వారు చూచారు. స్త్రీల యేడ్పులో, కోపంలో, ఆశ్చర్యంలో-అన్నిటియందున్నూ ఒక రమణీయమూర్తినే వారు భావించారు. స్త్రీని మాతృస్వరూపిణిగా వారు చూడలేదు. సర్వనియంత్రిగా అవలోకించలేదు. శృంగారదేవతగా చూచారు. తనివిదీర అనుభవించారు.

పూలతరువాత నాఁటి జను లెక్కువగా ప్రేమించినవి వాసనాద్రవ్యాలు. ప్రతిదినమూ, ప్రతినిమిషమూ వారికి వాసనాద్రవ్యాలతో ఆవశ్యకత వుండేది. తలంటుకోవటానికి సంపంగినూనె కావాలి. తల పులుముకోటానికి సీకాయకు బదులు శ్రీచందనాన్ని వాడుతూండిరి. స్త్రీలకు మకరికలు వ్రాసుకోవలెనంటే మృగనాభికర్పూరాలు కావలసివుండేవి. ఇఁక వానిలో తరతమభావాలుకూడా వారికి బాగా తెలుసు. ఆ జను లెక్కువగా ప్రేమిస్తూన్న పదార్థా లిట్టివి:—

సీ. సద్యోవినిర్భిన్నసారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీటెండఁ గరఁగి కర్రలవంటి
గమగమ వలచుఁ జొక్కపుజవాది
పొరలెత్తి ఘనసారతరువులఁ దనుదాన
దొఱఁగిన పచ్చకప్పురపు సిరము
గొజ్జంగి పూబొద ల్గురియంగఁ బటికంపు
దొనల నిండినయట్టి తుహినజలము"

ఇట్టి తనిపదార్థాలే సాధారణంగా వారికి ముడుతూండెను. వానిని మెదిపి పాకంచేయడంలోకూడా అనేకరకాలు. కస్తూరిమాలిన్యాన్ని కుంకుమపూవులో గప్పి దాని కాకను కస్తూరికలపటంతో పోగొట్టి, దాని శైత్యాన్ని జవ్వాదితో తగ్గించి కదంబించి పూస్తూండేవారఁట!

ఆ ప్రజకు బ్రదకటం ఒక కళ. బ్రతుకంటే యేమిటో-యెలా బ్రతకాలో-కళాకారులే వారికి నేర్పారు. రాజుకత్తికంటే శిల్పికుంచెకూ-కవికలానికీ ఆ ప్రజాసముదాయంపై ఎక్కువ అధికారం. ప్రతిదినమూ-మధ్యాహ్నమో, ప్రాతఃకాలమో - ప్రతిగృహిణీ రత్నాలు కుప్పబోసినట్లు ఫింఛాలను విసురుకునివుండే

మయూరాలకు నాట్యం నేర్పేది. చేతితో చిటికెలు వేసుకుంటూ తారకలు తారతారంగా చలింపగా-కను బొమ్మల లలితలాస్యభంగిమాలతో నెమలిని ఆడిస్తూండే ఆ మధురమూర్తిని కనుల చల్లగా చూస్తూ పురుషుఁడక్కడే నిలచిపోయేవాఁడు. ప్రొద్దుటిపూట-ఒకదినం– పలుకులు నేర్పకుండా కోడలు వూరుకున్న దంటే - పంజరాలలో "అరగన్ను వెట్టి ముఖము ల్పర ణాగ్రనఖాలి గోకుచు న్నిలుగుచు నావులించుచు" వుండే కీరశారికల్ని చూచి ఇంటిపనులు చేయనివ్వక అత్తలు "నీపని చూచుకోమని" కోడండ్రను తరిమే వారు. ప్రతిస్త్రీకీ "సవలయధ్వనిగాగ సారె త్రేయడం" రాకుంటే ఆ సంఘంలో బ్రదకటానికధికారమేలేదు. ఆనాటి రమణులు"బాస గృతిసెప్ప వలతులు." మధ్యాహ్నసమయాలలో "అల్లసానివాని అల్లికజిగిబిగినో" "ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకుల"నో గురించి యింటింటిలోనూ చర్చలు జరుగుతుంటాయి. పురుషులలో- స్త్రీలలో ప్రొద్దువాటారిందంటే అలంకారాలారంభమౌతాయి. విజయనగరములో ప్రతిరోజూ సాయంకాలం సంత జరుగుతుండేది. అందులో "రత్నాలూ, ముత్యాలూ" అమ్మబడినా- ముఖ్యంగా భోగ్యవస్తువుల్ని అమ్మేవారు. వీథుల కిరుప్రక్కలా పేపగంపల్లో కదంబపుదండలూ మొదలైన వమ్ముతూండే "గ్రామ్యతరుణీతతి" పువ్వులావిక లుంటారు. వారి నర్మగర్భాలకు బదులుచెప్పడానికి తోచక దిగాలుపడి నిలుచున్న దేశాంతరాగతులూ, పువ్వులావికలేకాక కస్తూరీ, కుంకుమా, కర్పూరం మొదలైనవి అమ్ముతూంటారు నవనవవిలాసినులు. పురుషుడల్లా-సాయంకాలమవుతూనే - నాటికి భోగ్యవస్తువులు యేమేమి కావలెనో భార్య నడిగేది వాడుక. ఆమె కొన్ని చిఱునవ్వుల్తో, కొన్ని చూపులతో, కొన్నిటిని తలపంకింపులతో చెప్పేది. బయటికి వెళ్లినప్పుడు వానికి ప్రతి పువ్వులావికతోనూ సరసమే. ప్రతి కర్పూరగంధితోనూ పరిహాసమే. ఇంటావిడ కీ విషయం తెలిసినా-మరేమీ అనుకోదు. వేసంగుల్లో ఆదంపతులు అప్పుడప్పుడు జలక్రీడలాడతారు. రాచనగరుల్లో జలక్రీడలకు విశాలములై, శిల్పసంపదలతో విరాజిల్లే కేళీసరస్సు లెన్నో వుండేవి. సామాన్యగృహస్థులు తమయింటి వుద్యానాల్లోనే క్రీడించేవారు. ఆ జలక్రీడాసౌభాగ్యానికి ఎంతో ప్రయత్నించి-భర్త భార్యకు యీత నేర్పిస్తూండేను. భర్తకు యీత నేర్పించడంలో యెంత కౌతూహలమో భార్యకు నేర్చుకోవడంలోనూ అంతే సరదా.

సౌందర్యాన్ని సాధించవలెననే దప్పి ఆ జనులకెంత గాఢమో-దాని సాధనలోనూ అంతే. ఒక పురుషుఁడు- గాలిలోవున్న పరిమళాన్నిబట్టే అది యెవరి పైనుండీ వీచిందో కనుక్కుంటాడు. తాంబూలం వేసుకోవడంలో సాధారణంగా స్త్రీలూ కస్తూరికి రెండింతలు కర్పూరాన్ని వాడతారు. చలికాలం వచ్చిందంటూనే కస్తూరీభాగం యెక్కువౌతుంది. తమలపాకుల్ని చిలకలుకడతారు. ఎదలకు- వేసంగుల్లో గంధమూ, వసంతాలలో కస్తూరీ, వానకాలాలలో కుంకుమా పూసుకుంటారు. ఈనియమాలలో ఎప్పుడు న్నూ మార్పురాదు. అవి వారి మనస్సుల్లో బాగా కరుడుగట్టుకుని పోయినవి. ధర్మశాస్త్రం వద్దన్నా ద్రాక్షాసవం మాత్రం వారు దినమూ సేవించేవారు. ఆసవాన్ని వదిలిపెడితే- వాసనార్పితసహకారపల్లవమని- చిగురు పెదవి కోరికే ఆనందం యెక్కడినుంచీ వస్తుంది! ఐంద్రియికమైన కామం ఆప్రజకు వాజూకుగా సాధింపవలసిన సాధనల్లో ఒకటి. ఏల కారాదు ! మానవుడు బ్రదుకనే వచ్చునఁట! దాని కావశ్యకమగు పురుషార్థాన్ని సాధించవలె ననే దృష్టి వుండటం తప్పా! ఏమీ కాదు.

ఆ జనులకు ప్రకృతి అంటే అమితప్రేమ. వారు ప్రకృతిలోనే బ్రదుకుతూండిరి. ప్రతికాలాన్నీ వారు ప్రేమించారు. ప్రతిసమయాన్నీ ఆరాధించారు. వేసంగులు వారు వలచిరి. దినములు జలక్రీడలతో గడిపి-రాత్రిళ్లలో చందనపు పూతలతో, విరుల సిగలతో, వలిపెయొంటొల్లెలతో వెన్నెలబయళ్లలో తనివిదీర సుఖించిరి. వర్షాసమయాలలో సుమగంధరసమజ్జనం చేసి-దువ్వలువలు ధరించి-మొగలిపూలతో కలకలలాడే కొప్పులతో కాజు, ఉడుము, ఏదుపంది-వీని మాంసాలతో, అటుగాకుంటే-అధికహైయ్యంగవీనంగా శాల్యన్నం భుజించి- అగరుచెక్కల హసంతికల ధూపధూమాలతో సౌంధర్యాన్ని ఆరాధించిరి. వసంతాల్లలో అగరు పూసు

కోరు. ముక్తాహారాలే ధరిస్తారు. పూవులజడలో "కురువేరులు" కలిపి అలంకరించుకుంటారు. మోదుగు పూలరసంతో ప్రియాప్రియులు వసంతాలు చల్లుకుంటారు. కాముని పున్నమలలో యీ వేడుక లెక్కువ. మరి యిక యేకాలాలు వారికి భోగ్యాలు కాకపోయినాయి! ఏ తలపులు వారిని కదిలించలేవు! ఏ మధుర వస్తువు వారిచే తృణీకరింపబడింది ! ఏదిన్నీ లేదు.

ఆ ప్రజకు సుందరలలితభావాలపై యెక్కువ ప్రీతి. మదించిన యేనుగుల మదధారల్లో "కడిమిపూవుల గంధాన్నే" ఆస్వాదించారు. వాని దంతాలలో "మధువర్ణాన్ని" అభివీక్షించారు. రాలిన పూవులఁ జూచి వారు జాలిపడిరి. ప్రియావిరహంతో బాధపడే చక్రవాకాలను చూచి కన్నీరుపెట్టిరి. "వేదురువన్ పయిగాలి సోకినన్ వెన్నవలెన్ గరంగుచే" మానవత్వ మని వారి యూహ. ప్రియుని బెడబాసి "నిడుదవేనలి నూనెముడితో" పనులలో ఉదాసీనంగా తిరుగుతూండే "విరహిణి"ని చూచి— "అయ్యో" అనుకున్నవారే గాని అసహ్యించుకున్నవారు ఆసంఘంలో లేరు. అల్లాగే "సర్వాంగాభరణశోభితంగా" కంకేళిని కౌగిలించటానికీ, అశోకాన్ని కాలఁదన్నడానికీ పోతూండే చూచికూడా యెవరూ పరిహాసంచేయలేదు. అవన్నీ వారికి సాధారణకృత్యాలు. ప్రతియింట్లో ఒక కోపగృహం వుండేదిట. ఇంటావిడకి కోపం వస్తే ఆమె అలకగొనడానికీ—ప్రియుడు ఓదార్చడానికీని.

ఇఁక-ఆనాటి స్త్రీలందామా ! వారంతా రూపాంతరమొందిన వరూథినులు. పేరుమార్చుకున్న గిరికలు. విజయనగరసామ్రాజ్యాన్ని తలుచుకుంటూనే కన్నుల కాటుకలతో, తొంగలిరెప్పలతో, కస్తూరిబొట్టులతో "సెలవివార" నవ్వుకుంటూ యెదుట నిలుస్తారు. కటకమంజీరాలూ, బన్నసరాలూ, మట్టెలూ, పిల్లాండ్లూ, రత్నాల మొలనూలూ, కరకంకణాలూ, జడబిల్లలూ, కొప్పువలలూ వారి పరిమితాలైన సొమ్ములు. శ్రీనాథుఁడు వారి "కర్ణహాటకరత్న తాటంకయుగధాళధళ్యాలకు" తకపికలాడినాడు. నారుపట్టుచీరలు ధరిస్తారు. కొంద రవీ కట్టరు. లలితములైన వారి శరీరాలకు ఒత్తుకుంటాయట. కాళ్ళకు పారాణి పెట్టుకుంటారు. అదిన్నీ ప్రియార్పితమైతే పరమప్రీతి. వారు వలచే వస్త్రాలు "చెందిరికపావడలూ", వానిపైన "ఊదినఁబారు దుప్పటులువలు. ఒక్కొకసారి కావిచీరలు కూడా కడతారు. కాని, ఆ రమణులకు "కావులు" అంత యిష్టముకావు. విద్యానగరస్త్రీలు చాలా జాణలు. "అచటఁ బుట్టిన చిగురుకొమ్మైన చేవ" అనే మాట ఆనాడు విద్యానగరాన్నిగురించి అందరూ అనుకునే నానుడివంటిది.

విజయనగరంలో అన్నిసంస్కృతులూ గూడు గట్టుకున్నాయి. హిందూదేవళాల ప్రక్కనే జైనబౌద్ధుల చైత్యాలూ, వీరశైవమఠాలూ వుండేవి. రాజులు వీరవైష్ణవులైనా- వీరశైవులైనా-వారి"వీరత్వం" మత సహనానికి యేమాత్రమున్నూ అడ్డువచ్చేది కాదు. మహమ్మదీయులుకూడా అచ్చట కాపురముంటూ యితరులతోపాటు అన్ని అనుకూలాలూ అనుభవిస్తూండిరి. పాశ్చాత్యరాయబార్లు ఆనగరాన నిలిచి తమ నాగరికతకు పునాదులు వేసుకుంటూండినారు.

అప్పటి కళాకారులకు స్వాతంత్ర్యం అమితం. రాజులనుకూడా "నిరుపహతిస్థలమూ, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చే కప్పురవిడెమూ" లేకుంటే కళావిర్భూతి కాదని కవులూ, శిల్పులూ ధిక్కరించిన రోజులవి. ఆ రాజులు మహారసికులు. ఈ ధిక్కారానికి "శకటగ్రామాద్యనేకాగ్రహారాలు" కళాకారులకు రాజు లిచ్చిన ప్రతిశిక్ష. నుదుట గంగమట్టితో, మణికుండలాలతో, పసిడిప్రాతచెఱంగు మిసిమిదోపఁ జెలంగు అరుణాంశుకోత్తరీయాలతో, కర్ణకుండలాలతో, రాజోపచారాలతో, రత్నపాదుకలతో "శాంతరసమొలుకు బ్రహ్మతేజస్సులు" గల కవులు ఆనాఁడు అందలాలలోఁ దిరిగిరి. అప్పటి సామాజికఅభిరుచులకు వారధిష్ఠాతలు. ఏవృత్తివాని కావృత్తియందే భుక్తియుండెను. వృత్తులలో పోటీలులేవు. విజయనగరమహాసామ్రాజ్యం విస్తరిల్లిన నాలుగయిదునూర్లేండ్లున్నూ-శిల్పుల వులి తన గానాన్ని మానలేదు. చిత్రకారుని కుంచె గడియగడియకూ వింతముస్తాబులు విడువలేదు. కవికలము మధురసృష్టిని మానలేదు. గాయకుని కంఠము కరుగలేదు. వీణెలు మూగనోముపట్టలేదు. వీథిభాగవ

తులు, మాలదాసర్లు, బుడుబుక్కలవారు, పగటివేషగాండ్లు—తోలుబొమ్మలవారు—యెవరుగాని యే ఆదరంతోకూడా వంచితులు కాలేదు. చక్కని కవిత్వం వ్రాసిన కవికీ, మ్రానిబొమ్మలు బాగా ఆడించిన ఆటగానికీ ఆకాలంలో మర్యాదలో తరతమభావాలు లేవు. ప్రతి కళాకారుడూ తనదే విద్యానగరమనుకుని గర్వించాడు. ఆ ప్రజలు దారిద్ర్య మెఱుఁగరు. భోగదారిద్ర్య మెఱుఁగరు. హృదయదారిద్ర్య మెఱుఁగరు. "ఆబాలగోపాలమూ" ఆనందమున మనిరి. భోగసముద్రములోని మధురవీచికలు వారు. ఆ జీవన మొక కల. లయానుబద్ధమైన ఒక సంగీతం. ఆవేశపరవశమైన ఒక కవిత్వం. ఆనాఁడు అందరి చూపులున్నూ "భువనవిజయాఖ్య సంసద్భవనము" పైననే వ్రాలినాయి. కాని—యేమి లాభం! ఆస్వర్గఖండాన్ని కాలం మ్రింగివేసింది. ఇప్పుడక్కడమిగిలినవి మ్రోడులుదక్కిన మన నాగరికతవంటి మొండిగోడలు, పదమదమై అన్నిటితోనూ కలిసిన ఆంధ్రసంస్కృతివంటి గచ్చుపొదలున్నూ—అంతే.





# సమ్రాట్ అగ్నిమిత్రుడు



[ నాటిక ]



## శ్రీ తల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులు

ఈ నాటిక ఐతిహాసికము. క్రీ. పూ. 3-వ శతాబ్దిలోని భారత జాతీయ జీవనం ఇందులో ప్రతి బింబితం. జాతీయ జీవన వికాసానికి పతంజలి మహర్షి, అగ్నిమిత్రులు కారకులు. వసుమిత్రుడు తండ్రివలె తీవ్ర జాతీయవాది కాడు. అతను యవన భారతైక్యాను సంధానము ప్రేమయోగమూలంగా ప్రయత్నించి విఫలుడైనాడు. తక్షశిలలో కుమారవసువు యవనకన్యను ప్రేమించినట్టు చారిత్రక సత్యము. పతంజలి మహర్షులు అగ్నిమిత్ర వసుమిత్రుల కాలంలో ఉన్నట్టు చరిత్ర చెపుతుంది.

నాటికలో 'ఏణి' యవననాగరకతకూ, కుమార వసువు 'భారత నాగరకత'కూ సంకేతాలు. భిన్న నాగరకతా సమన్వయం క్రీ. పూ. 3 వ శతాబ్దిలో పూర్తిగా జరగలేదు. అగ్నిమిత్రుడు ఆర్షధర్మ ప్రేరితుడై జాతి నిర్మాతగా, భారతావనీ జాగరణప్రదీపమై విరాజిల్లినాడు.

[దేవాలయంలో గణగణ గంటలు. ఉచ్చైస్స్వరంలో 'శివాయచ, రుద్రాయచ, శివతరాయచ', 'ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్ బ్రహ్మణోధిపతిర్ బ్రహ్మా శివో మే అస్తు సదాశివోం—']

ఒకరు—తొలగండి తొలగండి. ఉజ్జయినీ మహాకాలనాథేశ్వరుణ్ణి సేవించడానికి భారత చక్రవర్తులు అగ్నిమిత్ర భట్టారకులు వేంచేస్తున్నారు.

మరొకరు—సుంగ సామ్రాట్ శ్రీమన్మహాగ్నిమిత్రులవారు శత్రుసంహార సంకల్ప సిద్ధికై కాలనాథేశ్వరునికి రుద్రాభిషేకం చేయిస్తున్నారు.

(కోలాహలం తగ్గుతుంది)

అగ్నిమిత్రుడు—హే రుద్ర! హే కాలనాథ! నీ చరణసన్నిధిలో భగవాన్ పతంజలి మహర్షుల ఆదేశానుసారం శత్రుసంహారదీక్ష స్వీకరిస్తున్నాను.

'భయానాం భయం, భీషణం భీషణానాం, మహోచ్చైః పదానాం నియంతృత్వ మేకం'......

సేనాధిపతులు—భారతావనీ జాగరణ ప్రదీప! కుటిలారాతి వరూధినీ విదళనా! యవనకౌటిల్య విధ్వంసకా! ఆర్షధర్మోద్ధారకా! విజయీభవ!

అందరూ—హరహర మహాదేవ!

అగ్నిమిత్రులు—శత్రుసేనలు మధురాపురము దాడిచేశాయని తెలుస్తున్నది. నా భారత సామ్రాజ్యంలో వీరాధివీరులు హృదయరక్తధారను భారతావనికి నైవేద్యంగా అర్పించాలి. పరాధీన భారతజాతి స్వేచ్ఛకై భగవాన్ పతంజలి మహర్షులు తపించితపించి ఆక్రోశిస్తూ ఆదేశిస్తున్నారు. యవనులను తరిమి ఆర్యజాతిని ఉద్ధరించండి. సేనాధిపతులకు పదేపదే చెప్పను. దేశద్రోహులు యవనుల పక్షము చేరితే, వారిని పట్టి తెచ్చినవారికి ఒక్కొక్కరికీ నూరు దీనారాలు పారితో

షికం! రిపుహృదయ రక్తంలో మీమీ ఖడ్గాలు క్షాళితములు కావాలి.

హరహర మహాదేవ! (శంఖారావం)

ఒకరు—(దూరాన మెల్లగా) అమ్మో! అగ్నిమిత్ర భట్టారకుల ఫాలభాగము ప్రళయరుద్రుని నిటల దీప్తివలె తళతళలాడుచున్నది.

మరొక కంఠం—(దూరంగా సన్నగా) చక్రవర్తుల నేత్రకాంతి విజయలక్ష్మి దరహాసమువలె ఉన్నదే!

(హాహాకారం చేస్తూ ఒక వీరుడు ప్రవేశం)

అగ్నిమిత్రులు—ఎవరా విలపించేవారు?

ఒక కంఠం—మహా ప్రభూ! ఎవరో మధురాపురంనుండి వచ్చిన విప్రవీరుడు!

బ్రహ్మదత్త వీరుడు—(బాధగా) మహాప్రభూ! ప్రణామములు. తమ పాదాలమోల నిలిచిన విప్రవీరుడు మనవి చేసుకొంటున్నాడు.

అగ్ని—ఏమయింది? ఏమయింది? బ్రహ్మదత్తా?

బ్రహ్మ—ప్రభో! మధురాపురం శత్రు హస్తగతమైంది. యవనసేనాపతి హీలియోకలు మలమలమాడే ఎండలో—ఇసుకలో—మన వీరుల పెడరెక్కలు విరిచి, కాళ్లు కట్టి, కొరడాలతో కొట్టి తన్ని, కుక్కలవలె మనవారిని ఈడిపించినాడు ప్రభూ! మనవారు శౌరసేనంలో స్వేచ్ఛకై పతాక ప్రతిష్ఠచేయగా, యవనులు భారతపతాకను లాగి చించివేసినారు.

అగ్ని—కలికిమూర్తినై కరకాశ్వ మారోహించి భారతాన్ని శత్రునిర్ముక్తం చేస్తాను. కాలనాథేశ్వర సన్నిధిలో శపథం చేసినాను. యవనుల దారుణకాండ భారతజాతి మరవలేదు. నా సామ్రాజ్యచ్ఛత్ర దండము ముక్కలు చేయదలచిన రిపుసేనను నాశనం చేస్తాను. రిపుహృదయ రక్తంతో సామ్రాజ్యలక్ష్మి చరణాల పారాణిపూస్తాను. ఆర్యజాతికై, భారత ధర్మదీప్తికై అవసరమైతే నా కుమార వసుమిత్రుణ్ణి కూడా బలిదానం చేస్తాను.

అందరూ—హరహర మహాదేవ!

అగ్ని—ఆంధ్ర శ్రీ పుత్ర యజ్ఞదత్తా! మధురాపురానికి వెంటనే ఆంధ్రసేనను సమాయత్త పరుచు.

యజ్ఞదత్తు—చిత్తము మహాప్రభూ!

బ్రహ్మదత్తు—ప్రభూ! మధురాపురం శత్రు పీడనంవల్ల నాశనమవుతున్నది. జైనులు యవనులతో కలసి భారత సామ్రాజ్య నాశనానికి కుట్రలు పన్నుతున్నారు.

అగ్ని—జినసూరి కొడుకదా?

బ్రహ్మ—జినసూరే మహాప్రభూ!

అగ్ని—అల్పసంఖ్యాకుల హక్కులకై విప్రుడు యవనపక్షం చేరి దేశద్రోహిగా మారినాడు! హే కాలనాథ! ఈ జాతి దౌర్భాగ్యము. భారతీయ హృదయాన్ని, మాతృహృదయాన్ని గండ్రగొడ్డలితో ఖండించి ముక్కలు ముక్కలు చేయదలచినాడా?

బ్రహ్మ—జినసూరి తిరుగుబాటువల్ల మధురాపురం అల్లకల్లోలమైంది. యవనప్రభువు డెమిట్రియసు చేసిన ఆజ్ఞప్రకారం వేదాధ్యయనం చేసే విప్రులను బంధించినారు.

అగ్ని—దేశద్రోహులు యవనపక్షం చేరగా, భారతావని కన్నీరు మున్నీరుగా పరాధీనమై విలపిస్తున్నది. దేశద్రోహులు మాతృయావనోదార వనీకురారులు. ద్రోహులను పట్టి తీసుకురావాలి.

సేనాపతులు—భారత సామ్రాజ్యచ్ఛత్ర దండము స్థిరంగా ఉండడానికి, భారతాభ్యుదయానికి త్యాగం చేస్తాము. ద్రోహులను పట్టితెస్తాము. మహా ప్రభూ!

అగ్ని—నా జనకులు, సేనాని, పుష్యమిత్రులు బౌద్ధులను చెండాడినట్టు ద్రోహులను చెండాడి మానవ కపాలమాలలతో కాలనాథేశ్వరునికి గ్రీవాలంకరణం చేస్తాను. తదీయ రిపురక్తంతో రుద్రాభిషేకం చేయాలి. యవనరక్తంతో సామ్రాజ్య లక్ష్మి, అర్ధాంగ లక్ష్మి, మాళవికనుదుట తిలకం తీరుస్తాను. హరహర మహాదేవ!

# పరిశుభ్రతకు హామీ

తాము తయారుచేసే సరకుల్లో అతి అమితమైన పరిశుభ్రత ఉండేటట్లు చూడటం పెప్పర్‌మింట్లు వగైరా తయారుచేసే ప్రతివారికీ విధి. స్వీట్లు అపరిశుభ్రంగా ఉంటే, హాని చేస్తవి. స్వీట్స్ ఎక్కువగా తినేది చిన్నపిల్లలు. అందువల్ల తమ సావరిన్ స్వీట్స్ ప్రతిదీ కూడా అమితపరిశుభ్రంగా ఉంటుందని కె.సి.పి. వారు గట్టిగా చెబుతున్నారు.

దేశమంతా ఆదరించబడినవి



## సావరిన్ స్వీట్స్

కె. సి. పి. తయారీ

## వసంతోత్సవం

(తక్షశిల విద్యాపీఠం—కోలాహలం తగ్గుతూ ఉండగా, అందెల జిలిబిలి స్వరాలు—యవన కన్య గానం చేస్తుంది.)

గానం—

వసంత యామిని రాకే రాకే
వసంత మాధురి రాకే
కోకిల కాకలి, కోమల మధువును
ఎద భరింపదే, ఏమి సేతునే (వసంత)
కేతకి దళమే కుంతాయుధమై
యువజన హృదయ విదారణ మగునే (వసంత)
తళతళ మెరసెడి దరహాసముతో
కత్తియంచులై కోయునె నా ఎద (వసంత)
ఆమని మత్తులో ఆధి బాధలన్
విరాళికీలల వేగిపోతినే (వసంత)

ఒకరు—తక్షశిల విద్యాపీఠ వసంతోత్సవం అద్భుతంగా ఉంది. యవనకన్య ఏణి ఎంత చక్కగా పాడిందోయ్!

మరొకరు—మన విద్యాపీఠంలో, విహారంలో కుమార వసుమిత్రులవల్ల, పాఠప్రవచనాలకన్న ప్రణయం బాగా సాగుతున్నది. (నవ్వు)

ఒకరు—ఏం అలా అంటావు?

మరొకరు—ఏణి కుమారవసువును ప్రేమిస్తున్నది. ఆమనిమత్తులో విరాళికీలలకు తాళలేదట!

ఒకరు—శుంగ సామ్రాజ్యచ్ఛత్రచ్ఛాయ విడిచి యువరాజులు వసుమిత్రులు గాంధారశిల్పం నేర్చుకోవాలని కాదుటోయ్ తక్షశిలకు వచ్చారు.

మరొకరు—అవును. వసుమిత్రులు శిల్పాచార్యుని సన్నిధిలో బుద్ధదేవుని శిరస్సులు మూర్తించబోయి యవనకన్య ఏణిమీద వలపువల్ల ఏణి శిరస్సులను మూర్తిస్తున్నారట! విహారమంతా పాక్కపోయింది.

ఒకరు—అమ్మో! విహారంలో వలపు తికమకలే! 'పాతిమోఖ్ఖ' పఠించినా ప్రమాదాలు చేస్తూవుంటే వినయధర్మం నశిస్తుంటే ఎలాగ? యవనకన్యను అగ్నిమిత్రుల కుమారులు విప్రులు ప్రేమించడమే? సామ్రాజ్య క్షేమం చూచుకోక శాత్రవసీమలో శత్రుకన్యను ప్రేమిస్తున్నారే కుమారవసువులు?

మరొకరు—వలపు తలకెక్కినవారికి శత్రుత్వానికీ, మిత్రత్వానికీ భేదం తెలియదు. యవన ప్రభువు శుంగమహీపతుల చేతుల్లో చిత్తయిపోయాడు. కుమారవసువు యవనకన్యను ప్రేమిస్తోంటే ప్రభువు ఎలా సహిస్తాడో?

ఒకరు—ఏమో ఇంతకూ ఎవరినన్న దోషమూ లేదు. బౌద్ధభిక్కుని విహారంలో వినయానికి గ్లాని తెస్తున్నది. భిక్కుని, సాంకృత్యాయని దూతీ కర్మ జరుపుతూ, ఏణీవసుమిత్రులను అనుసంధానం చేస్తున్నది.

మరొకరు—భిక్కుని 'తథాగతు'ణ్ని మరిచిపోయి కుమారవసువును ప్రేమించడం ఘోరం.

ఒకరు—ఈ ప్రణయం ప్రళయం కాదుగదా' పదవోయ్ విహారానికి. చైత్యావందన వేళయింది.

ఇద్దరూ-

నమో తస్స బుద్ధస్స
నమో తస్స బుద్ధస్స
కుశలస్స ఉప సంపదా

(గంటలు వినపడతాయి)

## ఉజ్జయినిలో

శిష్యుడు—

"యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేన
యోఒపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలి రానతోస్మి"

గురుదేవులు, ఆదిశేషావతార సంభూతులు, లోకరక్షాదక్షులు భగవాన్ మహర్షులు నా సంశయ నివృత్తి చేయాలి. మహాభాష్యం వా పఠనీయం, మహారాజ్యం వా పాలనీయం—అని మీరు రచన చేశారే?

ప్రస్తుత పరిస్థితుల్లో భాష్యం చదువుతూ ఉండమన్నారా?

పతంజలి—మహాభాష్య ప్రస్తుకం కట్టిపెట్టి మహారాజ్య భద్రత చూడాలి. భారతజాతి శోభాదరిద్రాణమై, శత్రుహస్తగత మైనప్పుడు భాష్యం అధ్యయనం చేసే సమయమా? ఏ క్షణంలో యవన సేనలు మన ఉజ్జయినిమీద పడతాయో! పుష్యమిత్ర సమ్రాట్టులకు మనం తోడ్పడాలి.

శిష్యుడు—గురుదేవా! అదుగో చక్రవర్తులు తమ దర్శనార్థం స్వయంగా వేంచేసినారు.

అగ్ని—భగవాన్ పతంజలి గురుదేవులకు ప్రణామం.

పతం—సంకల్పసిద్ధిరస్తు. చిరాయురస్తు.

అగ్ని—మహా ప్రసాదం. గురుదేవుల వాక్కు అర్థాన్ని అనుసరించే ఉంటుంది. నా హృదయం కల్లోలంగా ఉంది దేవా!

పతం—కుమార వసుమిత్రుడు తక్షశిలనుండి రాలేదా? ఇంకా రాలేదా? వెంటనే వసుమిత్రుడు ఉజ్జయినికి వచ్చితీరాలి.

అగ్ని—జాతి విపరీతపరిస్థితుల్లో ఉండగా నా కుమారుడు శాత్రవ యవనకన్యను ప్రేమిస్తూ తక్షశిలలో ఉండడం సహించలేక పోతున్నాను. దుర్మార్గుడు యవన ప్రభువు కోపాతిరేకంవల్ల కౌటిల్యంతో నా కుమారుణ్ని ఏం చేస్తాడో?

పతం—భారతజాతి యవనులచేతుల్లో పడుతుందేమోనని తల్లడిల్లుతున్నప్పుడు ఈ దౌర్భాగ్య విజాతీయ ప్రణయమేమిటి? కుమారవసువు రాజధానికి వచ్చి తీరాలి. ఏత దనుశాసనమ్. ఏత దనుల్లంఘనీయం. రాజన్! కుమారవసుమిత్రుని ధీరలాలిత్యానికి ఇది సమయము కాదు!

అగ్ని—నేనూ ఒకప్పుడు ధీరలలితుణ్నే! అప్పుడు నాకు మహారాణీమయం ఈ ప్రపంచం. మందిరోద్యానంలో మహారాణిచేత పాదతాడనం చేయిస్తూ, కుసుమితాశోకపున్నాగ పాదపములను తిలకించేవాణ్ని; ప్రియాపాదాలక్త చ్ఛురితమై అరుణచ్ఛాయ సుభగుడనై మురిసేవాడను! ప్రియురాలి నృత్యగతులు చూస్తూవుంటే నా చిత్తము తనిసిపోయేది. ఇప్పుడు నా హృదయం కణకణ లాడుతూన్నది. నా కుమారుడు ప్రేమయోగంలో లలిత హృదయుడై, యుద్ధవిముఖు డైపోయాడు. గురుదేవా! మీరు కుమారవసువును వెంటపెట్టుకొని యాగాశ్వంవెంట వెళ్లి, రిపుకోటి సహస్ర శిరస్సులను హుటాహుటి తెగనరికివేయాలి.

పతం—రాజన్! నిజమే! శత్రునిర్ముక్తం కాని పరాధీన భారతాన్ని చూడలేను. అందుకే మహాభాష్యం పాఠం మానేయమని శాసించాను.

అగ్ని—యవనులు ఆక్రమించిన శౌరసేనంలో జరిగే దురంతాలకు అంతులేదు. గురుదేవా! తడిగుడ్డలతో కంఠాలు త్తరిస్తూ రక్తం చిందనీయని రాజనీతి యవనులది. మథురాపురంలో వీరులు యాగపశువులై ఆహుతి అయిపోతున్నారు.

పతం—శుభ్ర తుషార సుందర కిరీటినీ! సామగాన ముఖరిత దిగంచలా! వేదమాతా! పూతధాత్రీ! నీకై మానవకోటి త్యాగసిద్ధమైనది. స్వేచ్ఛాగుణోదయానికి త్రింశత్కోటి కంఠ కలకల నినాదం వినవస్తున్నది!

అగ్ని—భగవాన్ పతంజలి మహర్షులు దివ్యాశీస్తార బలంవల్ల భారతజాతి తల ఎత్తుతుంది. సర్వజాతుల్లో భారతం మకుటాయమాన మవుతుంది!

పతం—శుభం భూయాత్. వెంటనే కుమారవసువుకు నా శాసనం పంపించాలి.

అగ్ని—గురుదేవా! భవదాజ్ఞా దృఢబంధవర్తిని. శెలవు. (నిష్క్రమణ. కోలాహలం)

గానం - ప్రజలు

జయ్ జయ్ జయ్
జయ్ భారత జాగృతి ప్రదీప !
జయ్ జయ్ జయ్
జయసంగ మహీపాలా
భారత భాగ్యవిధాతా
దీనబంధు పరిత్రాతా
భారత రాజ్యనియంతా

భారత ధర్మప్రదాతా
జయ్ జయ్ జయ్
జయ భారత జాగృత ప్రదీప!

౪

తక్షశిల - విహారం

(గుఱ్ఱపు గిట్టల చప్పుడు-హేషారవం)

ఒకడు—మిళిందుడెక్కడ? ఎక్కడ మిళిందుడు?

మరొకరు—ఏమిటా వేగిరపాటు? ఎందుకు?

ఒకడు—ఎక్కడ మిళిందుడు?

మరొకరు—నేనే మిళిందుణ్ణి. ఎక్కణ్ణించిరాక?

ఒకడు—శాకల నగరంనుండి. నమస్కారం. యవనప్రభువు ఈ లేఖ మీకు అందజేయమన్నారు. కర్తవ్యం తెలుసుకొని, ప్రభువు చేసిన ఆజ్ఞ నెరవేర్చాలి. శెలవు. (నిష్క్రమణ. గుఱ్ఱపు డెక్కల చప్పుడు.)

మిళిందుడు—"మినాండర్! కుమారవసు మిత్రుడు తక్షశిలావిహారంలో గాని, విద్యాపీఠంలో గాని ఉండవీలులేదు. మనం ఒకసారి సుంగ విప్రరాజుల చేతుల్లో చిత్తయినాము. వసుమిత్రుడు మన శత్రువు. ఏణిని ప్రేమిస్తున్నాడని తెలిసింది. నీవు నావిధేయుడవుకనుక, సమయాసమయాలు కనిపెట్టి శత్రువును హతమార్చు. రక్తం నాకు పంపవలె. అప్రమత్తత కూడదు. శీఘ్రంగా కార్యం సానుకూలం కావాలి.

డెమిట్రియస్ వ్రాలు, శాకలనగరం."

(క్షణం నిట్టూర్చి) ఇదా ఉత్తరం? ఇంతకిరాతుడా యవన ప్రభువు? చూస్తూ చూస్తూ మిత్రుణ్ణి వసుమిత్రుణ్ణి ఎలా చంపను? ఇద్దరమూ ఈ తక్షశిలలో చదువుకొన్నామే? డెమిట్రియస్! నీకు నిండుప్రాణాలు, నిండుయువకుని తీయని ప్రాణాలే కావాలా? నన్నెందుకు ఇలా పరీక్షిస్తావు? రాజసేవ ఎంత అనర్థకం. మహాప్రభో! డెమిట్రియస్! యవనభారతైక్యత నీకు ఇష్టంలేదా? రక్తం ఎలా నీకు అర్పించను? నాకు చిత్తసమాధానం లేదు. నాప్రశ్నలకు సమాధానమిచ్చిన నాగభిక్షువైనా లేడే? అతనైనా మనశ్శాంతి కలిగిస్తాడేమో! అబ్బ! 'నమో తస్స అరహతో సమ్మాసంబుద్ధస్స' అంట్లూ నిట్టూరుస్తాడు. (నిష్క్రమణ)

౫

తక్షశిల - విహారం

(కూనిరాగం తీస్తూఉంటాడు కుమారవసువు. పకపక నవ్వుతూ అందెల సవ్వడితో ఏణిప్రవేశం. చప్పున వసుమిత్రుడు కూనిరాగం ఆపుతాడు.)

కుమారవసువు—ఓహో ప్రియురాలా! ఓహో ప్రియురాలా! వచ్చావా! వచ్చావా!

ఏణి—వసుమిత్రులు ఏదో కూనిరాగం తీస్తూ మానేశారు. నేను వినకూడదా చెప్పండి.

వసువు—ఏణీ! ఏదో నాలో పాడుకుంటున్నాను.

ఏణి—వసుమిత్రులు యవనశిల్పం నేర్చుకోడమే కాక గాంధర్వంకూడా అభ్యసించారే?

వసు—గాంధర్వంకూడా మీ యవనులదనేనా నీ అభిమతం?

ఏణి—సంగీతంకూడా మాదగ్గిరే మీరు నేర్చారు.

వసు—ఏమి కొంటెతనం? నాదబ్రహ్మము భారతదేశంలోను, యవన దేశాల్లోనూ, సమస్తావకాశంలోనూ ఉండనేఉంది.

ఏణి—సరేకాని, కొత్తపాటలు రాశారా చెప్పండి? (వీణ మీటుతుంది)

వసువు—

రగిలి రగిలిన గుండె
రాగ రక్తారుణము!
పగిలి పగిలిన ఎడద
బాధానలజ్వాలము!
హృదయ మారగనింపు
మదయ శోకాసవము!
వలవంతలో క్రుంగు
తరుణార్ద్ర హృదయమ్ము!

ఏణి—మా శాఫోలాగ హాయిగా వుందండీ మీ కవిత్వం! నన్ను చూస్తూంటేనే మీ రిలా మహాకవిలా రాస్తారు.

వసువు—నన్ను 'శాఫో'తో పోలుస్తావేమి? ఏణీ? నీ మూర్తిని చూస్తే, నీహృదయాన్ని గ్రహిస్తే

శాకవిత పొంగులెత్తుతున్నది. నా హృదయజలధికి, ఏణీ, నువ్వు పూర్ణిమాశరజ్జ్యోత్స్నవు!

ఏణి—ఏమండీ నేనంత చక్కనిదాన్నే?

వసు—ఇంకా సందేహమా?

ఏణి—చక్కదనం అంటే ఏమిటండీ? మీరు శిల్పులు కదా?

వసు—నువ్వుమాత్రం కావా ఏణీ? మహా నీకు తెలియనట్టు కొంటెగా అడుగుతున్నావు. నీ సుందరాకారప్రతీతి వల్ల నాహృదయమూ, చిత్తమూ మాధుర్యంలో కరిగిపోయాయి.

ఏణి—మీరు మానసికసౌందర్యాన్ని సౌందర్యమంటారు.

వసు—నేను గాంధారశిల్పములో నీ రూపము చక్కగా మూర్తించాను. నా కలలు నా కోరికలు చిరనిద్రాణవాంఛలు, అన్నీ నిన్నే మూర్తించాయి ఏణీ!

ఏణి—మాయవనులవల్లనే మీరు రేఖల్లో రూపంలో సౌష్ఠవం చూపారు.

వసు—ఓస్, అలాఅంటున్నావా? మాభారతీయ శిల్పంలో ప్రాణానికిప్రాముఖ్యం ఇస్తాం, ప్రాణప్రతిష్ఠ లేని రూపం నిర్జీవం కాదా ఏణీ? ప్రాణవిలాసాని ఆశ్రయిస్తేనే రూపం సజీవంగా ఉంటుంది.

ఏణి—మరే పాపం! సాంచిలో బార్హూతులో ద్వారప్రాకార తోరణ శిల్పవిజ్ఞానం మా వాళ్ళ వల్లనే కదా వచ్చింది.

వసు—మా వాళ్లు జీవంపోస్తే మీ వాళ్లు రేఖలు తీర్చారు. అవునుకాని నువ్వూ, నేనూ ఒకటైపోతూ ఉంటే భేదం ఎందుకు మాట్లాడుకోవడం ఏణీ?

ఏణి—భావనలో యవనభారతభేదం లేదు. మనం ఒకటే.

వసు—కాంతా సమ్మితంగా నీవు ఏమిపలికినా రమణీయమై నా విచక్షణ కూడా ఒక్కొక్కసారి పోగొడుతుంది.

ఏణి—మీ సాన్నిధ్యబలంవల్లనే నాలో ఏశక్తి స్పందించినా? ఏమంటారు? అంటే నేను చేతకానిదాన్ని కాను.

వసు—మళ్లీ ఆశలు కొందుకు? ఏణీ, నీవు శక్తివి, నేను శివుణ్ణి.

ఏణి—ఏమిటీ పరిణామం?

వసు—పరిణామం ఎప్పుడూ ఉంటుంది! మీ 'డెమాక్రిటస్' దే అనుకొన్నావా? మీవాళ్లు మా పరిణామవాదాన్ని అనుసరించారు.

ఏణి—మీకూ మీ కపిలమహర్షికీ నెయ్యి నమస్కారాలు. నా సాన్నిధ్యంవల్ల మీకూ బలంవస్తుంది.

వసు—అవును ప్రేయసీ, అలాగే వస్తుంది.

ఏణి—అలా అయితే జాతికీ జాతికీ ద్వేషం, భేదం పోగొట్టుకోండి.

వసు—త్యాగశక్తివల్ల జాతుల మధ్య ద్వేషం అంతరిస్తుంది. ఏణీ, నా హృదయంలో నిద్రాణమైన సంక్షోభాన్ని రెచ్చగొట్టావు. నా తండ్రి అగ్నిమిత్ర చక్రవర్తులు సనాతనులు, ఉజ్జ్వల జాతీయాభిమాని. ఆయన ఆర్యజాతి పాలిట అఖండలుడై నిశిత వైదిక ధర్మ వజ్రాయుధముతో శత్రుజాతి పక్షాలను ఖండఖండాలు చేయ నిశ్చయించినట్టు కర్ణాకర్ణిగా తెలుస్తున్నది. నేను సహించలేను.

ఏణి—మన మైత్రీపాశం తెగిపోదు కదా?

వసు—త్యాగంవల్ల మైత్రి గాఢమవుతుంది ఏణీ? బుద్ధదేవుని శీతలకారుణ్యం, మహామైత్రి తక్షశిలలో అర్థముచేసుకొన్నాను. ఆ మైత్రీపాశం నిన్నూ నన్నూ ఏకంచేసింది ఏణీ? నేను చక్రవర్తి కుమారుణ్ణనే అహంకారం, దర్పం నీ సౌందర్య రసప్రవాహంలో, నీ కారుణ్యంలో కరిగిపోయాయి. యవన భారత హృదయాలు ఏకమవుతూఉంటే ఇటు మీ యవన ప్రభువు, అటు నా జనకులు అగ్నిమిత్రులు కత్తులు నూరుతున్నారు.

ఏణి—స్నేహాన్ని స్వర్ణ పీఠంమీద ఉంచాను. స్నేహంలో వైరం కరిగిపోవద్దా?

వసు—అందుకే నేను రెండుజాతుల మధ్య నలిగిపోతున్నాను. మథనపడుతున్నాను. •

ఆరిపోనేపోదు, రాగమాలాకేల!
తరలిపోనేపోదు, తారుణ్యహృదయమ్ము!
అరుణాధరము లేక మనలేను మనలేను
అరుణమందారమా, మరలి రానేరావ.

ఏణి—నానాథ! నానాథ!
నీకోస మీ బ్రతుకు
నిలచియున్నది నాథ
ఓనాథ! ఓనాథ!
కైకోవ నీలోన
కైవసమ్మాగ నాథ
నిను వీడి మనలేను
నిజముగా నా నాథ......

వసు—ఏణి? (జాలిగా)

ఏణి—ఎదకోసి గద్దలకు
వెదజల్లి వేయకో
నానాథ! నానాథ
నిను వీడి మనలేను......

ఒకకంఠం— ఏణీ! ఏణీ! రావచ్చునా?
(ద్వారం చప్పుడు)

ఏణి—ఎవరది? (కంఠం సర్దుకొని)

ఒకకంఠం—నేను, భిక్కుని సాంకృత్యాయని. వేగం తలుపు తెరు.

కుమారవసువు—భిక్కునీ, అలా వణుకుతున్నావు?

భిక్కుని—అయ్యో! మిళిందుడు ఖడ్గంతో పొడుచుకోపోతున్నాడు. విహారంలో గగ్గోలుగా ఉంది. (దూరాన గోల వినవస్తుంది.)

వసువు—ఏమయింది? భిక్కునీ?

భిక్కుని—శాకలనుండి డెమిట్రియస్ రహస్యంగా ఉత్తరం పంపాడు. తక్షణం మిమ్మల్ని హత మార్చి రక్తం పంపవలసిందిగా. ఆయన మిళిందునికిఆజ్ఞ!

ఏణి—అమ్మో!

భిక్కుని—ఉత్తరంలో ఉన్న ప్రకారం మిళిందుడు మిమ్మల్ని చంపలేక కత్తితో పొడుచుకోబోగా శ్రమణులు పట్టుకొన్నారు.

వసు—పదండి. అక్కడికి. భిక్కుణీ, ఏణీ!
(క్షణం నిశ్శబ్దం. విహారంలో కలకలం తగ్గుతుంది)

వసు—మిళిందా? ఎంతపని చేశావు. ఆత్మహనానికి ఒడిగట్టావు?

మిళిం—(బాధగా) డెమిట్రియస్ కఠోరంగా ఇచ్చిన శాసనం నెరవేర్చలేక ఇలా అయినాను. వసుమిత్రా, నేను యవనుణ్ణి. నీవు భారతీయుడవు! చక్రవర్తి కుమారుడవు! ఈ తక్షశిలలో ఒకచోట చదువుకొన్నాము. జాతివైరానికి మనం ఆహుతి అయిపోతున్నాం!

వసు—మిళిందా! జాతికీ జాతికీ అఖాతం అధికమై ఏర్పడింది. నేను తక్షశిల వదిలేస్తాను.

ఏణి—వద్దువద్దు.

వసు—నా గురుదేవులు, ఆదిశేషాంశ సంభూతులు పతంజలి మహర్షుల ఆదేశం ఇది. ఈ 'వార్త విని కుమారవసువు వెంటనే ఉజ్జయినికి వచ్చితీరాలి! అల్ప సంఖ్యాకుల హక్కులకై జిననూరి జినస్థానముకోసం విప్లవం తెస్తున్నాను. వెంటనే నీవు రావాలి!'

మిళిం—అయ్యో, మీ లేతహృదయాలను దగ్ధం చేస్తున్నాను.

వసు—కర్తవ్యం నెరవేర్చక తప్పదు. (బాధగా)

మిళిం—వసూ! రాజనీతికీ, 'హృదయరాగానికీ మధ్య కుమిలిపోతున్న నిన్నూ, ఏణినీ చూడలేను. నాగుండెలు తరుక్కుపోతున్నాయి!

ఏణి—నాథా మీరు వెళ్లక తప్పదా?
ఏ రీతి భరియింతు
ఈ హృదయ దాహమ్ము
నా నాథ! ఓ నాథ!
నిను వీడి మనలేను
నిజముగా నా నాథ!

వసు-
ఆరిపోనేపోదు, రాగమాలాకేల
అరుణాధరమె లేక మనలేను మనలేను
పగిలి పగిలిన గుండె, బాధానలోజ్వలము
రగిలి రగిలిన గుండె, రాగరక్తారుణము!

### ఉజ్జయినిలో

కుమారవసువు—పతంజలికి ప్రాంజలి ర్నతోస్మి.

పతంజలి—శుభంభూయాత్! కుమారవసు మిత్రుడు రాజధాని ఉజ్జయినికి రావడం మహానందం.

కుమారవసువు—గురుదేవుల ఆజ్ఞ శిరోధార్య. ధరిస్తాను.

పతంజలి—వసూ! నీ అంతరంగ మథన నేను ఎరుగుదును. నీ తప్తహృదయాన్ని చూచి నేను జాలి పడను. నీ కర్తవ్యం జ్ఞాపకం చేస్తున్నాను.

వసువు—నా వ్యథ గురుదేవులకు చెప్పుకొంటే కొంత తృప్తి, కొంత ఉపశాంతి.

పతంజలి—నీ విజాతీయ ప్రణయాన్ని సామ్రాజ్యంలో నీ తల్లీ, తండ్రీ, గురువూ, ప్రజలూ ఎవరూ హర్షించరు.

వసువు—ప్రణయానికి జాతులతో నిమిత్తమా? క్షంతవ్యుణ్ని.

పతంజలి—నీ ధీర లాలిత్యానికి ఇదిసమయమా? మన భారత సామ్రాజ్యము శత్రు హస్తగత మయ్యే విపత్సమయంలో కుమార వసువు కర్తవ్యం గుర్తించలేదు.

వసువు—మీ అనుశాసనం శిరోధార్యం ధరిస్తాను, గురుదేవా!

పతంజలి—నీ భార్య భానుమతీ దేవిని ఒకసారి చూచి వెంటనే నీవు యుద్ధానికి సిద్ధపడాలి.

వసువు—నా అంతరంగ యుద్ధానికి ఇప్పటికి కర్మయోగంలో పరిష్కారం.

పతంజలి—అవును. నీవు అర్జునుడి స్థితిలో ఉన్నావు. యాగాశ్వం వెంటనే రావాలి. నీ వెనక నేనూ ఉంటాను. శతద్రుతీరానికి వెళ్లి యవనజాతిని తరిమివేదాము. నీ తండ్రి అశ్వమేధం వేగియమానంగా సాగుతుంది.

వసు—గురుదేవా, శెలవు.

(దూరాన అశ్వహేషలు)

### ఉజ్జయినిలో దండోరా

దండోరావాడు—ఇందు మూలంగా యావన్మంది ఉజ్జయినీవాసులకూ మన మహారాజులుంగారు తెలియచేసేది ఏమనగా, రాజశాసనం ప్రకారం జైన శిల్పాలు కరిగించి యావత్తుబంగారం కోశానికి చేర్చాలి హోయ్.

(ప్రజాకోలాహలం ఎక్కువకాగా క్రమంగా తగ్గుతుంది)

ఒకడు—ఏమిటోయ్ దండోరా?

రెండోవాడు—మన ప్రభువు జాతి సాంకర్యం కిట్టక ఆగ్రహావేశంతో చండశాసనం చేస్తున్నాడు. యవనులతో జైనుడు, జినసూరి కలిసిపోయినాడు. జినస్థానం భారత సామ్రాజ్యంలో కోరుతున్నాడు.

ఒకడు—అతను ఇంకా సామ్రాజ్యచ్ఛత్రచ్ఛాయలో ఉన్నాడా?

రెండోవాడు—అల్పసంఖ్యాకుల హక్కులకై జినసూరి ప్రతిఘటించినందుకు అగ్నిమిత్ర భట్టారకులు తీవ్రశాసనం చేశారు.

మొదటివాడు—చక్రవర్తిని ప్రతిఘటించి శత్రుపక్షం చేరినాడా జినసూరి?

రెండోవాడు—జినసూరి ఏమీ చేయలేక ప్రతిష్ఠానపురం వెళ్లి సన్యసించాడు!

మొదటివాడు—చక్రవర్తి అశ్వమేధం చేస్తున్నాడు గదా. ఆయనను ఎదిరించేవా ళ్లెవ్వరు?

రెండోవాడు—ఎదిరించడ మేమిటి? యవనసేనతో మనవారు హోరాహోరిగా పోరుతున్నారట.

మొదటివాడు. పతంజలి మహర్షులు కూడా యాగాశ్వంతో ఉన్నారా?

రెండోవాడు—భగవాన్ మహర్షుల ప్రోద్బలం లేనిదే మనజాతికి వికాసమే ఉండదు.

మొదటివాడు—చక్రవర్తుల శాసనాన్ని శిరసావహించి జైనవిగ్రహాలు, శిల్పాలు కరిగించి పారవేదాం.

రెండో—మధురాపురంలో ఈ పాటికి అగ్నిమిత్ర భట్టారకులు జైనశిల్పాలు నాశనంచేసే ఉంటారు.

(కోటలో దీనంగా నగారా మోగుతుంది. జనం అల్లకల్లోలంగా తిరుగుతూ ఉంటారు. మధ్య మధ్య కేకలు—కొంతసేపు కల్లోలం శాంతిస్తుంది.)

ఒక—ఏమిటో నగారా దీనంగా మోగుతున్నదే.

మరొ—అయ్యో, ప్రమాదం లేదుకదా.

స్త్రీ—బాబూ ఇంకేముంది! కుమార వసువుల వారు (ఆయాసంతో దీనంగా) యుద్ధంలో—హారే రామ...(వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

ఒక—ఏమిటి? సర్వ నాశనమా?

స్త్రీకం—యవనులు వసుకుమారుల తలతెంచి... శూలానికి గుచ్చేసరికి మన సేనలు పారిపోయినాయట.

కొన్ని—అయ్యో అయ్యో, ఎంత మాట!

స్త్రీ—మన చక్రవర్తి కరకాశ్వమెక్కి మహా రుద్రులై శత్రుసంహారానికి స్వయంగా వెళ్లారట. కాళీ సింధునదము రక్తమయమై ప్రవహిస్తున్నదట.

ఒక—అగ్నిమిత్ర భట్టారకులు, ప్రభువులు జాతికి చేసిన బలిదానం, త్యాగం ఎంత ఘనం! స్వయంగా ప్రభువులు యాగదీక్షితులై భారత ధర్మ సామ్రాజ్యము స్థాపిస్తున్నారు. ఓహో! త్యాగంవల్ల కాని ధర్మసామ్రాజ్యం స్థిరం కాదు కాబోలు.

భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః
భద్రం పశ్యే మాక్షభి ర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాన్ సస్తనూభిః
వ్యశేమ దేవ హితం యదాయుః
స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్‌క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతి ర్దధాతు.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

(ఆల్ ఇండియా రేడియో వారి అనుమతితో, కొద్ది మార్పులతో ప్రచురణ)



# వాఙ్మయ పరమార్థము

'కుమారదేవ' —

నైయాయికులకు సయిత మందరాని నిర్వచనయుక్తమీ "వాఙ్మయ"శబ్దము! ప్రస్తుతవ్యాసమునకు సూచనార్థము వాఙ్మయ మనగా "జీవనప్రతిబింబ"మని యనుకొన్న జాలును.

బద్దెన, వేమన మొదలగువారి పద్యములలోని సుద్దులు తెనుగునుడులందు నానుడులుగా మఱుఁగుపడి మనలో నఱిగి నెత్తుట గలిసి ఆంధ్రసంస్కృతియం దొక విలక్షణముగ బొడసూపుచుండును. వాని జాతీయత పండితపామరులయందు పలురీతుల ప్రత్యేకత నాపాదింపుచుండును. పరస్పరవిరుద్ధార్థభూయిష్ఠము లైన పెక్కు సామెతలు నెమ్మదిగా నాలోచించి నప్పుడు వింతగొల్పుచుండినను వాని పుట్టుపూర్వోత్తరముల దలచినప్పు డవి యెంత యనుభవజ్ఞుల వాక్యములు పేటిన తేనెతునుకలై మన కందీయబడినవో విస్మయము గొలుపగలవు. పూర్వుల యనుభవములే పూర్వుల నానుడులు; వారి జీవనప్రతిబింబములు. ఆయా జాతిజీవనముల నట్టి జాతీయములనుండి మన మూహింప వీలగుచుండును.

మానవజాతిని వివేచనాదృష్టితో బరిశీలింప బూనుకొనువానికి మానవుని గుణదోషనిరూపణతో నారంభింపకతప్పదు. ఇట్టి పరీక్ష వాఙ్మయవాస్తువునకు మొదటి పోటకము; ప్రతిష్ఠాధారమూలగ్రావము. వాఙ్మయపరిణామకార్యమున గాయకుడు, చిత్రకారుడు, తత్త్వకుడు, పండితుడు, చరిత్రకారుడు సమానబాధ్యత వహించుచున్నారు. మానవజీవితమును లోకులకు ప్రతిబింబించునట్లు చేయు పనులందు వీరు సరిపంపకముతో హక్కు చెల్లినవారు. టెరెన్సు (Terence) అను నొక నాటకనిర్మాత "నేను మానవుడను; మానుషంబులు నాకు దూరమైన వేవి తోచ దెపుడు" అన్నాడు.

మానవజీవితమును మూర్తిభవించునట్లు చిత్రింప బూనుకొను ప్రయత్నము పంచభూతములను బంధింప జేయునంతటి సాహసకార్యము. కాని ప్రపంచమునందు సుప్రసిద్ధమహాకావ్యములు—ఏ భాషయం దైనను, ఏమతవిషయికము లైనను—మానవజీవితమును ప్రతిబింబించుటయందే, యీ సూత్రపరివేష్టితములనుటయందే, యీ విషయగర్భితమునందే విఖ్యాతి నార్జించినవి. వాల్మీకి నుండి వ్యాసాదిపురాణేతిహాసకర్తలు, కాళిదాసాది దృశ్యశ్రావ్యప్రబంధనిర్మాతలు మానవజీవితములను తమ తమ శక్తిసామర్థ్యములు వెల్లడియగునట్లు చిత్రించుట యందు ప్రసిద్ధినొంది సిద్ధహస్తులైరి. వాఙ్మయము మానవహృదయమును సమగ్రముగ బరిశోధనచేసి, మానవజీవితమునందు సంపూర్ణసానుభూతి నందిన యనుభవజ్ఞుడైన కవినుండియే మొలకలెత్తగలదు. అట్లు పుట్టిన వాఙ్మయమును జదువుచున్న విద్యార్థికి మానవజీవనపరిజ్ఞానముతో బాటు తజ్జాతితో సానుభూతి జనించి యాతని విద్యా సంస్కృతికిని పరిణామము గలుగుచుండును. మహాగ్రంథములన్నియు మానవజీవనప్రమాణములతో మానవత్వము నిండారగల్గియుండున ట్లుద్దేశింపబడి నిర్మింపబడినవి.

అట్లని మానవజీవితప్రసక్తి గలిగిన గ్రంథములన్నియు వాఙ్మయకారకములు కాజాలవు. మానవ

జీవనమును ప్రతిబింబించునట్లు వ్రాయగలిగినవాఁడెల్ల వాఙ్మయస్రష్ట యనిపించుకొనఁడు. నేటి దినపత్రిక అనేక స్త్రీపురుషులకు సంబంధించిన విషయములు వివిక్త వచనయుక్తముగ వర్ణించుచున్నది; ఆవర్ణన వాఙ్మయ మనిపించుకొనదు. ఎంకిపాటలు, వానికర్త పాడు చుండినప్పు డెంత యానందముప్పతిల్లినను వానికి మహాకావ్యగౌరవము తెచ్చికొన్నవా? వాఙ్మయపీఠమునం దేస్థాన మందగలిగెను? రుక్మిణీ సందేశమునను, హంసదూత్యమునను ప్రేమరసాను భవము, సారూప్యత ద్యోతకముగానున్నను వానికి వాఙ్మయపల్యంకికారోహణము నాపాదించుగుణము, గౌరవము గల్గినది. "ఎల్లి రాసినరాత యే పేరిగాసికో యింపు గూర్చినంత" కాళిదాసుని శకుంతల దుష్యం తునకు వ్రాసిన తామరాకులేఖతో సమగౌరవము నంద గల్గునా? ఒకటి గాదిలియుత్తరము- ఇంకొకటి వాఙ్మ యము! ఏ మాభేదము? ఏ మాపాతికము?

ఫోటోగ్రాఫరు తీసిన స్నాప్‌షాటు (Snap-shot) నకును, ఆలేఖకుని చిత్రార్పిత ప్రతికృతికిని గల తారతమ్యము నూహించినచో వైవిధ్యమునకు గారణ మగపడగలదు. ఫోటోగ్రాఫరు మనల నొక తెరకు ముందు నిలిపి "ఇటు చూడుఁడు—ఏదీకొంత— ఒక చిన్ని నవ్వు—"అనుచు తటుక్కున నొక మీట నొక్కి మన బొమ్మ పడినదని మనల బొమ్మనును. అపడిన ఛాయాచిత్రమును మనము చూచునప్పుడు అది మన ప్రతిబింబమని యొప్పుకొనుచున్నాము. కాని యా ఛాయాపటము మన సంపూర్ణతను వెల్లడించుచు న్నదా యని వితర్కించితిమేని మన యంతరాత్మ యొప్పుకొనదు. మనలను సంపూర్తిగ నెఱిగిన యాంత రంగికమిత్రులు దానిని జూచినప్పుడు మన మనోభిప్రా యముతో నేకీభవింపగలరు. ఫోటోలోని మన ప్రతిబిం బము కేవలము పోలిక-నకలు. ఫోటోగ్రాఫరుగాని, తత్కళోపాసకులుగాని మన యభిప్రాయము నొప్పి కొనరు. వాదించి మన తలంపులను బూర్వపక్ష మొనర్ప ప్రయత్నించెదరు. అప్పుడు మనము "బాహ్య ముగ నది నాప్రతిబింబము. ఆంతరంగికముగ నది కానే రదు" అని చెప్పకతప్పదు.

మన యాత్మసంతృప్తికై మన మొక సుప్రసిద్ధ చిత్రకారుని మన రూపును జిత్రార్పితమొనర్ప గోరితి మనుకొందము. అతని యాలేఖనావ్యవసాయము, తన్మార్గము మనకు గొంత కొంత విసువు పుట్టించును. అతని వర్ణనము పూర్తియగుటకు గొన్ని దినములు, మాస ములు పట్టును. ప్రతిదినము మన మాతనియింటికి బోవు చుండవలయును. అతఁడు మనలను జూచి చిత్రించుట యొక పాలయిన మాటలాడుట నూరుపాళ్లు! అతఁడు వేధించి వేధించి వేయిపార్లయిన వేయివిషయములగూర్చి మనతో మాటలాడుచుండును. మనము మాటలాడు చుండునప్పు డాతఁడు మన మానసికపరివర్తనము, తదానుషంగికమైన ఆహార్యాదులను నిశితనూత్మ దృష్టులతో నిర్వర్ణించుకొనుచుండును. మన యాత్మతో నతఁడు పరిచయముచేసికొనును. మన యభిరుచులతో నైక్యత గన్నఅది గంభీరమానససముద్రదఘ్నముగ ప్రమాణమొనర్చుకొనును. రాజకీయములందును, నైతిక ముగను, సాంఘికముగను మన మనోభావములతో వియ్యమందుచుండును. మన కళాభిరతిని బరిశీలించును. మన సుఖదుఃఖములను వివరించి యందు బాల్గొనువాని వలె గన్పట్టుచుండును. మనజీవితాశయములను ప్రమాణీకరించుకొనును. ఇట్లాతని ప్రయత్నమును గమ నించు మనకు చిత్రకారుని ప్రయాసము విశదపడగలదు; "ఈతఁడు మన సంపూర్ణవ్యక్తిత్వమును లోనుండి వర్ణన చేయుచున్నా"డని యవబోధము కాగలదు. అత్యంత దీర్ఘపరిశ్రమ ఫలించి మన మూర్తి పటమున నాలేఖ్య మయినదే, మన యాత్మీయులు దాని జూచినప్పుడు "పైకిమాత్ర మిది మీరూపు నచ్చముగా జూపకున్నను మీ యాంతరంగిక స్వరూపమును జీవకళ లుట్టిపడు నట్లు వెలువడజేయుచున్న"దని తప్పక ప్రశంసించెదరు. ఫోటోగ్రాఫరు తీసిన ఛాయాచిత్రమునకును, రంగా జీవుకు రచియించిన చిత్రపటమునకును గల తారతమ్య మును గ్రహింపగలిగినచో ఎంకి తన నాయుడుబావ కొఱకు వాపోయిన శృంగారరసమునకును, శకుంతల దుష్యంతునికొఱకై పరితపించిన విప్రలంభమునకును గల భేద మవగతము కాగలదు. యథార్థమునకును, బర మార్థమునకును గల యంతర మూహింప వీలయిన

ట్లీవిశేషము పరామర్శించుట సామర్థ్యము. చిత్రకారకుడు మూర్తీభవింపజేసిన మన ప్రతికృతిని వివేచనసేయగల సౌందర్యాంబుధులు కాళిదాసరచిత శకుంతలాప్రేమలేఖలోని గంభీరమాధుర్యమును రసపిపాసతో బహుమానింపగలరు. వాఙ్మయమున నిట్టి సౌందర్యము సంగ్రథితమయియుండుటవలన నట్టిగ్రంథము లాచంద్రార్కము లగుచుండును.

కొందరు చక్కని పరిణతి చెందిన మేధానిధుల ప్రజ్ఞాపరిణామఫలములే వాఙ్మయస్వరూపమున వెలువడుచున్నవని వాదించువా రున్నారు. మానవజీవితము వాఙ్మయతాత్పర్యమనియు వాదులాడవచ్చును. కాని మానవుని జీవితమందలి ప్రతివిన్యాసము వాఙ్మయప్రతిపాదనామూలకము కాగలదా ? మానవమానసోద్రేకజనిత పరిభావము లెల్ల వాఙ్మయవస్తువులే యగుచున్నవా ? వానిని యుక్తాయుక్తవివేచనావంతులు పరిశీలింప బనిలేదా ? వివక్షింపవలదా ?

కళ వాస్తవముగ ననేకసూచనావిషయ పరంపరలనుండి యాదర్శగంతముగ నొనర్చిన సంగ్రహస్వరూప మనవచ్చును. చిత్రలేఖనమునను, సంగీతమున నీసూత్రిసారము ననుసంధించినట్లు వాఙ్మయరచనయందు నను జోరవచేసికొనవచ్చును. మానవజీవితములోని సంఘట్టనముల నన్నిటిని నున్నదున్నట్లు ప్రతిబింబించు ప్రయత్నము కళగా పరిణమింపదు. అనవసరములనుండి ముఖ్యములైనవానిని వడియగట్టు సాధనమేసామర్థ్యము. వాఙ్మయకళానిర్మాత చిత్రకారునివలె నంతరంగజీవము నావిష్కరింపజేయునప్పుడు మిక్కిలి సున్నితములును, గంభీరములును, సుందరతరములును నగు భావపరంపరలు చిందుచుండును. వాఙ్మయము కేవల మతివాస్తవిక వస్తుసంపాదనముమాత్రము కానేరదు. పరమార్థ ప్రతిపాదనము వాఙ్మయసమీకరణమగును. అందుచేతనే మహాకవుల కావ్యములు వాఙ్మయములై నేటి దిన పత్రికలు తదితరము లనిపించుకొనుచున్నవి.

వాఙ్మయము వాగ్రూపచిత్రపటము. మానవ జీవనాంశప్రతిమూర్తీకరణము వాఙ్మయమూలకందము. కవి యావ్యవసాయమున భాషాతూలికలను,శబ్దవర్ణగుళికలను నైశేషవస్తునిరూపణయం దుపయోగించుకొనును. చిత్రకారకుడు, గాయకుడు, కవి - ఈ మూవురు మానవజీవితము నానందరసోత్పాదనమగురీతి నావిష్కరణమొనర్చుటయందు తమ శక్తిసామర్థ్యముల నుపయోగించుచుందురు. సమస్తకళారహస్యోద్దేశ మదియేకదా! కాని, యీ మూవురు నుపయోగించెడి వస్తువులు భిన్నములు. చిత్రకారుడు గీరలతోడను, రంగులతోడను మానవజీవితమును గానమొనర్చుచున్నాడు; గాయకుడు కమ్మని గానములతో దానిని చిత్రించుచున్నాడు. కవి సామాన్యమానవభాష యను కుంచెతో వివిధ చిత్రవిచిత్రపదములను వర్ణములతో వింతసమ్మేళనము గారించి విశ్వమోహనకరమైన చిత్రసంగీతమును సృష్టించి పండితపామరుల హృదయములను రంజింపజేయుచున్నాడు. ఇట్టి వాగ్రూపచిత్రకారుడు వాఙ్మయగానమును మృదుమధురమనోహరముగ విశ్వజనీన మొనర్చుచున్నాడు. ఈ సామాన్యకవి-వాఙ్మయ సంబంధము గుర్తించి యీ ధర్మమును మన మంగీకరింపవలయును.

మానవజీవితములోనివివిధమర్మములనువిశదీకరించి వాఙ్మయకళాస్రష్ట తన తీయని మాటలతోడను, లలితలాలిత్యపదజాల సమీకరణముతో, గంభీరభావముల శ్రవణపేయముగ వర్ణించు నాతని సామర్థ్యము మన కబ్బురపాటొదవించుచుండును. అతని నేర్పు నుడుల రంగుల నేతికొనుటయందును, వాని వైవిధ్యము నేకీభవింపజేయుటయందును గన్పడగలదు. అతని నిర్వహణకార్యమునందు వాఙ్మయము మానవసంబంధనిబంధన గ్రంథముగ సామాన్యముగను, సాంకేతికముగను నిర్దేశమందుచున్నది. ఆ దివ్యప్రబంధమున మానవజీవితము ప్రతిపత్రముననూ సజీవకళలతో చిందులుద్రొక్కుచుండును. ఆగ్రంథ మొక చిన్ని ప్రపంచమును గన్పఱచుచుండును. అందు మానవజీవితములు వేర్వేఱుగను, నొక్కటిగను, వారివారి యనుభవములకు దగినట్లు హృదయాందోళనలను, నానందతరంగమాలికలను జిత్రవిచిత్రముగ విలసిల్లుచుండును. అట్టి ప్రబంధనిర్మాత- అనగా వివిధమానవజీవితములను వారి యనభవములను, వారి యాంతరంగికబాహ్యపరివర్తనలను సుందరముగ వర్ణించి వినిపింపజేయు మహాకవి యేచోటనైన నీ

భావయందైన మహాకవియని యనిపించుకొనగలడు. ఆ మహనీయుడు మనకంటెను మానవజీవితమును సర్వతోముఖముగ నెఱిగినవాడని యొప్పికొనవలసిన దే. మనకంటె నాతనికి మానవజీవనములను విశదముగ వివరించి వర్ణించు సామర్థ్యము కలదు. ఆ లాఘవమే మనకంటె నాతని గౌరవార్హు నొనర్చు శక్తి. ఆశక్తి ప్రయోగించి యాతడు వాఙ్మిస్తంత్రీప్రయోగమున మన హృదయములందు ప్రవేశింపగలుగుచున్నాడు. మన మాతనివలె మానవజీవితాంశములయందలి వినోదవిషాదసంఘట్టనలను, గంభీరవిశాలపరివర్తనలను, సుఖదుఃఖసంసర్గభావములను సమగ్రముగ నెఱిగినవారము కావచ్చును. కాని, యాతని వర్ణనయం దుపయోగించు విచిత్రశబ్దవాఙ్నిచయముల నుపయోగింపగలమా? వినువారి వీనులకు విందొనర్పగలమా? అసలు చెప్పదలచినది, చెప్పవలసినది చెప్పివేయునంతటి సామర్థ్యము మనకున్నదా? ఆ వ్యక్తీకరణశక్తిశూన్యతవలన శేముషీధురంధరుల మనుకొను మన మనోగతగంభీరభావము లెన్ని వ్యర్థము లగుచున్నవి! అందుచేత నేకదా ఎంకి పడుచున్న విరహతాపము వెల్లడిసేయలేక వెక్కిరింత పాలగుచున్నది? బలవంతముగ వెడలగ్రక్కుటకు యత్నించినను వినుటకు రోవగింత బుట్టుచు బూతుదారి బట్టుచున్నది. ఆ నాయికామతల్లికయే కాళిదాసు వంటి కవిచక్రవర్తికి లభించిన నామె యుత్తమనాయికాశ్రేణికి లేవనెత్తబడుచున్నది; యా కవిప్రలంభశృంగారమతని హస్తగతమై పండితశ్రేణికి పఠనయోగ్యమై లక్ష్యస్వరూపమునందుచున్నది. ఆమహాకవికి దానేలు కొను వస్తువు నావస్తువర్ణనావిషయమున వాడునట్టి భాషాపరికరము లఱచేతి యుసిరికలు. ఆతని వర్ణనల జదివినప్పు డానాయికగుణరూపములు, బాహ్యాంతరములు వివిక్తముగ హృదయములందు హత్తుకొనును. ఆ వర్ణనావిశేషమున నాకథానాయిక సౌందర్య సౌభాగ్యములు మన మానసముల మాధుర్యమున మత్తు గొల్పి యనిర్వాచ్యమైన యానందడోలికల నుఱ్ఱూత లూగింపగలవు.

ప్రపంచసృష్టిసమయమున దొలుత వెలుతురు తోచినది. వేదాంతి, విజ్ఞాని, వ్యాపారి, ఋషి, కవి-యీ యేవురు నొక్కసారి యాజ్యోతిని జూచి తమలో దా మిట్లనుకొనిరి. వేదాంతి "ఇంత వెలుగు నేల సృష్టించెనో భగవంతుడు" అని భగవంతుని చర్యలను వితర్కింపసాగెను. విజ్ఞాని "ఈ వెలు గెట్లు కలిగెను?" అని విచారింపసాగెను. వ్యాపారి "ఈ తేజస్సును నాకిమ్మని దేవు నడిగెదను" అని తలపోసెను. ఋషి "పరమేశ్వరా, లోకోపకారకమయిన జ్ఞానోదయప్రసాదనమున భవదీయపరమదయాగుణము వెల్లడిచేయుచున్నావు. కరుణామయా, నిన్ను గను టెప్పుడు? నీమహిమ లోకమున వెల్లడిసేయు శక్తిని నాకు బ్రసాదింపుము" అని యాత్మప్రణామము గావించెను. కవి చాలకాలము దీర్ఘాలోచన చేసి "ఈప్రకాశితజగత్తు చూడచూడ నెంత మనోహరముగ నున్నది!" అని తన్మయత నంది యాసమయమున తన మనోగతభావపరంపరలను తన హృదయబింబమున బ్రతిఫలించిన వానినెల్ల వర్ణనసేయ నారంభించెను. ఆతని యానందకందళితహృదయస్రోతస్వినీప్రవాహము నిర్ఝరీవేగమున విమలభావాంబువుల నుత్సాహవంతములై యుద్రేకపూరితములైన మృదుమధురగేయములై రసవత్తరగానపరంపరలై హృద్యపద్యములై కావ్యములై విశాలావనియందు విస్తరించికొనిపోయినవి. కొన్నియేండ్లు గడచినవి. ఒకప్పు డాపద్యములను వేదాంతి వినెను. "ఈపద్యములు నాడు నేపడిన సృష్టిసందేహము తీఱుటకు దోడ్పడుచున్నవి" అని వానిని సేకరింప నారంభించెను. విజ్ఞాని యాపద్యములను వినెను. "ఆ నాడు నే పరిశీలింపదలచిన సృష్టిబీజము లేచెట్టివో గమనించుటకివి యుపయోగపడగలవు" అనుచు వానిని సమీకరణ మొనర్పసాగెను. వ్యాపారి "ఈపద్యరత్నము లెంత మనోహరములుగానున్నవి! వీని నెల్ల సంగ్రహించి జిజ్ఞాసువు లున్నచోట నొకయంగడి తెఱచి వీనిని మిక్కిలి రొక్కములకు విక్రయించెదను." అని యాపద్యముల నేఱి జొచ్చెను. ఋషి కాపద్యములు లభించినవి. అతడు "ఆహా! ఇంతకాలము నేను పరి

వేదనపడుచు నన్వేషించుచుండిన భగవత్సృష్టిరహస్యభేదనకరములైన యీ మహోఘృణిమణు లెంతసాహాయ్యమొనర్చుచున్నవి. నా జీవితము నేడు ధన్యతగాంచెను" అని యా ఖండకావ్యములను మననమొనర్పసాగెను. ఆ విమలగానము కర్ణాకర్ణిగ లోకమెల్లెడ విస్తృతినందెను. గతానుగతికమైన లోకమున నాబాలగోపాలము వానిని బాడుట కారంభించెను. తల్లి పిల్ల నుయ్యెలలో నుంచి యా పాటలు పాడెను. కోయిలలు జంటలుగూడి యా గీతికలను కూయసాగెను. సానువులలోని హరిణీ హరిణములు వానిని చెవులు నిక్కపొడుచుకొనుచు వినుచుండెను. నెమళ్లు వానికి తాళములు వేసికొనుచు నాట్యమాడెను. ఎంకి నాయుడుబావగారి కొఱకు పోవుచు నాపాటల బాడుచుండెను. కృషీవలు లాగీతికల నీలకేయుచు దమ పనులను జేయుచుండిరి. వానిని విన్నవారెల్ల వాని నర్థముచేసికొనుచు "నిందు క్రొత్తవేవియు లేవు. మన మెఱిగిన విషయములేయున్నవి. కాని, ఎంత చక్కగ పాటకు గుదిరినది! ఎంత మనోహరముగ మాటలు కుదిరినవి!" అని యనుకొనుచుండిరి.






[కథానిక]

## శ్రీమతి ఆచంట శారదాదేవి

"జమీందారుగారి భార్య నిన్ను చూడాలన్నది. మధ్యాహ్నం వెళదామా ఒకసారి" అన్నాడు సంజీవరావు, ఇంటికి రాగానే. "నన్నా ! ఎందుకూ !" అన్నది విమల-వంచిన తల ఎత్తకుండా, పిల్లవాడికి పాలు కలుపుతూ....

సంజీవరావు, తిరిగి తిరిగి, ఎక్కడా ఉద్యోగం దొరకదని నిస్పృహ చేసుకొన్నవారంరోజులకు, జమీందారుగారబ్బాయి కొక ట్యూటరు కావాలని తెలియ వచ్చింది. ఆశతో జమీందారుదర్శనం చేసుకున్నాడు. కోరిక ఫలించింది. చిన్నదొర కూడాకూడా తిరగటం, అతనికి బుద్ధిపుట్టినప్పుడు రెండుముక్కలు చెప్పటం కంటె వేరేపని యేమీ లేదు. జీతానికి లోపంలేదు. ప్రాణం కుదుటబడ్డది. రాణీ అప్పుడప్పుడు సంజీవరావుకు కబురుచేసి పిల్లవాడి యోగక్షేమాలు కనుక్కునేది. అల్లాగే సంజీవరావు కష్టసుఖాలుకూడా విచారించేది. క్రమేణా సంజీవరావుకు ఆమెయందు చాలా గౌరవం ఏర్పడ్డది. విమల రాణీగారిని చూడటానికి ఉత్సాహపడటం బదులు అడ్డప్రశ్నలు వెయ్యటం చూసి సంజీవరావుకు చిరాకువేసింది.

"ఎందుకేమిటే, నీ మొహం ! ఆవిడ అంతగా నిన్ను చూడాలని అంటూవుంటే నువు—"అన్నాడు విసుగుతో.

"అదికాదండీ, నాకు మంచిచీర వక్కటి అయినా లేదుగదా, ఎల్లాగ అనీ."

విమలకు ఎక్కడికైనా వెళ్లాలన్నప్పుడల్లా తనకు మంచిచీరెలు లేవని జ్ఞాపకంవస్తూ వుంటుంది. అందుకనే సంజీవరావు ఆమెను ఎక్కడికీ తీసుకుపోనేపోడు.

"నీ పెళ్లినాటి పట్టుచీరె వున్నదిగదా, అది చాల్లెద్దూ" అన్నాడు సమదాయిస్తూ.

"అదేమి చీరండీ! అంతా వెలిసిపోయింది ! కొంచెం చినిగిందికూడాను" అన్నది, మారాము పెడుతూ.

"ఫరవా లేదులే. ఏచీర కట్టుకున్నా ఆవిడకంటే అందంగానే వుంటావు." అన్నాడు సంజీవరావు, కొంటెగా నవ్వుతూ.

విమలముఖము కలువపువ్వులాగ వికసించింది. ఆమెకళ్లల్లో సంతోషం ఉక్కిరిబిక్కిరయింది. కాని మరుక్షణమే విచారరేఖలు ముందుకు తోసుకు వచ్చాయి. "ఏమోలెండి, ఎల్లా వుంటేనేం, ఆవిడ అదృష్టం నా కెల్లా వస్తుంది" అంది.......

"సరేలే, మూడుగంటలకు నువ్వూ పిల్లలూ సిద్ధంగా వుండండి. నేను వచ్చి తీసుకుపోతాను" అన్నాడు, అతను, మళ్లీ కండువా పైన వేసుకుంటూ.

విమల పన్నెండింటికే మొదలు పెట్టింది ప్రయాణ సన్నాహం. అయినా, పిల్లలకు తలదువ్వి నీళ్ళుపోసి తనూ సింగారించుకునేప్పటికి మూడు కొట్టింది. విమలకు విసుగూ, విచారం ముంచుకువచ్చాయి..."ఏమి జీవితం! పొద్దున లేచిందిమొదలు రాత్రి పదిగంటల దాకా క్షణం తీరిక లేదు. ఎక్కడికి వెళ్ళాలన్నా విశ్వ ప్రయత్నం కావాలి. జీవితంలో విశ్రాంతి, శాంతి రెండూ లేవు. అన్నీ తీరని కోరికలే...ఇప్పుడు జమీం దారుగారింటికి వెళ్ళకపోతేనేం? తను ఆమెకంటె అందంగా వుంటుందట,—అయితేమాత్రం ఆమెకూ తనకూ సామ్యం ఏమిటి? ఆమె లక్ష్మీప్రసన్నురాలు. తన వెలిసిన చీర, తనూ—బండిఆగిన చప్పుడు విని తలుపుతీసింది.

"రెడీగా ఉన్నారా? పోదామా?"

"ఊఁ! చూడండి: ఆవిడకు చాలా గర్వమా?"

"ఛీ!, చాలా మంచి మనిషి."

తల వాల్చుకొని బండి ఎక్కింది విమల. పిల్లలిద్దరూ బండిమూసి మురిసిపొయ్యారు....

* * * *

జమీందారిణిగారి పేరు గుణవతీ దేవి. ఆమే, జమీందారుగారూ ఒకరినొకరు చూసుకొని కొన్ని సంవత్సరాలవుతుంది...గుణవతి ఇప్పుడు కేవలం విలువైన వస్తువులు కొనడంతోనే హృదయాన్ని తృప్తిపరచుకో వాలని చూస్తున్నది. చీరెలూ, నగలూ సంతోషాన్ని ఇవ్వడం మానేసి చాలా రోజులైనా కూడా అలవాటు చొప్పున ఇంకా కొంటూనే ఉంటుంది. పైగా ఆమెకు అదే వ్యాపకం కూడాను. ఇవ్వాళకూడా విమల వచ్చే సరికి ఆవిడ చీరల బేరంలోనే వున్నది.

"డబుల్ కలర్ చీరెలు ఇప్పుడు చాలామందికడు తున్నారమ్మా. ఈ చీర చిత్తగించండి" అంటున్నాడు సెట్టి......విమల చీర చినుగు కనపడకుండా కుచ్చెళ్లు సర్దుకుంటూ రాణీని సమీపించింది.

"రండి, కూర్చోండి" అన్నది సోఫా చూపిస్తూ, గుణవతి. విమల బెదురుతూకూర్చున్నది, చీరలనుచూస్తూ. ఎంత మంచి చీరెలు! ఎంత చక్కని జరీపని! ఆ చీరలన్నీ చూస్తూవుంటే, తన వంటిన వెలిసిపోయిన చీర ముళ్లు గ్రుచ్చుకుంటున్నట్లున్నది.

గుణవతికి మాత్రం ఒక్కచీరా నచ్చలేదు. అసలు ఆమెకు కావలసినది చీరెలయితే గదా! "ఏమీ బాగా లేవు, రేపు ఇంకేమయినా రకాలు పట్టుకురా." అన్నది సెట్టితో.

"చిత్తం" అంటూ మూట కట్టుకొని వెళ్ళి పోయాడు సెట్టి......దాసీది టీ తెచ్చిపెట్టింది....

"'టీ' పుచ్చుకొంటారా" అన్నది గుణవతి. విమల గుణవతికేసి తలెత్తిచూసింది. అందం లేక పోయినా, ఆమెముఖంలో ఎంత ఠీవి వున్నది! ఏదో చెప్పలేని ఆకర్షణ!...కళ్లల్లో మాత్రం విచారం కన బడుతుంది.

"వద్దండీ, నాకు అలవాటు లేదు" అన్నది వినపడీ వినపడకుండా.

గుణవతి, మాట్లాడకుండా, రెండు కప్పులలో టీ పోసి పిల్లలిద్దరికీ ఇచ్చింది. చిన్నవాడు వేడి పట్టుకోలేక టీ అంతా కాశ్మీర తివాసీమీద కొంతా, తన చొక్కామీద కొంతా వలకబోసుకున్నాడు. ఖరీదయిన తివాసీ మరకైందన్న భయంతో పిల్లవాడి మీద కోపం వచ్చింది విమలకు. "ఏమి సంతానం?" అని మనస్సులో విసుక్కున్నది. గుణవతిమాత్రం, నవ్వుతూ, పిల్లవాడిని దగ్గరకు తీసుకొని పట్టుగుడ్డతో తుడిచి మళ్లీ టీ త్రాగించింది......విమలకు కొంచెం ఊపిరి సలిపింది.

"ఎప్పుడూ ఇంతే! ఎక్కడికెళ్లినా ఏదో వకటి. బయట అడుగు పెట్టడానికే భయం" అన్నది విమల.

"ఫరవాలేదండీ! ఈ మాత్రానికే!!" అంటూ నవ్వింది గుణవతి.

"అది కాదండీ, నాకు వీళ్ళతో విసుగొస్తున్నది. ఒక్క నిమిషమైనా విరామం లేదు, ఎప్పుడూ నా కొంగు పట్టుకొని వదలరు" అన్నది విమల,—సంసారం గొడవల్లోకి దిగుతూ, మామూలు ధోరణిలో.

"మంచిదేగదా, మీకు బాగా కాలక్షేపం అవుతుంది."

## భారత పరిశ్రమల ఆయువుపట్టు ఇంకను బ్రిటిషువారి చేతులలోనున్నది.

### మనమందర మైకమత్యముతో కలిసి కృషిచేసినప్పుడే అవి మనకు వశము కాగలవు.

తక్కువ పెట్టుబడితో, జాతీయ పరిశ్రమలు నెలకొల్పుటకు బ్రహ్మాండమైన ప్రణాళిక.

**★ మా సోడావాటర్ మెషినులను స్థాపించుడు.**

**★ పరిమళద్రవ్యములను, టాయిలెట్ వస్తువులను ఉత్పత్తి చేయుడు.**

మేము చిన్నవి, పెద్దవి అన్ని రకముల సోడావాటర్ యంత్రములు, సుగంధ తైలములకు, టాయిలెట్ వస్తువులకు ఉపకరించే పరికరములు మిక్కిలి చౌకధరలకు సప్లయిచేయుదుము.

ఉచితముగా మీకు ప్రవీణుల సలహాకూడ నొసంగబడును.

**THE ESSENCE & BOTTLE SUPPLY AGENCY,**

**14, Radha Bazar Street,**

**CALCUTTA.**

"సరిలేండి, వీళ్లతో ఒక్కపనీ తెమలదు."

గుణవతి అకారణంగా నవ్వింది. "అదీ! మీకు పని. అందునించి విసుక్కుంటున్నారు. నాకు రోజంతా ఏమీ తోచదండీ!?...ఇంక మా బాబు, నే రమ్మని కబురుచేస్తేనేగాని నా దగ్గరకు రాడు. వచ్చినా, పదినిమిషాలుకూడా వుండడు. వాడికి నాదగ్గర కంటె 'ఆయా' దగ్గరే ఎక్కువ చనువు! నేను లేక పోయినా ఏమీ బాధపడడు కాని 'ఆయా'ను విడిచి ఒక్క నిమిషంకూడా వుండలేడు!" అని గట్టిగా నవ్వింది.

ఆ నవ్వులో విషాదం ప్రతిధ్వనించింది.

విమల విస్తుపోయి చూసింది: "దాసీలూ! దాదులూ! పనిలేక ప్రొద్దుపోదట! ఎంత అదృష్టవంతు రాలు!!" అనుకున్నది.

"పంతులుగారు కూడా వచ్చారా" అన్నది గుణ వతి—ప్రసంగం మారుస్తూ.

"ఆ! బయట వున్నారు......నేను వెళ్తాను, చాలాసేపైంది" అంటూ లేచింది విమల.

దాసీ పళ్లూ, తమలపాకులూ తెచ్చి పెట్టింది.

"తరుచు వస్తూవుండండి" అన్నది గుణవతి.

"అల్లాగే. కాని, నాకు ఇల్లు కదలడానికే వీలుం డదండీ. పనిఅంతా పూర్తిచేసుకొనేసరికి ఆయన ఇంటికి వస్తారు. ఏవో కబుర్లతోటి గడిచిపోతుంది. నేను లేకపోతే ఆయనకేమీ తోచదు" అన్నది విమల సిగ్గుపడుతూ. గుణవతికి కళ్ళు చెమ్మగిల్లినవి.

పిల్లలు పళ్ళకోసరం ఎగబడ్డారు. ప్రతిదానికీ వాచిపోవటమే! విమలహృదయం అవమానంతో, దుఃఖంతో క్రుంగిపోయింది. కళ్లల్లో నీరు నిండింది.

గేటు దాటుతూ భర్తతో "ఎంత నిదానమైన మనిషి! ఏ కొరతా లేదుగదా! ఏమి అదృష్టం!!" అన్నది కళ్లు తుడుచుకుంటూ.

"ఎంత అందంగా వున్నది! చిలకా గోరువంకల లాగా వున్నారు. ఏమి అదృష్టం" అనుకున్నది గుణ వతి,—కిటికీలోంచి చూస్తూ...కన్నీటిధార ఆపుకో లేకపోయింది.






[కథానిక]

= శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి =

రామశాస్త్రికి మగదక్షత లేకపోవడంవల్ల ఆ చిన్న భవంతినీ—పదెకరాల కొండ్రనూ విధవ కూతురైన సీతమ్మచేతులో పెట్టి ప్రపంచయాత్రను పరిసమాప్తిచేసుకున్నాడు.

ఆ అగ్రహారంలో సీతమ్మకు వేలువిడిచిన మేనత్త కొడుకు అవధాని తప్పితే దగ్గర బంధువులు మరెవ్వరూ లేరు.

అందుచేతనే ఇరవై యేళ్లక్రితం త్రొక్కిన రామశాస్త్రిగుమ్మం ఈ నాడు అవధాని ఎక్కి ఆపత్కాలంలో ఉన్న సీతమ్మకు సహాయసంపత్తిగా నిలిచి, ఆమె పితృకర్మలన్నీ యథావిధిగా సాగించాడు.

అవధాని తనింటికి రావడం తండ్రికెంత కష్టం కలిగించేదో గ్రహించికూడా సీతమ్మ అతని మెహర్భాణీకి ఏమీ అడ్డురాలేదు. అడ్డగల కారణం తనకు తెలిసున్నా—"గతం నాస్తి" అనే సామ్యం గుర్తుకు రావడంవల్ల కారణానికి కార్పణ్యాన్ని తగిలించలేదు.

కర్మలు ముగిసిన మరునాటినుంచే బంధువులు ఎవరిళ్లకు వాళ్లు తిరుగుమొగం పట్టినా అవధానిగారి కుటుంబంమాత్రం ఆ గృహాన్ని వీడగల నిర్ణయానికి యింకా రాలేదు.

పదిహేనురోజులు గడచిన అనంతరం, దీపారాధనచేసి స్తబ్ధగా ఆ ప్రక్క నిలబడి, ఏవో ఆలోచిస్తున్న సీతమ్మ ఉండే గదిదగ్గరగా నిలిచి—

"సీతా!" అని ప్రేమపూర్వకంగా పిలిచాడు అవధాని.

ఆమె తలెత్తి అవధానికేసి చూసింది.

"నేను మీకు చేసిన అపకారం ఏమిటో నాకు తెలీదు. కాని మామ ఉన్నంతవరకూ నన్ను చూస్తే కళ్లల్లో కారాన్ని జొనుపుకునేవాడు." అంతటితో ఆగి ఏవో ఆలోచించి దీర్ఘంగా శ్రమించినవాడిలా నిట్టూర్చి "సరే! ఆయన నామీద కత్తికట్టిన ప్రతిఫలంగా—ఆయన అవసానకాలంలో నేనే ఆధారం కావలసివచ్చింది" అని ఆమెసమాధానంకోసం చూస్తున్నాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు. దృష్టిని క్రిందకు దించి ఏవో ఆలోచిస్తోంది.

"జరిగినదాన్ని తలుచుకోటం దేనికీ? ఉదయాన్ని మేము వెళ్లదలుచుకున్నాం" ముందు ప్రశ్నార్థవాక్యాన్ని వినేసరికి తలెత్తిచూసింది. వెంటనే శిరాన్ని కిందకు వంచింది.

ఈ సారికూడా ఆమెనుండి సమాధానం రాలేదు.

మరికొద్దిగా కంఠాన్ని పెద్దజేసి "నువ్వుకూడా మాతో రావాలి" అని అడిగాడు.

ఆమె ఆశ్చర్యంగా తలపైకెత్తి "ఎక్కడికీ?" అని అడిగింది. "మా యింటికే—! నలుగురితోబాటు నారాయణా! ఇక్కడెవరున్నారూ నీకు, పిల్లా పిచుకా? ఒంటిగా ఎలా ఉండగలవ్?" ఈ మాటలు

ఎంతో సానుభూతిసూచకంగా ధ్వనింపచేద్దామనుకున్నాడు. కాని ఏదో స్వార్థపరమైన శబ్దం ఆ మాటల మధ్యనుంచి వెలువడుతోంది.

“[illegible] బాబూ! నాన్న కట్టించిన ఈయింట్లో నే బ్రతికుండగా దీపం పెట్టే దిక్కు లేకుండా చేయలేను.” అని అక్కడనుంచి ఆమె వెళ్ళిపోయింది.

మరునాడు ప్రయాణసన్నాహంతోబాటు మరోసారి ఆమెను మందలింపుగా అడిగాడు.

ఆమె ఈషణ్మాత్రమూ యిష్టాన్ని సూచించలేదు. ఆఖర్ని వెళుతూ వెళుతూ—

“ఏలాంటి అపవాదు వచ్చినా నేనేం బాధ్యుణ్ని కాను. గట్టిగా ఆలోచించుకో” అని అధికారయుతంగా అడిగాడు. ఆమె వెంటనే వాడిన నవ్వు నవ్వి, హీన స్వరంతో ఇలా అంది: “నాపై అపవాదు వేయగల వయస్సు నానుండి ఏనాడో పోయింది --- జరిగిన దాన్ని పురస్కరించుకొని వేయగల అపవాదుయొక్క ఆయువుపట్టు నీహస్తంలోనే వుంది ---”

అతను వెంటనే తల వంచి ప్రయాణం సాగించాడు. ఆమె తలుపురెక్కలు రెండూ వేసుకుంది.

ఆమె ఆఖరు నన్న మాటల్లో అంతరార్థం అవధానికి పూర్తిగా తెలుసు. అందుకే తిరిగి సమాధానం యివ్వగల అవకాశాన్నికూడా వెదుక్కోలేదు.

అవధానికీ, ఆమెకే గాకుండా—ఆ అగ్రహారంలో ఇరవైయేళ్లక్రితం ఒక అలజడి—జడివానలా వచ్చి వెలిసి చక్కాపోయింది.

ఆ వర్షబిందువులు ఎవరిపైనా పడి అంతగా బాధించకపోయినా, రామశాస్త్రిహృదయంపైమాత్రం ఆ చినుకులు అగ్నికణాల్లా నిలిచి అహోరాత్రాలూ బాధపెట్టసాగాయి.

ప్రతిరోజూ మార్పుకలిగే ప్రకృతిలో ఆ జడివాన ఒక సహజఋతుధర్మంలా వచ్చి మానిపోయింది.

రామశాస్త్రిమానసికగగనంపై ఆనాడు నిల్చిన కారుమేఘం చలనంలేకుండా అలానే నిలిచిపోయింది.

అందుచేతనే రామశాస్త్రి ఉండగా అవధాని వాళ్ల గుమ్మం ఎక్కగల అర్హతను కోల్పోయాడు.

[illegible] తెలియని వేదమాత్రం మా స్వను రామశాస్త్రి [illegible] గడిపెను.

ఆనాడు అవధాని ఆశించింది ఆమె ఆదరణకోసం కాదు. ఆమెచేతిలో పెట్టిన ఆస్తికోసం. కాని తన మాటలకు ఏమాత్రం విలువా సీత ఇవ్వకపోగా— విస్మృతమైన ఒక ఘట్టాన్ని తీసుకొని చెంపపెట్టు పెట్టింది.

బాహ్యానికి అంతగా వాపు లేకపోయినా— అంతర్గతంగా అవధానికిమాత్రం తీరని బాధే పెట్టింది. అతనుకూడా ఆ అగ్రహారంలో ఎన్నదగ్గ పెద్ద [illegible] ఒక [illegible] ఆక్రమించివుండడంవల్ల సీతమ్మ ఇంటిదగ్గరనుంచి రిక్తహస్తాలతో రావడం చాలా నవ్వుబాటుగానే తోచింది. ఏమన్నా చేయదగ్గ అవకాశం అతని చేతుల్లో అప్పుడేమీ లేదు. కాని ఈనాడు ఆ అవకాశానికి తగ్గ పుకార్లు అగ్రహారంలో లేచాయి.

సీతమ్మగారింటికి రహస్యంగా ఎవరో వచ్చి వెళుతూన్నట్లుగా అక్కడి ప్రజలు చెప్పుకోవడం కొత్త. ఇంగితజ్ఞానమున్న పెద్దమనుష్యులు అది తప్పుడు అభిప్రాయంగా నిర్ధారణచేశారు.

కాని రానురాను—ఆ వ్యతిరేకించినవాళ్లే ప్రత్యక్షంగా చూచినమీదట నిజమని తల ఊపారు.

అవధానిమటుకు ఎన్నిసార్లు ప్రయత్నంచేసినా— ఏ ఒక్కరోజూనా అలాంటి సంఘటన కళ్లపడలేదు. అందుకు ప్రత్యేకించి తన శిష్యకోటిలో వెంకటాద్రి అనే విద్యార్థిని ఆపనిగురించి వినియోగించాడు.

వేదపఠన చేస్తున్న శిష్యబృందమంతా రణగొణ ధ్వని చేస్తున్నారు. దీపం కునికిపాట్లు లేకుండా దివ్యంగానే వెలుగుతూంది.

వెలుపలనుంచి వెంకటాద్రి ఆత్రంగా వచ్చి “గురువుగారూ” అని పిలిచాడు.

తమలపాకులు మెలిపెడుతూన్న అవధాని "ఏం" అని ప్రశ్నించాడు.

రహస్యాన్ని సూచించే భంగిమలో "మీ కోసారి యిలా రావాలి" అన్నాడు.

అవధాని లేచి, వెంకట్రాద్రి ననుసరించాడు. సరాసరి రెండుఫర్లాంగులున్న సీతమ్మ యింటికి చేరుకున్నారు. రామశాస్త్రిగారికి దొడ్డివైపునుంచి నెమ్మదిగా నడిచిపోతూన్న ఒక పురుషస్వరూపాన్ని వేలెత్తి చూపించాడు వెంకట్రాద్రి.

అవధానిశరీరం ఆద్యంతమూ భగ్గున మండిందనడంలో—అతని ముఖభంగిమే అందుకు సాక్ష్యం.

"ఎవరది?"— బిగ్గరగా పిలిచాడు అవధాని.

ఆ వెళుతూన్న పురుష ఆకారం వెనక్కి చూచినట్లుగా వెంకట్రాద్రి గుర్తించాడు.

"ఆగు"—మళ్లీ మరుక్షణాన్నే ఆజ్ఞాపించాడు అవధాని.

ఆ పురుషస్వరూపం ఆగింది.

ఆంతర్యంగా అతనిదగ్గరకు వెళ్లడంలో అదురువున్నా పైకి మాత్రం చాలా ధైర్యంగానే అతని దగ్గరకు చేరాడు అవధాని.

అతనివెనకాల వెంకట్రాద్రి నిలబడ్డాడు.

మసకచీకట్లో అతనిముఖం వ్యక్తం కాలేదు. "ఎవరు నువ్వు?" ఉద్రిక్తంలో కాస్త బిగ్గరగానే అడిగాడు.

"ఎంకడి కొడుకుని సుబ్బుల్ని"

ఈ సమాధానం విన్నమీదట అవధాని చెప్పినంత త్వరగా తేరుకొని మళ్లీ ప్రశ్న వేయలేకపోయాడు.

"దన్నమండి, ఎలతాను" అని నెమ్మదిగా కదలబోయాడు సుబ్బులు.

" ఆగు "

సుబ్బులుచేతిలో గిన్నె కనిపిస్తోంది.

ఆ చేతిలో ఉండే వస్తువును పరిశీలిస్తున్నాడు. పైన ఆకుమూత వేసివుంది.

ఎక్కణ్నించి వొస్తున్నావ్" అని మళ్లీ

" సీతమ్మగోరింట్లోంచి."

" ఏంపనిమీద వెళ్లావ్ ?"

" ఊరగాయ పెడతా నన్నారు "

చేతిలో తగిన ఆధారం ఉంది. కాని తిరిగి మరో ప్రశ్న వేయకుండా "ఫో" అని గదమాయించాడు.

సుబ్బులు వెళ్లిపోయాడు.

వెంకట్రాద్రిని ఇంటికి పంపించి దొడ్డినుంచి తిరిగి సీతమ్మ అరుగుమీదుగా వచ్చి "సీతా!" అని పిలిచాడు అవధాని.

వీధితలుపు తెరిచింది. లోపలున్న దీపపుకాంతి అవధానిముఖంపై పడింది.

అవధాని ఏమీ మాట్లాడకపోవడం చూచి నెమ్మదిగా తల ఎదరకువంచి "ఏం బావా! వచ్చావ్" అని అడిగింది సీతమ్మ. గాలికి దీపం అటూ ఇటూ కదులుతోంది. అవధానిముఖం రక్తమిళితమైనట్లుగా గోచరిస్తోంది. "ఇందుకా ఆనాడు నాయింటికి రానన్నది"—ఈ మాటలు అవధానిపళ్ల సందునుంచి ప్రస్ఫుటంగా దూసుకువచ్చాయి.

ఆమె విస్తుపోయి "ఎందుకూ?" అని అడిగింది.

"నీకు అంతకన్నా అగ్రజాతివాడు దొరకలా?"

ఆమె చలించింది. తీక్షణంగా అవధానిముఖం కేసి చూసింది. అతని భావం పరిపూర్తిగా వ్యక్తమైనట్లు తలవూపింది. వెంటనే ప్రశాంతపడి "నువ్వానేది నాకేమీ అర్థంకావడంలేదు" అని ఆమె నవ్వింది.

ఆ నవ్వులో వుండే ప్రత్యేకతను ఏనాడో అనుభవించినట్లుగా—మళ్లీ ఈ నాడు తనహృదయంలో ఆ విస్మృతమందహాస చంద్రికలయొక్క అద్వితీయ ఆనందాన్ని అనుభవిస్తున్నట్లుగా రెండు రెప్పలూ మూశాడు. కాని తను వచ్చిన పని వేరు అని గుర్తించిన మీదట బలవంతంగా తన మానసికపరిస్థితిని మొదటి బాటలో పెట్టి "ఆ ఏనాదివెంకడికొడుకుకదూ—

నీయింటికి ప్రతిరోజూ వస్తున్నది" ఏలాగైనా మొదటి అంత కఠినత లేదు ఆమాటల్లో.

వెంటనే "అవును" అని సమాధానం యిచ్చింది.

విమర్శయుతంగా చూస్తూ "వాడి కంత చను విచ్చడానికి కారణం ?" అన్నాడు.

ఆమె ఇప్పుడు క్రిందికి చూస్తోంది. ఏమీ సమాధానం యివ్వలేదు.

"నలుగురూ ఏమని చెప్పుకుంటున్నారో తెలుసా ?"

అవధానిముఖంకేసి చూసింది. హృదయంగతమైన మూగబాధతో గట్టిగా నిట్టూర్చింది.

"చెప్పుకోతగ్గ చెడుపనిని నేనేం చేయటంలేదు. పాపంలేనిదానికి పాపమున్నదని అనుకొన్నంతమాత్రాన నాకేం నష్టంలేదు." అసలు ధైర్యంగా సమాధానం చెప్పింది. ఆమెకంఠం గద్గదమైంది. మాటల్లో దుఃఖ భారం తొణికిసలాడుతున్నట్లుగా వ్యక్తమౌతోంది. ఆమెముఖం చీకటికెదురుగావుండడంవల్ల కళ్లల్లో అశ్రుబిందువులు అవధాని గ్రహించలేదు.

"నువ్వు నా కివ్వవలసిన సమాధానం యింతే నన్నమాట"

"మించి ఏమీ కనుపించడంలేదు, అంతే యిచ్చాను."

"సరే!" వెంటనే వెనక్కి తిరిగాడు. గుమ్మం దిగినవెంటనే తలుపులు వేద్దామని రెండురెక్కలూ పట్టుకుని నిలుచుంది. అతడు అలా చేయలేదు. మళ్లీ సీతమ్మను చూస్తూ—"నీగురించి చెబుతున్నా—వాణ్ని రేపటినుంచీ నీదొడ్డిగుమ్మంకూడా తొక్కనీకు...అలా చేశావా ! నువ్వు చాలా అవమానంపాలుకావలసి వస్తుంది" అన్నాడు. వెళ్లిపోడానికి మళ్లీ వెనక్కి తిరిగాడు. "అతణ్ని నాయింటికి రాకుండా చేయగల శక్తి నాలో లేదు. అతనికి ఏనాటినుంచో ఇలా రావడం పోవడం అలవాటైంది. ఆలోచన వున్నవాళ్లు ఎవరైనా మా పరిచయం మాస్తే తల్లీబిడ్డల ధర్మాన్ని ర్తించగలరని నా నమ్మకం"

సీతమ్మ పైశంగా సమాధానం చెప్పేసరికి వెంటనే ఎదురుగా తిరిగి "మళ్లీ త్రేతాయుగాన్ని నాదృష్టిలో సృష్టిస్తున్నావ్." ఆమె సమాధానం యిస్తుందేమోనని కాసేపాగి "ఇది కలియుగ మనిమాత్రం మరిచిపోవద్దు. వాణ్ని రాకుండాచేయగల శక్తి నీలో లేకపోతే, ఆబాధ్యత నేనే తీసుకుంటాను" అని చరచరా రెండుమెట్లు దిగేసరికి వెనకనించి సీతమ్మ విప్పారిన కళ్లతో చూస్తూ "ఆబాధ్యత నువ్వు తీసుకోతగిన అధికారాన్ని నేనేమీ నీకివ్వలేదు. నా వ్యవహారాల్లో నువ్వు కలగజేసుకోవలసిందని ప్రాధేయపడిన నాడు అలాంటి పని నువ్వు చెయ్యడం చాలా మంచిది."

అవధాని వెనక్కి తిరిగి ఏదో చెప్పడానికి నోరు తెరిచేలోగానే ఆ తలుపురెక్కలు రెండూ ధడాలున శబ్దిస్తూ మూసుకపోయినై. రెండవసారికూడా అవధాని తానుసంధించిన శరం ప్రత్యర్థికి తగలడం తప్పి పోడమేగాక, తిరిగి ఆ శరమే తన అపజయానికి కారణమవడంవల్ల తీవ్రప్రతీకారసమరానికిసిద్ధత చూపించగల పరిస్థితిని సృష్టించుకున్నాడు. చలికాలంలో శరీరాన్ని కొంతవరకూ నీళ్లలో నింపడంవల్ల పుట్టే కంపం—పూర్తిగా శరీరాన్ని ముంపడంవల్ల ఏ విధంగా చలిపోయి, ఉష్ణాన్ని కలిగించడంలోకూడా ఏలా సహకరిస్తుందో—అదేపద్ధతికి సీతమ్మహృదయం మద్దత్తయిపోయింది. క్రితం సుబ్బులురాకపోకలు దొడ్డిగుమ్మాన్ని, సంధ్యాసమయాల్లో జరిగేవి. ఒక పావుగంట మించకుండా అతనితో ఆప్యాయంగా మాట్లాడి, తిరిగి ఏదో తినుబండారాన్ని పెట్టి పంపించివేస్తూఉండేది.

కాని ఈనాడు సుబ్బులు సీతమ్మయింటికి రావడానికి ఒక నిర్ణీతమైనకాలం లేదు, ఎంతకాలం అక్కడుండాలో నిర్ణయంకూడా లేదు. శనివార, ఆదివారాలు పూర్తిగా అక్కడే గడిపేవాడు.అవసరాన్ని బట్టి స్నానం, భోజనం కూడా సీతమ్మయింట్లోనే చేస్తూ తెల్లటిదుస్తులు వేసుకుని, నిర్భయంగా తిరిగేవాడు.

"ప్రజలందరికీ తెలిసింది" అనే అవధానిమాట తెలిసినతర్వాత రహస్యం అనవసరమనే నిర్ణయమే సీతమ్మమనోధైర్యానికి కారణమైంది.

ఏనాదిసుబ్బులకు ఇరవై ఏళ్లుంటాయి. చిన్నతనాన్నుంచీ అతని కులంవాళ్లతో అట్టే సంబంధం లేదు. వాళ్ల పనిపాటలకు, కులంకట్టుబాటులకుకూడా అతడేమీ అలవాటుపడలేదు. వాటి కతీతుడకూడా అమ్యాకుడు.

స్ఫురద్రూపి కావడంవల్లనూ, శుచిగా ఉండడంవల్లనూ అతణ్ణి దగ్గరకు రప్పించడంలో అగ్రజాతులనుకునేవాళ్లు కూడా అట్టే అసహ్యించుకునేవారు కాదు.

అవధానిగారి పరిశోధనమూలంగా తేలిన విషయమిది. ఆ సుబ్బులు అగ్రహారానికి నాల్గు మైళ్లలో ఉన్న భీమవరం హైస్కూలులో అయిదవ ఫారం చదువుతున్నట్లున్నూ, అందుకు అయి అవ్వబోయే ఖర్చులు సీతమ్మగారే భరిస్తున్నట్లున్నూ కూడా తెలిసింది.

చూస్తూ ఊరుకోవడంవల్ల ఇక క్షమించుతుందనీ, క్షమించడంవల్ల వచ్చే ఆ భయంకరధ్వనిలో సీతమ్మసర్వస్వం ఐక్యమై, పరుల హస్తగతం కావడంలో ఆశ్చర్యం ఉండదనీ నిర్ణయించుకున్న మీదట, అగ్రహారంలో ఉండే తన తోడి నలుగురుపండితులనూ రప్పించి, ఒక వ్యూహాన్ని పన్నడానికి ఉపక్రమించాడు.

ఆమె చేసే పని శాస్త్రరీత్యా అతినైచ్యమైంది కాబట్టి వెంటనే ఆమెను కులబహిష్కారం చేయాలని మొదట నిర్ణయాన్ని తెచ్చారు.

నిర్ణయంవల్ల వచ్చే ప్రతిఫలం శూన్యం కాగా—అవధానికి భవిష్యత్తులో దక్కబోయే ఆస్తికి తిలోదకాలు వదిలే అపాయపరిస్థితి ఏర్పడ్డది.

తిరిగి పునర్విచారణ చేశారు. జరిగిన దేదో జరిగిపోయింది. ప్రస్తుతము తగిన ప్రాయశ్చిత్తంచేసి, ఇకనుంచి ఆసుబ్బులుతో మాట్లాడ్డంగాని, వాణ్ణి అగ్రహారంలో అడుగుపెట్టించడం గాని జరగనివ్వకూడదని రెండోశాసనాన్ని సిద్ధపరిచారు. అప్పటి ఆమె వినకపోతే—అనే మీమాంస రేగడంవల్ల దౌర్జన్యయుతమైన మూడోపద్ధతిని ఈవిధంగా సూచించారు. పండితాభిప్రాయాన్నీ—సత్యమైన శాస్త్రశాసనాన్నీ ధిక్కరించిన ఆమెను అగ్రహారానికి సంబంధించిన ఆస్తితో ఎట్టిసంబంధం లేకుండా తక్షణం అగ్రహారంఅవతలకు నెట్టివేయడం.

అవధానిమనస్సు అంతులేని ఆనందసాగరంలో, విరామం లేకుండా అనేకసార్లు మునకలు వేసింది.

మరునాడు సీతమ్మ వాకిట్లో ముగ్గులుపెడుతూన్న సమయాన్ని వెంకటాద్రి వచ్చి కాస్తదూరంగా నిలబడ్డాడు.

అడుగులచప్పుడు విన్న ఆమె తల పైకెత్తి చూసింది. ఆమెప్రశాంతమైన దృక్కులు వెంకటాద్రిలలాటంపై సోకడంవల్ల మారుమాట లేక మంత్రముగ్ధుడుగా నిలబడిపోయాడు.

"ఎవరిగురించీ యిక్కడ నిలిచింది" అని శాంతంగానే అడిగింది సీతమ్మ.

పాఠం బట్టీపట్టిన విద్యార్థిలా—కదలక మెదలక నిలబడి ఈవిధంగా ఆమెకు వప్పచెప్పాడు:

"పదిగంటలకు సంస్కృతపాఠశాలలో పండితులంతా సమావేశమవుతున్నారు......మిమ్మల్ని ఆసమయానికి అక్కడకు రావలసిందిగా చెప్పమన్నారు."

"ఆ సమావేశం ఎవరిగురించీ..." ఆశ్చర్యంగానే అడిగింది.

"మీగురించే" అన్నాడు వెంకటాద్రి.

సీతమ్మ ఆలోచించినమీదట నవ్వి "నాగురించి జరిగే ఆసమావేశం నాయింటిదగ్గర చేస్తేనే బావుంటుందని చెప్పు" అంది. "అలా కాదండీ..." ఇంకా ఏదో చెప్పబోతున్నాడు వెంకటాద్రి. వెంటనే సీతమ్మ "నువ్వేం నాకు సమాధానం చెప్పకు. అవసరమని తోస్తే నా సమాధానంమాత్రం అక్కడ చెప్పు." ముగ్గుపళ్లెం తీసుకొని ఆమె లోపలికి వెళ్లిపోయింది.

వెంకటాద్రి తిరిగి వెళ్లిపోయాడు.

తమ్మయింటిచావిడిలో సమావేశానికి ఏర్పాటు చేసిన చాపలన్నీ తిరిగి పీఠీ అరుగుపైన వేసుకున్నారు.

అగ్రహారంలో ఉండే ఆబాలగోపాలం సీతమ్మగారి యింటిముందు గుమిగూడి కిటకిటలాడుతూ నిలుచున్నారు.

సకలశాస్త్రపారంగతుడు—పంచభాషా ప్రవీణుడు—తర్క వితర్క ధురీణుడూ అయిన విద్వాన్ కామేశ్వరశర్మ అందరిమధ్యా కాస్త ఎత్తుగా ఉండే ఆసనంపైన కూర్చున్నాడు.

"సీతా"—ఆపిలుపు గంభీరంగా ధ్వనించింది.

అంతవరకూ గుసగుసలాడే ప్రజాసమూహం ప్రశాంతపడింది. సీత తలుపుచాటునే వుంది. పిలిచిన వెంటనే సమాధానం ఈయలేదు.

కామేశ్వరశర్మ తీక్షణంగా చూస్తూ "నేనూ నిన్ను పిలుస్తున్నది" అన్నాడు. ఆ పిలుపు భయంకరంగా ధ్వనించింది. ప్రక్కగా నిలుచున్న ఒక యిల్లాలి చంకలోని బిడ్డ కెవ్వున అరిచింది. "నన్ను అక్కడకు రమ్మన్నారా ?" అని నెమ్మదిగా తలుపుచాటునుంచే అడిగింది సీతమ్మ.

"ఇంతమందిలోకి నిన్ను రావాలని నేను ఆజ్ఞాపించలేదు......ఆజ్ఞాపిస్తే రాగల ధైర్యం నీలో వుందని నాకు తెలుసు. నువ్వక్కడుండే నేనడిగిన వాటికి సమాధానంచెప్పు" అన్న కామేశ్వరశర్మ మాటలకు సీతమ్మ మౌనం వహించింది.

"ఏనాదివెంకని కొడుకు సుబ్బులనేవాడు ప్రతిదినం నీయింటికి రావడానికి కారణం ?"

"కారణం ఏంతయినా వుంది...మీకు కావలిసింది అతడెందుకు వస్తున్నాడనేకదూ ?"

"అవును"

"రోజూ నన్ను చూడడానికే వస్తున్నాడు"

"నిన్ను చూడవలిసినంత అవసరం ఏనాదివెంకడి కొడుక్కి ఏంపట్టింది ? వాడికీ నీకూ అంతర్గతంగా ఏమన్నా సంబంధం వుందా ?" ఈ ధైర్యమైన ప్రశ్నకు అక్కడున్నవాళ్లంతా ఆనందసూచకంగా తలలూపారు.

"ఉంది. ఆ సంబంధబాంధవ్యాలకు అపార్థం తీసుకుంటే......" ఇంకా ఏదో చెప్పబోయింది. చెప్పబోవడం కాదు. ఉద్రిక్తంగా హృదయంలోంచి వచ్చే శాపాన్ని తిరిగి దిగమ్రింగింది.

"తీసుకుంటే" దీర్ఘంగా రాగం తీస్తూ అడిగేసరికి, ఆసురువుగారి సునిశితహాస్యానికి అంతా నవ్వారు.

సీత తలుపు తోసుక వెలుపలకు వచ్చింది. ఆమె ముఖం అరుణకిరణప్రపూర్ణుడైన ప్రచండభానునిలా తేజరిల్లుతూవుంది. "మీరసలు ఇక్కడి కెందుకొచ్చారు?" బిగ్గరగానే అడిగింది.

శర్మగారు లేచి "నిన్ను బహిష్కరించడానికి—" అంతకు మించిన బిగ్గరత కంఠంలో మేళవించాడు.

సీతముఖం క్షణంలో మారింది. ప్రశాంతపు చూడ్కులను అవధానికేసి ప్రసారించింది.

శర్మగారు "నీ నడతపట్ల మాకు చాలా హేయభావం కలిగింది... ..ముప్పదై దేళ్లు పైమించిన నువ్వు ఒక నీచజాతియువకునితో నీ యిచ్ఛాస్వేచ్ఛగా ఉంటూంటే, మా బ్రాహ్మణత్వాన్ని రక్షించుకోవలసిన బాధ్యత మాకు పట్టింది. రేపు ఉదయాన్నే నీవు నీ సర్వస్వాన్నీ విడిచి, అగ్రహారానికి స్వస్తిచెప్పి అవలకి పోవడం చాలా అవసరం. లేదా మేమే ఆపని చేయించడానికి సిద్ధంగా వున్నాం"

సీత ఫక్కున నవ్వింది. విషాదఘట్టంలో ఆమె నవ్వు కర్థమేమిటో అక్కడివాళ్లు గ్రహించలేదు.

"శర్మగారూ ! న్యాయం విచారించి శిక్షించవలసిన బాధ్యత అందరూ మీ కేలాయిచ్చారో, నేనూ అలానే యిస్తున్నాను." అంతటితో ఆగింది. ఏవో సిగ్గుపొంతర్లు ఆమెఅభిమానాన్ని చలింపజేయడంవల్ల తలుపుచాటుకు వెళ్ళింది. "రోజూ వచ్చే ఆ సుబ్బులు నా కన్నబిడ్డకు." ఈ మాటలు స్ఫుటంతప్పి గద్గదికమయ్యాయి.

అందరికన్నా ముందు శర్మ ఆశ్చర్యంతో నోరావలించాడు. నెమ్మదిగా ఉన్నతన స్థానాన్నుండి ఆమె తలుపుదరిగా వెళ్లి "సీతా ! నీ కేం భయంలేదు—ఆ రహస్యమేదో నాదగ్గర వ్యక్తంచేయి" సరళంగానే భాషించాడు.

సీత గొంతు సరిచేసుకొని "నాకు పెళ్లి కావడం, భర్త పోవడం సరిగా గుర్తులేదు. కాని ప్రాయంవచ్చేసరికి ప్రకృతి యిచ్చిన నా శరీరశోభను-రోజూ మాయింటికి వచ్చే ఓయువకుడు లాలనజేసి ప్రపంచజ్ఞానం లేని నన్ను పరవశపరిచాడు. అందుకు ప్రతిఫలంగా నా పది హేనోయేటను గర్భోత్పత్తి అయింది...మానాన్నకు తెలీకుండా ఆత్మహత్యకోసం అన్వేషణచేశాను. కడకు నిండారా ఉన్న కాలువలో పడ్డాను. కాని ప్రక్క చేలల్లో కాపురం పెట్టిన ఏనాదిగుంపు నన్ను రక్షించి ప్రసవించే పర్యంతం కాపాడి బిడ్డని వాళ్లు తీసుకున్నారు. మా నాన్న హృదయపూర్వకంగా క్షమించడంవల్ల తిరిగి నేను సంఘంలో తలెత్తాను."అంతా ఆశ్చర్యంతో ఆగాథను శ్రద్ధగా వింటున్నారు. మళ్లీ సీత"కన్నబిడ్డపై నుండే ఆ మమకారమే సుబ్బులును రోజూ చూడాలనే కాంక్షను పుట్టించింది. సుబ్బులు ఏనాదిబిడ్డకు కాదు." ఇలా చెప్పేసరికి శర్మ తేరుకొని—

"నీ శీలాన్ని కళంకితపరిచిన అతడు స్వజాతీయుడేనా ?"

"ఔను. అతన్ని మీ నలుగురి నోళ్లలో వేసి అవమానపరచవలసిన రోజు ఏనాటికైనా రాకుండా పోదని నాకు తెలుసు. అందుచేతనే ఆ అవసరం రాకముందే నేను కాశీకి పోదామని నిర్ణయించుకొన్నాను ......మీ బహిష్కారం ఆ విధంగా నాకు వినియోగిస్తున్నందుకు చాలా సంతోషిస్తున్నాను" అని సీతమ్మ నిర్భయంగా చెప్పినమీదట, అవధాని వెంటనే లేచి "ప్రయాణం ఎప్పుడూ?"అని అడిగాడు. ఆ కంఠధ్వనిలో కంపం అందరూ గుర్తించారు.

"నా ఆస్తి, ఈ యిల్లూ సుబ్రహ్మణ్యం పేరిట నిన్ననే రిజిష్ట్రీచేయించినాను. ఇక ఈ ఆస్తితో ఎవరికీ సంబంధం లేదు. నేను నిర్ణయించుకున్నది రేపే ప్రయాణం. కాని, ఈ ప్రాంతంలో ఒక్కక్షణంకూడా ఉండగల శక్తి నాలో తప్పుతుంది" అని తొందరగా యింట్లోకి వెళ్ళి క్షణంలో తిరిగి సుబ్బులుతో ప్రవేశించి, తలుపు తాళంవేసింది. సుబ్బులు తల్లిదగ్గర చిన్ని ట్రంకూ, గుడ్డలమూటా తీసుకుని నిలుచున్నాడు. శర్మ సీత కెదురుగా వెళ్లి "నిన్నీగతికి తీసుకువచ్చిన వాడి పేరు చెప్పకుండా వెళ్లడంలో నువ్వు చాలా గంభీరురాలవు అనుకోము—పంకిలాన్ని మనస్సులో పెట్టుకున్న పాపిష్టురాల వనుకుంటాము" అన్నాడు. ఆమె స్తబ్ధుగా నిలబడింది. అందరికేసీ అయోమయంగా చూచింది. తన నిస్సహాయస్థితిని ఓసారి పరికించుకుంది. రోదనస్వరంలో ఇలా అంది. కళ్లల్లో ... తెరలు కప్పిస్తున్నాయి. "సుబ్బులుతండ్రి అవధాని"— ఆధ్వనికి అందరి గుండెలూ ఝల్లుమన్నాయి. ధారగా కారుతోన్న కంటినీటిని పమిట చెంగుతో కప్పుకొని, ఎదరకు సాగిపోయింది. రైలుస్టేషనుకు దిగవిడిచిరవడానికి సామానులు మోసుకొని సుబ్బులు వెనకాల బయల్దేరాడు.



# పంచాయితీలు - గ్రామపరిపాలన



= శ్రీ అజ్జరపు వెంకటరమణరావు =

(గతసంచిక తరువాయి)

బొంబాయి రాష్ట్రంలోనూ, కొన్ని దక్కను సంస్థానాలలోనూ యీనాడమలులో వున్న పంచాయితీవిధానాన్ని గురించి నేను స్వయంగా చూచిన స్థితిగతులను గురించి కొంత సోదాహరణగా సూచిస్తాను. తరువాత మన రాష్ట్రంలోని పంచాయితీలను గురించికూడా కొంతఆలోచన కవకాశం కలిగించుకోవడం నయం అన్న విమయ ప్రస్తావనను సూచిస్తాను.

రెండువేల జనాభాగల ప్రతి పల్లెలోనూ పంచాయితీ వుండాలని బొంబాయిలో పంచాయితీ చట్టం శాసించింది. జనసంఖ్య ననుసరించి ఏడుగురినుంచి పదకొండుగురు దాకా సభ్యులను గ్రామీణులంతా కలిసి తమ సమ్మతిని చేతులెత్తిగాని, లేక గుప్త పద్ధతిని చీటీల ద్వారాగాని వాళ్ల అభ్యర్థులను ఎన్నుకుంటారు. వేయిమంది జనాభాకి ఏడుగురు, పదిహేనువందల మనుష్యులకి తొమ్మండుగురు, రెండువేల మందికి పదకొండు మంది సభ్యులను యీసంస్థకు ఎన్నుకోవాలి. ఈపదకొండులోనే పంచాయితీ అధ్యక్షుడినీ, ఉపాధ్యక్షుణ్ణీ యీపదకొండుగురూ కలిసి ఎన్నుకుంటారు. వీళ్లను మహారాష్ట్రంలో 'సర్పంచి' 'ఉపసర్పంచి' అని అంటారు. ఈ సభ్యులు కాక, గ్రామోద్యోగులు యిద్దరూ, అనగా పటేలులు, యీ సంస్థలలో నాన్ అఫిషియల్ సభ్యులు. ఎన్నుకొనే స్థానాలలో స్త్రీలకు, హరిజనులకు, ముసల్మానులకు, కొండజాతులకు రిజర్వుసీట్లు వుంచుతారు. ఈ అభ్యర్థులను ఎన్నుకున్నా, లేక నామినేటు చేసినా అభ్యంతరాలులేవు. ఈ సంస్థలోని సభ్యులు మూడు సంవత్సరాలపాటు అధికారంలో వుంటారు.

ఈపంచాయితీలకు పైఅధికారులు జిల్లాబోర్డులు. జిల్లాబోర్డు పంచాయితీ ఆడిటర్లు ప్రతీ సంవత్సరం వున్న పంచాయితీ లన్నీ ఒకటొకటే తనిఖీ చేస్తుంటారు. వాటి లెఖ్ఖలను సరిమాచి జిల్లాబోర్డుకు రాస్తారు. ప్రతీ పంచాయితీ తన బడ్జెటును జిల్లాబోర్డుకు పంపితే, జిల్లాబోర్డు సరిచూచి, అభ్యంతరాలు వుంటే అవి చెప్పి, తన అనుమతి నిచ్చినతరువాత పంచాయితీ తన బడ్జెటును అమలు జరుపుకొంటుంది. జిల్లాబోర్డు ఛీఫ్ ఆఫీసరు కూడా యీ పంచాయితీలలో కొంత శ్రద్ధ వహించి వాటి కనువయిన సావకాశాలను యిప్పించడానికి సాయంచేస్తాడు. అంతేగాని అతనిది జిల్లాకలెక్టరుకంటె పైచెయ్యికాదు. అందుకనే యీ పంచాయితీలలో పనిచేయవలసిన శెక్రటరీలను నియోగించేటప్పుడు కేవలం కలెక్టరో, లేక యితర రెవిన్యూ అధికారులో యీ అధికారాన్ని వుపయోగించుకొని, తమ యిష్టం వచ్చినట్లు యీ ఉద్యోగాలకు నిశ్ప్రయోజనపు మనుష్యులనే నియమిస్తారుగాని, యీ జిల్లాబోర్డులను సంప్రతించరు. దీనికి కారణం ఏమిటంటే, యీ శెక్రటరీలకు వీరు నియమించే జీతం నెలకు ఐదు రూపాయలో, పదిరూపాయలో ఎంతయినా గవర్నమెంటు గ్రాంటు క్రింద జిల్లాబోర్డుకు యిస్తారుగనుక, యీ విమయంలో జిల్లాబోర్డుకు ఏ విధమయిన జోక్యం అవసరం లేదని వీరి అభిప్రాయం. చట్టంలో లోపం యిది. దీని ప్రకారం మళ్లా యీ పంచాయితీ శెక్రటరీలు జిల్లాబోర్డుల అధికారులకిందనే పనిచేయాలి. కాని వారు సవ్యంగా పనిచేయక పోయినా, విధేయతగా వుండక పోయినా వారిని శిక్షించే అధికారం పంచాయితీలకుగాని, జిల్లాబోర్డులకుగాని లేదు. కలెక్టరొకడే యీ విమయంలో తీర్పుచెప్పగల అధికారి. అందుచేత యీ పంచాయితీ శెక్రటరీలు చాలామంది నిశ్ప్రయోజనంగా, వ్యర్థంగా కాలం వెళ్లబుచ్చుతారు. అదీగాక, వారి

కిచ్చే జీతం అంత తక్కువ అయినప్పుడు వారు సరిగా పనిచేయాలనుకోవడం కూడా సాహసమే.

ఇక యీ పంచాయితీలు చేయవలసిన కార్యక్రమం ఏమిటి? ప్రతినిత్యం అయినా, లేక కొన్నిసార్లు అయినా రోడ్లు ఊడిపించటం, కసువుతీయించడం, నూతులూ చెరువులూ బాగుచేయించడం, మురికినీటి కాలువలు తీయించడం, పాయిఖానాలు కట్టించి శుభ్రంచేయించడం, అంటుజాడ్యాలు వచ్చినప్పుడు ప్రజారోగ్యానికి కావలసిన సంరక్షణలు చేయించడం, రాత్రులు వీధులలో దీపాలు వెలిగింపించడం, రేషను సరకులను (కొన్నిచోట్ల మాత్రమే) ప్రజలకు పంచిపెట్టడం, మనుష్య పశువైద్యశాలలకూ పాఠశాలలకూ సాధ్యమయినంత ధన మనుష్యసహాయం చేయడం, న్యాయాన్యాయ విచారణలు జరిపి, చిన్నచిన్న ఫిర్యాదులను పరిష్కారంచేయడం లాంటి వెన్నో పంచాయితీల బాధ్యతలు. ఈ బాధ్యతలను సక్రమంగా, సరిగా నిర్వర్తించాలంటే విద్యావంతు లయినవారుగాని, ప్రజాభిమతం గుర్తించే విశాలహృదయులుగాని యీ సంస్థలలో చేరితే వాటి పరిపాలన ఉన్నతస్థితిలో వుండేది. కాని సాధారణంగా వయోవిద్యాధికులయిన వారి కీసంస్థలలో దెబ్బలాటలలోనికి రావాలని వుండదు. కేవలం పార్టీకక్ష్యలతో బలం సంపాదించుకొని, ఏం చేయాలో తెలియని మనుష్యులే సాధారణంగా యీ సంస్థలలోకి రావడం జరుగుతోంది. వీ రందరికంటే అజ్ఞానుడయిన సెక్రటరీ వీరికి సాయపడడం అసలే అసంభవం. ఈ యిబ్బందులకు సాయం, యీ పంచాయితీలకు వున్న ఆర్థికాధారాలు చాలా తక్కువ.

ప్రతీ పంచాయితీకీ జిల్లాబోర్డు ఆ గ్రామంలోని భూమిశిస్తులో ఎనిమిదవభాగం పంపుతుంది. ఇదిగాక పంచాయితీ ఆవరణలో వున్న యిండ్లమీద, బళ్లఘాటీల మీద, బస్సుస్టాండులమీద, బజారులమీద, సంతల మీద, యాత్రాస్థలాలమీద, ఉత్సవాలమీద, యాత్రికులమీద, పెళ్లిళ్లమీద, విందులమీద, దత్తవిధానాల మీద పన్నులు వసూలుచేసే బాధ్యత పంచాయితీలకి వుంది. కాని, సాధారణంగా యీ అవకాశాలలో అన్నీగాని, కొన్నైనాగాని వున్న పంచాయితీలు చాలా తక్కువ. ఒక్కొక్కజిల్లాకు నూరు, లేక నూటపాతిక పంచాయితీలకంటే ఎక్కువలేవు. ఇందులో సాధారణంగా పదివేలయినా ఉత్పత్తి వున్న పంచాయితీలు అయిదారుకు మించిలేవు. పూనాజిల్లాలో ఏడెనిమిది పంచాయితీలకు యీరకరకాల ఆర్థిక ఆధారాలు వున్నాయి. పూనాకు మూడుమైళ్ల దూరంలో వున్న "హడప్సర్" పంచాయితీ యుద్ధకాలంలో రేషనింగుసామాన్లు అమ్మి ౧౫౦౦౦ రూపాయల లాభం సంపాదించింది. అహమ్మదునగరం జిల్లాలో కోపర్గావ్ దాదాపు ౧౬౦౦౦ రూపాయల ఆదాయం వున్నదే పెద్దపంచాయితీ. షోలాపూరుజిల్లాలో అక్లోజు పంచాయితీ యిరవైవేల రూపాయలదాకా వున్న గొప్ప పంచాయితే ఒకటే. సతారాజిల్లాలో లోనంద్ చాలా పెద్దపంచాయితీ. బెల్గాం, ధార్వార్ జిల్లాల్లో పంచాయితీ లంత ప్రాధాన్యంలోకి రాగలిగినవి లేనట్లే అనిపిస్తుంది.

మొత్తం ఏజిల్లాలోనూకూడా సమగ్రంగా కార్యనిర్వహణం యీవత్తూ చక్కగా నెరవేర్చుకొంటున్న పంచాయితీలు లేకపోలేదు. పూనాజిల్లాలో బేలా, మంచర్, హడప్సర్ లాంటి పెద్ద పంచాయితీలలో రోడ్లు, దీపాలు, మంచినీటివసతులు, పఠనాలయాలు, జిల్లాబోర్డు ఆసుపత్రులు, పాయిఖానాలు, చెత్తవేసే డబ్బాలు, మురికికాలువలు అన్నీ పంచాయితీలు ఉత్సాహంగా నియమించాయి, పారగావ్, బోరగావ్, మోరగావ్ అనే పంచాయితీలు చిన్నచిన్న ఫిర్యాదులను సరిచూచి సంతృప్తికరంగా పరిష్కరిస్తున్నాయి. ప్రస్తుత విద్యావిధానంలో నమ్మకంలేని పెద్దలు గ్రామాలలో వ్యావసాయిక శాలలు నిర్మించి, వాటికి ఎక్స్పెరిమెంటల్ ఫారములను పంచాయితీ అధికారాలక్రింద ఆర్వి, నింబాల్కర్ వాడి వంటి గ్రామాలలో ఏర్పాటు చేస్తున్నారు. ఖాడీ పంచాయితీ హైస్కూలులోని బీదవిద్యార్థుల జీతాలకే సాలీనా వందరూపాయిలు యిస్తోంది. ఇలాగే, అంతగా ఆదాయం లేకపోయినా, ఉత్సాహంతో సాధ్యమయినన్ని సదుపాయాలను ప్రజలకు కలగజేయాలన్న పంచాయితీలు అతిచిన్నవికూడా కొన్నివున్నాయి

పంచాయితీలలో స్త్రీలు సభ్యత్వం వహించి కోరిగావ్ లాంటి గ్రామాలలో ఎంతో చాకచక్యంతో కార్య భారం వహిస్తున్నారు. సతారాజిల్లాలో ఆర్వీపంచాయితీ, అహమ్మదు నగరంలో కాసిగావ్ దగ్గరనే వున్న యింకో యీనాంబారీ పంచాయితీ పెళ్ళి, దత్తవిధానం, విందులు మొదలయినవాటిమీదకూడా పన్నులను వసూలు చేస్తున్నాయి. ఇతరాధారాలు తక్కువకనుక, సతారాలోనే లోనంద్ పంచాయితీ తన స్వంతధనం వెచ్చించి ప్రజలకు విద్యుద్దీపాలు వేయించింది. ఎన్నో పంచాయితీలు రేడియోలు కొనుక్కున్నాయి అప్పు కొన్ని నెలలలో తీర్చుకొనే పద్ధతిమీద; చాలా పంచాయితీలు వర్తమాన పత్రికలయినా కొంటున్నాయి. సమర్థత వున్న పెద్ద పంచాయితీలు, వుత్సాహం, పలుకుబడి వున్న దాహివాడి లాంటి పంచాయితీలు ఉచితంగా రేషనింగు ప్రజలకు పంచిపెడుతూ, వచ్చిన లాభాలను గ్రామ సౌభాగ్యానికి దాచాలని ఏడెనిమిది వేల నిలవను తయారుచేసి పెట్టాయి. ఈ విధంగానే ఏ జిల్లాలోనే పర్యటనం చేసిచూచినా, ఉత్సాహ శ్రద్ధలతో, ఆదర్శప్రాయంగా పనిచేస్తున్న, పని చేయాలని సంకల్పించుకొన్న పంచాయితీలు, లెక్కకు తక్కువే అయినా, లేకపోలేదనీ, అవి యింకా చాలా ఉచ్చదశలోకి కూడా రాగలవనీ అనిపించింది.

అయితే పంచాయితీలు బొంబాయి రాష్ట్రంలో బాగా వృద్ధికాక, అంత వెనుకబడి ఎందుకున్నాయి అని ప్రశ్నించడం సహజం. దీనికి కారణాలు అనేకం. ప్రజలలో ఉత్సాహం వున్నంత మాత్రంలో జరిగేపనులు కావివి. పన్నులు ప్రతీగ్రామంలోనూ వేలకొలదిగా బకాయీలుపడివుంటాయి. యాత్రాస్థలాలు-పన్నువిధిస్తే ఆదాయం వచ్చేవి ఎన్నోవున్నా కొన్ని పిచ్చినమ్మకాలమూలాన్ని ఆ అవకాశాన్ని వినియోగించుకోవు. పునాలో శాంత తుకారాం మఠం వున్న డెహూ, అహమ్మద్ నగర్‌లో గోదావరీ కృష్ణలు కలిసే సంగమం పూతంబ తప్పితే సాయిబాబామఠస్థానం అయినా షెర్డీలోగాని, యింకా యిలాంటి అవకాశాలు వున్న అనేక స్థలాల్లో యీ పన్ను వసూలుచేయడంలేదు. ఇలాగే ఇతర పన్నుల విషయంలోకూడా జరుగుతుంది. సతారా జిల్లాలో పాలుస్ అనే పంచాయితీలో పశువుల సంతమీదవచ్చే పన్నుల ఆదాయం సాలీనా పదిపన్నెండువేల రూపాయలు గ్రామమునసబు స్వయంగా వసూలు చేయించుకొని తనే తీసుకుంటున్నాడు. అసలీహక్కు పంచాయితీది. ఈ ఆదాయం పంచాయితీకి రావలసింది. కాని యింతవరకూ అధికారవర్గాలు ఏ విధమైన అభ్యంతరమూ పెట్టలేదు. నేను కనుక్కున్నదాకా యీ విషయమే వారి కవగతంకానట్లు తేలింది. ఇంక పన్నులు వసూలుచేయాలని తీర్మానాలుచేసిన పంచాయితీలలో, ప్రజలు పన్నులివ్వకపోతే, శెక్రటరీ అసహాయంగా వూరుకోవడం తప్ప చేయగలిగిం దేది లేకపోతోంది.

ఈపంచాయితీలు సౌలభ్యంతో పనిచేయాలంటే విద్యావంతులయిన సభ్యులు, శెక్రటరీలు కావాలి. వీరు కేవలం జిల్లాబోర్డుఅధీనంలో, కాకపోతే చాలావరకువారి అధికారానికి లొంగివుండాలి; వారికీనాడు యిచ్చే జీతాలకంటె హెచ్చుజీతాలు యివ్వాలి. వారు చేయబోయే కార్యక్రమానికి కావలసిన తరిఫీదు కొంత అవసరమని గుర్తించాలి. దగ్గరదగ్గరగావున్న చిన్న గ్రామ పంచాయితీలకు ఒక్కొక్క శెక్రటరీనయినా నియమిస్తే చాలు. అక్కడ ఆఫీసుకాయితాలు జాగ్రత్తచేయడం, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, పన్నులు వసూలు చేయడం-యీ విధమయిన పనులే అతను నెరవేర్చేవి కనుక, చిన్న పంచాయితీలకు, పెద్ద పంచాయితీలకు వ్యత్యాసాలు ఏర్పరచి, ఆదాయాన్నిబట్టి వీరి జీతాలలో తేడాలు సరిజేయాలి. అప్పుడీనాడములలోవున్న అసందర్భపు పరిస్థితులెన్నో సరిఅవుతాయి.

ఇవి సరిజేసినంత మాత్రంలో, రాష్ట్రంలోవున్న పంచాయితీలన్నీ అభివృద్ధిలోకివచ్చి, బొంబాయి ఆదర్శప్రాయం అవుతుందా అనిఅడగవచ్చు. మదరాసు రాష్ట్రంతో సరిపోలిస్తే బొంబాయి లోని గ్రామాలు చాలా బీదవి. తినడానికి తిండిగాని, తాగడానికి నీరైనా లేని గ్రామాలు అనేకం. నూతులనో, బావులనో నిర్మించుకొనే తాహతు వారి కెంతమాత్రం లేదు సరిగదా, నూతికి పదిపదిహేను వేల రూపాయలు ఖర్చు చేయగలిగే స్తోమతు జిల్లా బోర్డులకే లేదు. ఇటువంటి సౌక

ర్యాలు రాష్ట్రప్రభుత్వమే చేయాలి. వైద్య సాయం లోనూ ప్రసక్తియింతే. ఇంక సామాన్యమయిన సౌకర్యాలను ఏర్పాటుచేసికోడానికి యీ సంస్థలు కొంతవరకూ ఉపకరిస్తాయి. రోడ్లు వేయించుకోడానికి, దీపాలు పెట్టించుకోడానికి, యిలాంటి చిన్నచిన్నపనులకు యివి సాయంచేస్తాయి. పోనీ, అన్ని పంచాయితీలూ యిలా ప్రజా సౌఖ్యం కోసం పాటుబడడానికి సిద్ధంగా వున్నాయా అంటే, విధిలేక పనిచేస్తూ ఏ మాత్రం సావకాశంవున్నా, పంచాయితీని ఎత్తించివేయాలన్న గ్రామాలు ప్రతిజిల్లాలోనూ అక్కడావున్నాయి. కాని పల్లెటూళ్ళల్లో పార్టీలు, తగవులాటలు యిక్కడే కాదు, ప్రతీదేశంలోనూ వున్నాయి. యిందుకోసం పంచాయితీనే తిరిగి స్థాపించి బలవత్తరంగా చేయడానికి వచ్చే అభ్యంతరాలు ఏవీ వుండవు.

బొంబాయి రాష్ట్రంలోని గ్రామ పరిపాలనా విధానం అక్కడి స్వదేశ సంస్థానాలనుంచి నేర్చుకోగలిగిన విషయాలేవీ లేవా? సతారా జిల్లాలోని ఔంధ్ సంస్థానం ఆదర్శప్రాయమైన రామరాజ్యం అనీ, అక్కడ పంచాయితీలే ప్రభుత్వ సారథ్యాన్ని వహిస్తున్నాయనీ గాంధీగారూ, యితర ప్రముఖ వ్యక్తులూ ఎంతోమంది ప్రతినిత్యం ప్రశంసిస్తోంటే, బొంబాయి యీ విధానం ఎందుకు అనుకరించకూడదు? కొల్హాపూరు దక్కను స్వదేశ సంస్థానాలకు నాయకత్వం వహిస్తున్న పెద్ద సంస్థానం కదా, అక్కడ 'గ్రామ పునర్నిర్మాణోద్యమం' లో నుంచి కూడా బొంబాయి ప్రభుత్వం కొన్ని ముఖ్యపాఠాలు నేర్చుకోనేవి లేవా అని యితర రాష్ట్ర ప్రజలు ఆశ్చర్యంతో ప్రశ్నించడం సహజం. కాని, రెండు సంస్థానాలలోనూ అంతర్భాగాలలో పర్యటనం చేసి కొన్ని గ్రామాలనుచూచినతరువాత రెండు సంస్థానాలూకూడా బొంబాయి ప్రభుత్వానికిగాని, యితర భాగాలకుగాని నేర్పదగ్గ అంశాలేవీ లేకపోవడమే కాకుండా అధమం బొంబాయిప్రభుత్వంనుంచి అయినా నేర్చుకోవలసిన విషయాలెన్నో వున్నాయి. దీనికి కారణాలన్నీ చెప్పాలంటే వివరాలన్నీ చెప్పాలి. దానికిది సమయం కాదు. ఈ అగత్యాన్ని మటుకు యీ రెండు సంస్థానాలకూ నచ్చజెప్పిన తరువాత వారామోదించక తప్పిందికాదు. సుహృద్భావంతో వారి గ్రామ పరిపాలనావిధానాలను యిప్పుడయినా తిరిగి పునః ప్రతిష్ఠచేసికోవలిసిన అగత్యం వారంగీకరించి అందుకు ఉత్సాహాన్ని, శ్రద్ధను వారు కనపరచడం ఎంతో సంతోషకరమయిన విషయం. స్వదేశ సంస్థానాలలో ప్రజాపరిపాలన ప్రజాస్వామికం పేరిట జరుగుతున్నట్లు యావద్భారత దేశంఅంతా ఒకవైపు చాటుతూ వారి ఆదాయాలపై ప్రజకేపాటి హక్కులూ లేని స్థితిలో ఔంధ్ సంస్థానం జరుపుతోన్న కార్యకలాపం ఏ ఆర్థిక రాజకీయ వేత్తకయినా చాలా అన్యాయంగా కనిపించకపోదు. ఇది ప్రభుత్వం గుర్తించనట్లు కనిపించింది. నేను ఔంధ్ రాజాగారితోటే, వారిమంత్రులతోనూ యీవిషయం గురించి ప్రస్తావించినప్పుడు జరిగిన దానికి కారణాలేవో చెప్పి వెంటనే యావద్రాజకీయ విధానాన్నీ తిరిగి కొత్త మార్పులతో పునరుద్ధరించడానికి వారు ఒప్పుకోవడమే నా కృషికి ఫలితం.

కొల్హాపూరు సంస్థానంలో పంచాయితీలు ౧౯౨౬ సంవత్సరంనుంచీ అమలులోవున్నాయి. నరిసింహవాడి, హుప్రి వంటి ప్రసిద్ధిపొందిన గ్రామపంచాయితీలు ఎన్నో వున్నాయి. కాని యివన్నీ అక్కడి ప్రజలలో వుండే పెద్దల అనుభవాన్ని ఆధారంచేసికొనే వృద్ధిలోకి వస్తున్నాయి. అంతేగాని, సంస్థానం యీ సంస్థల అభివృద్ధికోసం ఏవిధమయిన ఆత్రుతా చూపించడంలేదు. క్రీ. శ. ౧౯౪౦లో ఇదివరకున్న పంచాయితీ చట్టాన్ని రద్దుచేశారు. ౧౯౪౪ లో కొత్తచట్టం బొంబాయి చట్టానికి అనుకరణగా నియమించారు. ఇంతవరకూ అది అమలులోకి రానేలేదు. ఈ పంచాయితీ ప్రసక్తినే వదులుకొని యీనాటి డెవలప్మెంటు డిపార్టుమెంటు గ్రామసేవకే అని ఒక వాలంటీరుని ప్రతీగ్రామంలోనూ ఎన్నుకొని అతనికి సహాయంగా ఒక అడ్హాక్ కమిటీని నియమించి గ్రామంలో కావలసిన సౌకర్యాలన్నిటికీ వారి అభిప్రాయంమీదనే ఆధారంచేసికొని స్కూలుకుగాని, నూతికిగాని కావలసిన సొమ్ము యిచ్చివేయడంతోటే యీస్కీము అనేక లోపాలకు లోనయి ఎంతో సంస్థానపుధనం వివిధరకాలుగా వ

ఈ గ్రామ సౌభాగ్యంకోసం చేసే యత్నాలన్నీ పంచాయితీలద్వారా చేస్తే ఎంతో బాగుండేది. ఇంకా ఎన్నో అవసరమయిన మార్పులు చేయాలి. సంస్థాన ప్రభుత్వాధికారవర్గాలు, యీలోపాలను చూపినపుడు తిరిగి యీసంస్కారం ఎలా తేవాలన్న ఆస్థతని చూపించడంకూడా కొంత నయమే.

కాని ఏది ఎలా వున్నా, బొంబాయిప్రభుత్వం తన పంచాయితీలను బాగుచేసుకోవలసిన బాధ్యతను యీనాడయినా గుర్తించి తగిన వుత్సాహంతో కార్యక్రమం కొనసాగించినట్టయితే, బలపడి, ప్రయోజనకారి కాగలిగిన సంస్థ పంచాయితీ అన్న విషయం ఋజువయితీరుతుందనే నా నమ్మకం. అలాగే, పైన ఉదాహరించిన స కిసంస్థానాలలోకూడా యీ సంస్థ బాగా వృద్ధిచెందడానికి తగిన అవకాశాలు ఎన్నో వున్నాయి. ఎక్కడయినా సరియయిన ప్రభుత్వాదరణ లేకనే యీ సంస్థలు పనిచేయడంలేదు.

ఇక మదరాసురాష్ట్రంలోని పంచాయితీవిధానం మీద నాకిప్పటికీ వున్న అభిప్రాయాలు చాలామటుకు ప్రభుత్వశాఖలు ప్రచురించే నివేదికలను ఆధారంచేసుకొన్నవేగనుక, నేను వాటి నాధారంగా తీసికొని ఏమి వ్రాసినా, వాటికి కొంత నేను ఎరగని విలువ నాపాదించడం అవుతుంది. వ్యక్తిగతంగా, ఈరాష్ట్రంలోని పంచాయితీలతో చాలావాటితో యిప్పటికి నాపరిచయం అతిపరిమితమయినది. నే నీరాష్ట్రంలో నా పర్యటన ముగించుకొన్నాక, నాకీ పంచాయితీలను గురించి నేటికంటె విపరీతమయిన అభిప్రాయాలు ఏర్పడడం సహజం. ఆంధ్రదేశంలో మొదట పర్యటన సాగించాలన్న తలంపుతో తూర్పుగోదావరిజిల్లామటుకు తిరగ గలిగాను. అదయినా సొంతంగా చూడడానికి ప్రభుత్వవర్గాల సాయం చాలా కష్టమయింది. మదరాసులో పంచాయితీవిధానం చాలా అభివృద్ధిపొంది, ఆర్థికంగా కావలసినన్ని ఆధారాలు వుండి, ప్రజలో ఎంతైనా చైతన్యం వుండి చేయవలసినంత బాగా ఎందుచేత పనిచేయడంలేదని ఆలోచిస్తే, మన కిన్ని సౌకర్యాలు వుండడమే మనకున్న పెద్ద యిబ్బంది అని నాకనిపిస్తుంది. మనకు రాజకీయాలలో వుండే అభిరుచి స్థానికసంస్థల అభివృద్ధికోసంకూడా వుంటే బాగుండేది. కాని రాజకీయకక్ష్యల రాపిడిలో స్థానికసంస్థల స్వప్రయోజనమే నశించిపోతున్నట్టు కనిపిస్తుంది. పంచాయితీలు అయినా, జిల్లాబోర్డులు మునిసిపాలిటీలు అయినా యిదే పరిస్థితి. చాలాచోట్ల యుద్ధారంభంనుంచి యింతవరకూ ఎన్నికలే లేవు. జిల్లాబోర్డులు అన్నీ ఇంతవరకూ నియమితులయిన అభ్యర్థులద్వారానే స్పెషల్ ఆఫీసర్ల అధికారంకింద పనిచేస్తున్నాయి. పంచాయితీలు వాటంతట అవి చాలా ముందుకురాగలిగిన స్థితిలో వుండి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు పెజమాయిషీతో కార్యక్రమం జరిపిస్తూ ఆదర్శప్రాయంగా వుండాలన్న కోరిక పోయి, అనేకచోట్ల యీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లతో తగవులాడుతూ, అతనికంటె తమరే గొప్పవారని పంచాయితీ సభ్యులూ, పంచాయితీకంటె తనే గొప్ప అధికారినని యీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరూ యీతగవులాటలతో కాలం వెళ్లబుచ్చుచున్నారు. ఈపద్దతి చూచి సరదాపడే మనుష్యులేగాని, పంచాయితీ, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు ఒకరిమీద ఒకరు గౌరవంతో కార్యభారం నెరవేర్చుకోవాలని నిశ్చయం చూపించే గ్రామాలు చాలాతక్కువ. లక్షరూపాయలకు మించిన ఆదాయం వున్న భీమవరంలాంటి పంచాయితీలు వున్నాయి. ఇలాగే మంచి ఉత్పత్తి, ఆధారాలు వున్న పంచాయితీలు రాష్ట్రంలో ఎన్నో వున్నాయి. అడవి పంచాయితీలు, నీటిపారుదల పంచాయితీలు, పంచాయతీ కోర్టులు—యీవిధంగా పంచాయితీసంస్థ నలువిధాలా ప్రాబల్యం చెందిన యీ రాష్ట్రంలో పరిస్థితులింత శోచనీయమయిన పంథాలో నడవడం చాలా దురదృష్టం. ఈనాడున్న పంచాయితీచట్టంలోని లోపాలను సవరించి, సరియయిన ప్రోత్సాహకరమయిన మార్పులుచేసి, ప్రజలో ప్రతిభావంతులు వీటికభ్యర్థులై సరిగా నడిపించి మార్గదర్శకమయిన పంచాయితీలు ఏర్పడతాయో లేదో మనం నిరీక్షించిచూడాలి.

ర్యాలు రాష్ట్రప్రభుత్వమే చేయాలి. వైద్య సాయం లోనూ ప్రసక్తియింతే. ఇంక సామాన్యమయిన సౌకర్యాలను ఏర్పాటుచేసికోడానికి యీ సంస్థలు కొంతవరకూ ఉపకరిస్తాయి. రోడ్లు వేయించుకోడానికి, దీపాలు పెట్టించుకోడానికి, యిలాంటి చిన్నచిన్న పనులకు యివి సాయంచేస్తాయి. పోనీ, అన్ని పంచాయితీలూ యిలా ప్రజా సౌఖ్యం కోసం పాటుబడడానికి సిద్ధంగా వున్నాయా అంటే, విధిలేక పనిచేస్తూ ఏ మాత్రం సావకాశంవున్నా, పంచాయితీని ఎత్తించివేయాలన్న గ్రామాలు ప్రతిజిల్లాలోనూ అక్కడావున్నాయి. కాని పల్లెటూళ్ళల్లో పార్టీలు,తగవులాటలు యిక్కడే కాదు, ప్రతీదేశంలోనూ వున్నాయి. యిందుకోసం పంచాయితీనే తిరిగి స్థాపించి బలవత్తరంగా చేయడానికి వచ్చే అభ్యంతరాలు ఏవీ వుండవు.

బొంబాయి రాష్ట్రంలోని గ్రామ పరిపాలనా విధానం అక్కడి స్వదేశ సంస్థానాలనుంచి నేర్చుకో గలిగిన విషయాలేవీ లేవా? సతారా జిల్లాలోని ఔంధ్ సంస్థానం ఆదర్శప్రాయమైన రామరాజ్యం అనీ,అక్కడ పంచాయితీలే ప్రభుత్వ సారథ్యాన్ని వహిస్తున్నాయనీ గాంధీగారూ,యితర ప్రముఖ వ్యక్తులూ ఎంతోమంది ప్రతినిత్యం ప్రశంసిస్తోంటే, బొంబాయి యీ విధానం ఎందుకు అనుకరించకూడదు? కొల్హాపూరు దక్కను స్వదేశ సంస్థానాలకు నాయకత్వం వహిస్తున్న పెద్ద సంస్థానం కదా, అక్కడ 'గ్రామ పునర్నిర్మాణోద్యమం' లో నుంచి కూడా బొంబాయి ప్రభుత్వం కొన్ని ముఖ్యపాఠాలు నేర్చుకోనేవి లేవూ అని యితర రాష్ట్ర ప్రజలు ఆశ్చర్యంతో ప్రశ్నించడం సహజం. కాని,రెండు సంస్థానాలలోనూ అంతర్భాగాలలో పర్యటనం చేసి కొన్ని గ్రామాలనుచూచినతరువాత రెండు సంస్థానాలూకూడా బొంబాయి ప్రభుత్వానికిగాని, యితర భాగాలకుగాని నేర్పదగ్గ అంశాలేవీ లేకపోవడమే కాకుండా అధమం బొంబాయిప్రభుత్వంనుంచి అయినా నేర్చుకోవలసిన విషయాలెన్నో వున్నాయి. దీనికి కారణాలన్నీ చెప్పాలంటే వివరాలన్నీ చెప్పాలి. దాని కిది సమయం కాదు. ఈ అగత్యాన్ని మటుకు యీ రెండు సంస్థానాలకూ నచ్చజెప్పిన తరువాత వారామోదించక తప్పిందికాదు. సుహృద్భావంతో వారి గ్రామ పరిపాలనావిధానాలను యిప్పుడయినా తిరిగి పునః ప్రతిష్ఠచేసికోవలసిన అగత్యం వారంగీకరించి అందుకు ఉత్సాహాన్ని, శ్రద్ధను వారు కనపరచడం ఎంతో సంతోషకరమయిన విషయం. స్వదేశ సంస్థానాలలో ప్రజాపరిపాలన ప్రజాస్వామికం పేరిట జరుగుతున్నట్లు యావద్భారత దేశంఅంతా ఒకవైపు చాటుతూ వారి ఆదాయాలపై ప్రజ కేపాటి హక్కులూలేని స్థితిలో ఔంధ్ సంస్థానం జరుపుతోన్న కార్యకలాపం ఏ ఆర్థిక రాజకీయ వేత్తకయినా చాలా అన్యాయంగా కనిపించకపోదు. ఇది ప్రభుత్వం గుర్తించనట్లు కనిపించింది. నేను ఔంధ్ రాజాగారితోటే, వారిమంత్రులతోనూ యీవిషయం గురించి ప్రస్తావించినప్పుడు జరిగిన దానికి కారణాలేవో చెప్పి వెంటనే యావద్రాజకీయ విధానాన్ని తిరిగి కొత్త మార్పులతో పునరుద్ధరించడానికి వారు ఒప్పుకోవడమే నా కృషికి ఫలితం.

కొల్హాపూరు సంస్థానంలో పంచాయితీలు ౧౯౨౬ సంవత్సరంనుంచీ అమలులోవున్నాయి. నరిసింహవాడి, హుప్రి వంటి ప్రసిద్ధిపొందిన గ్రామపంచాయితీలు ఎన్నో వున్నాయి. కాని యివన్నీ అక్కడి ప్రజలలో వుండే పెద్దల అనుభవాన్ని ఆధారంచేసికొనే వృద్ధిలోకి వస్తున్నాయి. అంతేగాని, సంస్థానం యీ సంస్థల అభివృద్ధికోసం ఏవిధమయిన ఆత్రుత చూపించడంలేదు. క్రీ. శ. ౧౯౪౦లో ఇదివరకున్న పంచాయితీ చట్టాన్ని రద్దుచేశారు. ౧౯౪౪ లో కొత్తచట్టం బొంబాయి చట్టానికి అనుకరణగా నియమించారు. ఇంతవరకూ అది అమలులోకి రానేలేదు. ఈ పంచాయితీ ప్రసక్తినే వదులుకొని యీనాటి డెవలప్మెంటు డిపార్టుమెంటు గ్రామసేవకే అని ఒక వాలంటేరుని ప్రతీగ్రామంలోనూ ఎన్నుకొని అతనికి సహాయంగా ఒక అడ్హాక్ కమిటీని నియమించి గ్రామంలో కావలసిన సౌకర్యాలన్నిటికీ వారి అభిప్రాయంమీదనే ఆధారంచేసికొని స్కూలుకుగాని, నూతికిగాని కావలసిన సొమ్ము యిచ్చివేయడంతోటే యీస్కీము అనేక లోపాలకు లోనయి ఎంతో సంస్థానధనం వివిధరకాలుగా వృథాఅయిపోతోంది.

ఈ గ్రామ సౌభాగ్యంకోసం చేసే యత్నాలన్నీ పంచాయితీలద్వారా చేస్తే ఎంతో బాగుండేది. ఇంకా ఎన్నో అవసరమయిన మార్పులు చేయాలి. సంస్థాన ప్రభుత్వాధికారవర్గాలు, యీలోపాలను చూపినపుడు తిరిగి యీసంస్కారం ఎలా తేవాలన్న ఆత్రుతని చూపించడంకూడా కొంత నయమే.

కాని ఏది ఎలా వున్నా, బొంబాయిప్రభుత్వం తన పంచాయితీలను బాగుచేసుకోవలసిన బాధ్యతను యీనాడయినా సుస్థిరించి తగిన వుత్సాహంతో కార్యక్రమం కొనసాగించినట్టయితే, బలపడి, ప్రయోజనకారి కాగలిగిన సంస్థ పంచాయితీ అన్న విషయం ఋజువయితీరుతుందనే నా నమ్మకం. అలాగే, పైన ఉదాహరించిన స్వదేశసంస్థానాలలోకూడా యీ సంస్థ బాగా వృద్ధిచెందడానికి తగిన అవకాశాలు ఎన్నో వున్నాయి. ఎక్కడయినా సరియయిన ప్రభుత్వాదరణ లేకనే యీ సంస్థలు పనిచేయడంలేదు.

ఇక మదరాసురాష్ట్రంలోని పంచాయితీవిధానం మీద నాకిప్పటికీ వున్న అభిప్రాయాలు చాలామటుకు ప్రభుత్వశాఖలు ప్రచురించే నివేదికలను ఆధారంచేసుకొన్నవేగనుక, నేను వాటి నాధారంగా తీసికొని ఏది వ్రాసినా, వాటికి కొంత నేను ఎరగని విలువ నాపాదించడం అవుతుంది. వ్యక్తిగతంగా, ఈరాష్ట్రంలోని పంచాయితీలతో చాలావాటితో యిప్పటికి నాపరిచయం అతిపరిమితమయినది. నే నీరాష్ట్రంలో నా పర్యటన ముగించుకొన్నాక, నా కీ పంచాయితీలను గురించి నేటికంటె విపరీతమయిన అభిప్రాయాలు ఏర్పడడం సహజం. ఆంధ్రదేశంలో మొదట పర్యటన సాగించాలన్న తలంపుతో తూర్పుగోదావరిజిల్లామటుకు తిరగ గలిగాను. అదయినా సొంతంగా చూడడానికి ప్రభుత్వవర్గాల సాయం చాలా కష్టమయింది. మదరాసులో పంచాయితీవిధానం చాలా అభివృద్ధిపొంది, ఆర్థికంగా కావలసినన్ని ఆధారాలు వుండి, ప్రజలో ఎంతైనా చైతన్యం వుండి చేయవలసినంత బాగా ఎందుచేత పనిచేయడంలేదని ఆలోచిస్తే, మన కిన్ని సౌకర్యాలు వుండడమే మనకున్న పెద్ద యిబ్బంది అని నాకనిపిస్తుంది. మనకు రాజకీయాలలో వుండే అభిరుచి స్థానికసంస్థల అభివృద్ధికోసంకూడా వుంటే బాగుండేది. కాని రాజకీయకక్ష్యల రాపిడిలో స్థానికసంస్థల స్వప్రయోజనమే నశించిపోతున్నట్టు కనిపిస్తుంది. పంచాయితీలు అయినా, జిల్లాబోర్డులు మునిసిపాలిటీలు అయినా యిదే పరిస్థితి. చాలాచోట్ల యుద్ధారంభంనుంచి యింతవరకూ ఎన్నికలే లేవు. జిల్లాబోర్డులు అన్నీ ఇంతవరకూ నియమితులయిన అభ్యర్థులద్వారానే స్పెషల్ ఆఫీసర్ల అధికారంకింద పనిచేస్తున్నాయి. పంచాయితీలు వాటంతట అవి చాలా ముందుకురాగలిగిన స్థితిలో వుండి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఆజమాయిషీతో కార్యక్రమం జరిపిస్తూ ఆదర్శప్రాయంగా వుండాలన్న కోరిక పోయి, అనేకచోట్ల యీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లతో తగవులాడుతూ, అతనికంటె తమరే గొప్పవారని పంచాయితీ సభ్యులూ, పంచాయితీకంటె తనే గొప్ప అధికారినని యీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరూ యీతగవులాటలతో కాలం వెళ్లబుచ్చుచున్నారు. ఈపందడి చూచి సరదాపడే మనుష్యులేగాని, పంచాయితీ, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు ఒకరిమీద ఒకరు గౌరవంతో కార్యభారం నెరవేర్చుకోవాలని నిశ్చయం చూపించే గ్రామాలు చాలాతక్కువ. లక్షరూపాయలకు మించిన ఆదాయం వున్న భీమవరంలాంటి పంచాయితీలు వున్నాయి. ఇలాగే మంచి ఉత్పత్తి, ఆధారాలు వున్న పంచాయితీలు రాష్ట్రంలో ఎన్నో వున్నాయి. అడవి పంచాయితీలు, నీటిపారుదల పంచాయితీలు, పంచాయతీ కోర్టులు—యీవిధంగా పంచాయితీసంస్థ నలువిధాలా ప్రాబల్యం చెందిన యీ రాష్ట్రంలో పరిస్థితు లింత శోచనీయమయిన పంథాలో నడవడం చాలా దురదృష్టం. ఈనాడున్న పంచాయితీచట్టంలోని లోపాలను సవరించి, సరియయిన ప్రోత్సాహకరమయిన మార్పులుచేసి, ప్రజలో ప్రతిభావంతులు వీటికభ్యర్థులై సరిగా నడిపించి మార్గదర్శకమయిన పంచాయితీలు ఏర్పడతాయో లేదో మనం నిరీక్షించిచూడాలి.



# భూప్రదక్షిణము

= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

జర్మనీతో ఎట్టి సంధి చేసుకొనవలెనో నిర్ణయించుటకు మాస్కోనగరమందు సమావేశమైన నలుగురు మంత్రులు ఎట్టి తీర్మానమునకు రాలేక, సభను వాయిదా వేయుదురేమో అను సందేహము కలుగుచున్నదని గతమాసములో వ్రాసియుంటిని. ఇప్పుడు అనుకొనినట్లే జరిగెను. ఏడువారముల కాలము అతి తీవ్రముగ వారు వాద ప్రతివాదములు జరిపిరి. కాని ఏ విషయమును గురించియు వారి మధ్యన సామరస్యము కుదురలేదు. మరి ఆరునెలలు గడచినతర్వాత, సంవత్సరాంతమున తిరిగి సమావేశమగుటకు వారు తీర్మానించుకొని, ఎవరింటికి వారు వెళ్ళిపోయిరి. ఈ విధముగ మాస్కో సభ భగ్నమగుట మూలమున ప్రపంచపరిస్థితులు మరింత క్లిష్టము లయ్యెనా అను అనుమానము కలుగకమానదు. ప్రపంచమునకు కావలసినవి శాంతిభద్రతలు. వీటికి అగ్రరాజ్యముల మధ్యన సంభవించు విరోధము, ద్వేషభావము ప్రమాదమును కలిగించును. మాస్కో సభలోని చర్చల మూలమున అగ్రరాజ్యములగు రషియా, యునైటెడ్ స్టేట్సు, ఇంగ్లండు, ఫ్రాన్సుల మధ్యన సుహృద్భావ మేర్పడుటకు బదులు ద్వేషభావము వృద్ధిగాంచెనని చెప్పవలసియున్నది. ఏ విషయమందుకూడ వారికి ఐకమత్యము ఏర్పడలేదు. ప్రమాదమంతయు ఇందులోనే ఉన్నది.

## ఆస్ట్రియా

జర్మనీనిగురించి తీవ్రమైన అభిప్రాయభేదములకు అవకాశ మున్నను ఆస్ట్రియా విషయమై ఇట్టి అభిప్రాయభేద ముండదనియు, ఆస్ట్రియా దేశముతో చేసుకొనదగిన సంధిపత్రము మాస్కో సభలో తప్పక తయారగుననియు విమర్శజ్ఞు లందరు సూచించియుండిరి. కాని ఇదికూడ జరుగలేదు. ఇందువిషయమైకూడ రషియా యొక్క అభిప్రాయములు తక్కిన ముగ్గురి అభిప్రాయములకంటె భిన్నములుగ పరిణమించెను. ఒక విషయములో మనస్సులు కలియనప్పుడు తక్కినవాటిలో మాత్రము కలియునా?

ఒకప్పుడు ఆస్ట్రియావారు గొప్ప సామ్రాజ్యమును ఏలుచుండిరి. ౧౯ వ శతాబ్దములో జరిగిన యుద్ధముల మూలమునను, మొదటి ప్రపంచయుద్ధము మూలముననను వీరు సామ్రాజ్యమునంతను కోల్పోయిరి. ఇప్పటి పోలెండు, జెకోస్లోవేకియా, యూగోస్లావియా, హంగేరీ, ఇటలీ మొదలైనవన్నియు ఆస్ట్రియాసామ్రాజ్యము శిథిల మగుటచేత ఏర్పడిన రాజ్యములే. మొదటి ప్రపంచయుద్ధము ముగిసినతర్వాత ఆస్ట్రియా విస్తీర్ణమందు మిక్కిలి చిన్నదయ్యెను. ఇందులో ౭౦ లక్షల ప్రజలుమాత్రమే ఉండిరి. కాని వీరందరు జర్మనులు. జర్మనీలోని జర్మనులతో కలిసి "విశాల జర్మనీ" రాజ్యమును స్థాపించిన బాగుండునని వీరిలో కొందరు అభిప్రాయపడిరి. జర్మనీలోని జర్మనులుకూడ ఇట్టి అభిప్రాయమునే కలవారైరి. కాని ఇట్టి విశాల జర్మనీ ఏర్పడుట ఫ్రాన్సు, ఇటలీ మొదలగువారికి ఇష్టము లేదు. ౧౯౩౩ లో హిట్లరు జర్మనీకి నియంత అయ్యెను. క్రమక్రమముగ అతడు తన బలమును వృద్ధిజేసుకొని తుదకు ౧౯౩౮ లో ఆస్ట్రియాపై దండెత్తి దానిని

వశపరచుకొని జర్మనీలో ఒక రాష్ట్రముగ చేసెను. అదిమొదలు రెండవ ప్రపంచయుద్ధము ముగియునంత వరకు ఆస్ట్రియా జర్మనీలో ఒక అంతర్భాగముగ నుండి, యుద్ధమందు హిట్లరుకు కావలసిన సహాయమును చేసెను. రషియాపై దండెత్తివచ్చిన హిట్లరు పటాలము లనేకములలో ఆస్ట్రియాయోధు లుండిరి; హిట్లరుకు కావలసిన ఆయుధము లనేకములు ఆస్ట్రియా కర్మాగారములలో తయారయ్యెను.

జర్మనీవలన ఎట్టి ప్రమాదము కలుగకుండుటకు ఆస్ట్రియా ప్రత్యేకమైన స్వతంత్రరాజ్యముగ ఏర్పడవలయు ననుటలో అగ్రరాజ్యముల మధ్య అభిప్రాయ భేదము లేదు. కాని రెండు విషయములలో మాస్కో సభయందు అభిప్రాయభేదము ఏర్పడెను. ఆస్ట్రియాలో జర్మనీకి ఉన్న ఆస్తులన్నిటిని యుద్ధనష్టపరిహారము క్రింద మిత్రమండలివారు తీసుకొనుట న్యాయమని అందరు అంగీకరించినను, "జర్మనీకి ఉన్న ఆస్తులు" అన్నది ఎట్టి ఆస్తుల విషయమున వర్తించవలెనో వారు నిర్ణయించలేక పోయిరి. ౧౯౩౮ తర్వాత హిట్లరు బలాత్కారముగ ఆస్ట్రియావారి ఆస్తు లనేకములను తన వశము చేసుకొనెను; అనేక ఆస్ట్రియా కర్మాగారములు జర్మనుల అధీనములోనికి వచ్చెను. ఇవన్నియు న్యాయతః ఆస్ట్రియనులవే. కాని చట్టరీత్యా జర్మనీ ఆస్తులని చెప్పవలసియున్నది. వీటి నన్నిటిని నష్టపరిహారముక్రింద తీసుకొనవలెనని రషియావారి వాదము. కాని ఇది జరిగినయెడల ఆస్ట్రియా దుర్భరమగు దారిద్ర్యమును అనుభవింపవలసినదగును. అన్యాయముగ హిట్లరు అపహరించిన ఆస్తులను తిరిగి తమవశము చేయుటకు బదులు వాటి నన్నిటిని రషియావారు తీసికొనినయెడల ఆస్ట్రియా నిలబడుట ఎట్లు? శత్రువర్గములో చేరినవారి విషయమున ఇట్టి నష్టము కలిగించుట కొంతవరకు ధర్మమేమో గాని, హిట్లరు ఆగ్రహమునకు గురియై స్వాతంత్ర్యమును కోల్పోయిన ఆస్ట్రియా విషయమున ఈ విధముగ ప్రవర్తించుట అన్యాయమని అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సువారి వాదము. ఆస్ట్రియాపై ఇంతటి దయాదాక్షిణ్యములు చూపుట అనవసరమని రషియావారి జవాబు. ఏది ఎట్లున్నను రషియావారు ఇదివరకే ఇట్టి ఆస్తులలో చాలభాగమును వశపరచుకొనుట జరిగినది. మరొక విషయమును గురించి కూడ అభిప్రాయభేద మేర్పడెను. ఆస్ట్రియాలో "కరింతయా" అను జిల్లా ఒకటి యున్నది. ఇది "యూగోస్లావియా" రాజ్యమును ఆనుకొనియున్నది. ఇందులోని ప్రజలలో కొందరు స్లావుజాతివారు. ఆ కారణముచేత ఈ జిల్లా అంతయు తమ వశములోనికి రావలెనని యూగోస్లావియా ప్రభుత్వమువారు కోరిరి. ఈ ప్రభుత్వమువారు కమ్యూనిష్టులు; రషియాకు అనుచరులు. అందుచేత వీరి కోరికను మన్నించవలసిన దని రషియావారు వాదించిరి. అమెరికా మొదలైనవారు దీని కంగీకరింపరైరి. ఆస్ట్రియాకు సంబంధించిన మరి కొన్ని విషయములలోకూడ ఇట్టి అభిప్రాయభేదము లేర్పడుటచేత, మొదట అనుకొనినట్లు మాస్కో సభలో ఆస్ట్రియా సంధిపత్రము తయారు కాలేదు. ఈ వివాదాంశముల నన్నిటిని విమర్శించి అందరికి అంగీకారము లగు సూచనలను చేయుటకుగాను ఒక ఉపసంఘమును ఏర్పాటు గావించిరి. వీరు జూలై నెలలో తమ నివేదికను తయారుచేయుదురు. బహుశః అప్పుడు ఆస్ట్రియాతో సంధి జరుగునేమో? అప్పటివరకు ఆస్ట్రియాకు స్వాతంత్ర్య ముండదు. ప్రస్తుతము ఆ దేశము నాలుగు భాగములుగ విభజింపబడియున్నది. ఒకభాగము రష్యావారి వశమందును, తక్కినవి వేరువేరుగ అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సువారి వశమందును ఉన్నవి. శాంతి భద్రతలు కాపాడుటకు మిత్రమండలి సైన్యము లిందున్నవి. వాటికి కావలసిన ఖర్చులన్నియు ఆస్ట్రియావారు భరించుచున్నారు. ఈ విభాగములు, ఈ సైన్యములు రద్దయినగాని ఆస్ట్రియాకు స్వాతంత్ర్యము లభింపదు. ఆస్ట్రియావారు హిట్లరుకు సహాయభూతులై, తమకు అపకారము చేసినారను భావము రషియావారి మనస్సులో దృఢముగ నాటుకొనియున్నది. ఇదిగాక, హిట్లరు మూలమున రషియావారు అపారమైన నష్టమును అనుభవించవలసినవారైరి. వారి వ్యవసాయము, పరిశ్రమలు, కర్మాగారములు, రాకపోకల సౌకర్యాలు—ఎంతో వినాశముపొందెను. ఎంతో కష్టపడినగాని వారు యథాస్థితికి వచ్చుటకు వీలులేదు. యుద్ధము ముగిసి

రెండు సంవత్సరములైనను రషియాలోని ప్రజలు ఇప్పటివరకు క్షామబాధ ననుభవించుచున్నారు. ఆస్ట్రియానుండియు, జర్మనీనుండియు అపారముగ వారు నష్టపరిహార మనుపేర సమస్త వస్తువులను తీసుకొనుటకు ఇదియే కారణము.

## అభిప్రాయభేదఫలితములు

జర్మనీవిషయమున ఏయే అంశములనుగురించి రషియావారికిని, తక్కిన ముగ్గురికిని అభిప్రాయ భేదములు కలిగెనో గతమాసమున వివరించియుంటిని. ౧౮౭౦ లో జర్మనీ అంతయు ఒక కేంద్రప్రభుత్వ పరిపాలనలోనికి వచ్చెను. అదిమొదలు జర్మనుల బలము విపరీతముగ వృద్ధిగాంచెను. వారు ౧౮౭౦-౭౧ లోను, ౧౯౧౪-౧౮ లోను, ౧౯౩౯-౪౫ లోను మూడు పర్యాయములు ఫ్రాన్సుపై దండెత్తి ఫ్రెంచివారికి కలిగించిన నష్టము వర్ణనాతీతము. గనుక ఫ్రెంచివారు జర్మనీకి ఒక కేంద్ర ప్రభుత్వ ముండకూడ దనియు, అది అనేక చిన్నచిన్న రాజ్యములుగ చీలిపోవలయు ననియు పట్టుబట్టియున్నారు. అమెరికావారు, ఇంగ్లీషువారు చాలవరకు వీరితో ఏకీభవించుచున్నారు. కాని రషియావారు ఇందు కంగీకరించలేదు. జర్మనీకంతకు ఒక కేంద్ర ప్రభుత్వ ముండవలెనని వారి వాదము. అట్టి ప్రభుత్వ మందు కమ్యూనిష్టుపక్షమువారికి ప్రాబల్యము లభించునని వారి ఆశయము. ఆ కారణముచేతనే ఇతరు లందు కిష్టపడుట లేదు. రెండుమూడుతరములవరకు జర్మనీ వారిచేత కష్టపడి పనిచేయించి, వారు వారి కర్మాగారములలో తయారుచేయు వస్తుసామగ్రిని, గనులలోనుండి ఉత్పత్తిచేయు బొగ్గును, వ్యవసాయము మూలమున పండించు పంటలలో చాలభాగమును నష్టపరిహారము క్రింద రషియాకు ఎగుమతి చేసికొనవలెనని రషియావారి ఆశయము. ఉత్పత్తియగు బొగ్గులో చాలభాగము ఫ్రెంచివారికి చెందవలెననియు, ఇతరపరిశ్రమ లేవియు జర్మనీలో వృద్ధిగాంచ కూడదనియు ఫ్రెంచివారి వాదము. ఈ వాదప్రతివాదముల మూలమున మాస్కో సభ భగ్నమయ్యెను.

## విచారహేతువా ?

సభ భగ్నమైనను విస్తారప్రమాదము లేదని నలుగురు మంత్రులు చెప్పుచున్నారు. బహు క్లిష్టములుగ నుండు విషయములు ఒక సభలో పరిష్కారము కాగలవని వా రెన్నడు అనుకొనలేదట ! ఈ సభలో జరిగిన చర్చల మూలమున ఎవరి దృక్పథము ఎట్టిదో స్పష్టమయ్యెను. ఈ బేరసారములో ఎవరెవరు ఎంతవరకు తగ్గునది తెలియవచ్చెను. గనుక మరొకపర్యాయము వీరు సభచేసినప్పుడు అనవసరమైన చర్చలలోనికి దిగవలసిన అవసరము లేక, ఎంతవరకు సామరస్యము కుదురునో అంతవరకు సామరస్యము కుదుర్చుకొని, సంధిపత్రము తయారుచేసుకొనెదరు. కొంచెముకూడ సామరస్యము కుదురనియెడల వారు విచారించరు. గనుక మాస్కో సభ భగ్నమయ్యెనని చింతించుట అనవసరమని వీరు తృప్తిపడుచున్నారు.

## అమెరికా విదేశరాజ్యాంగవిధానము

రషియావారికి, తమకు సామరస్యము కుదురుట సులభసాధ్యము కా దన్నమాటను అమెరికావారు గ్రహించినకారణమున వారి విదేశరాజ్యాంగవిధానమున గొప్ప విప్లవము రాగలదు. మొదటి ప్రపంచయుద్ధమునకు పూర్వము అమెరికావారు ఇతరదేశవ్యవహారములలో జోక్యము కలిగించుకొనుట కెంతమాత్రము ఇష్టపడినవారు కారు. ఆ యుద్ధములో వారు చేరుట తప్పనిసరి అయ్యెను. అటుతర్వాతకూడ కొంతకాలమువరకు వారు వారి పూర్వపద్ధతినే అనుసరించుచువచ్చిరి. కాని రెండవ ప్రపంచయుద్ధములో వారు యుద్ధము చేయవలసివచ్చెను. ఈ అనుభవమునుండి వా రొక గుణపాఠమును నేర్చుకొనిరి. ప్రస్తుతకాలపు పరిస్థితులలో ఇతరదేశముల వ్యవహారములలో జోక్యము కలిగించుకొనకూడ దను రాజనీతి అనుచరణయోగ్యము కాదు. తాము జోక్యము కలిగించుకొనవద్దని అనుకొనినను ఇతరులు తమ వ్యాపారమునకు, స్వాతంత్ర్యమునకు భంగమును కలిగింతురు. జపానువారు, జర్మనీవారు అట్లు చేయుటకు ప్రయత్నించిరి. అందుచేత వారితో యుద్ధములను చేయవలసివచ్చెను. అందుకై కోట్లకొలది

ద్రవ్యమును ఖర్చుపెట్టవలసివచ్చెను. ఇతరుల మూలమున ప్రమాదము సంభవించినతర్వాత, అట్టి ప్రమాదమును ఎదుర్కొనుటకు ప్రయత్నించుటకు బదులు, ప్రమాదము రాకుండ చేసుకొనుటయే మంచిదిగదా ? ఎక్కడెక్కడ శత్రువు లున్నారో గమనించుచు, వారి విరోధము యుద్ధముగ పరిణమించుటకు పూర్వమే వారిని నిరోధించుట ఉత్తమమార్గ మనియు, అందుకై తమ పలుకుబడిని అన్ని దేశములలో వ్యాపింపజేయుట అవసరమనియు అమెరికావా రిప్పుడు నిశ్చయించుకొని యున్నారు. గ్రీసు, టర్కీ దేశములకు సహాయము చేయుటకు వారు సిద్ధపడుట కిదియే కారణము. మాస్కో సభలో జరిగిన వాదప్రతివాదముల మూలమున తమకును, రష్యావారికిని సామరస్యము కుదురుట కష్టసాధ్యమని వారికి తోచుచున్నది. అందుచేత రషియాయొక్క ప్రాబల్యమును నిరోధించుటకును, తమ ప్రాబల్యమును వృద్ధిచేసుకొనుటకును వారు మరింత దీక్షతో పనిచేయ బూనుకొనియున్నారు. దీని ఫలితము ప్రపంచ మంతయు అమెరికాపక్షము, రషియాపక్షము అని రెండు పక్షములుగ విభాగమగుటయే.

తమ ఉద్దేశములను సాధించుకొనుటకు అమెరికావారికి గల సాధనము వారి అర్థబలమే. వారి కున్నంత ధనధాన్యసంపద మరి ఏ దేశమునకు లేదు. ఇతరదేశములలో అనేకములు దారిద్ర్యబాధ ననుభవించుచున్నవి. గనుక అట్టి దేశములకు ధనసహాయముచేసి, వాటిని రషియాపక్షమున చేరకుండ తమ పక్షమున చేర్చుకొనుటకు అమెరికావారు కంకణము కట్టుకొని యున్నారు. అట్టి సహాయమును వారు ఇరాన్, ఇరాక్, ఈజిప్టు, ఇండియా, చైనా దేశములకు చేయ దలచినట్లు వార్తాపత్రికల మూలమున తెలియుచున్నది. ఇందుకై వారు ౧౭౫౦౦ కోట్ల రూపాయలను ఖర్చుపెట్టుటకు సంసిద్ధులుగ నున్నారు. దీనిమూలమున అమెరికాయొక్క ప్రాబల్యము మధ్యప్రాచ్య దేశములందును, ఇండియా చైనాలయందును వ్యాపించగలదు.

## రషియా విదేశరాజ్యాంగనీతి

ఇట్టి పరిస్థితులలో రషియామాత్రము ఊరకుండునా ? తమ ప్రాబల్యమును వృద్ధిచేసుకొనుటకు వారు కూడ ప్రయత్నముచేసెదరు. వారి అధీనమందుండు తూర్పు జర్మనీలో వారి పరిపాలనము స్థిరముగ నాటుకొను సూచనలు కనుపించుచున్నవి. పోలెండు, జెకోస్లోవేకియా, హంగేరి, యూగోస్లోవియా, ఆల్బేనియా, రుమేనియా, బల్గేరియా దేశములు రషియాపక్షమం దిదివరకే చేరియున్నవి. వీటికి కావలసిన ఆర్థికసహాయము చేయుటకును, వీటి మధ్యన వర్తకవ్యాపారములను వృద్ధిచేసి ఆర్థిక అనుబంధములను బలపరచుటకును రషియావారు దీక్షవహించియున్నారు. అమెరికాకు ఉన్నంతటి ఆర్థికబలము ప్రస్తుతమున రషియావారికి లేకపోవుటచేత వా రిప్పుడు ఇంతకంటె ఎక్కువచేయుటకు సమర్థులు కాకున్నారు. కాని రషియావారికిని, అమెరికా వారికిని స్పర్థ ఏర్పడిన దనియు, ప్రపంచములోని పరిస్థితు లన్నిటికి కొంతకాలమువరకు ఈస్పర్థ ఆధారమగు ననియు మనము గ్రహించవలెను. మాస్కోసభ భగ్నమగుటకు ఈ స్పర్థయే కారణము.

## ఇంగ్లండు విదేశరాజ్యాంగనీతి

అమెరికా రషియాల మధ్యన ఏర్పడిన ఈ స్పర్థలో ఇంగ్లండు ఇప్పటివరకు అమెరికాపక్షమును వహించియున్నది. మాస్కోసభయందు ఇంగ్లండు అమెరికామంత్రులు అనేకవిషయములలో ఏకాభిప్రాయముతో ప్రవర్తించిరి. రషియాపట్ల అమెరికావారు వహించిన నీతి యుక్తము కాదనియు, దీనిమూలమున మూడవ ప్రపంచయుద్ధము తప్పదనియు, ఇట్టి సందర్భములో ఇంగ్లీషువారు ఏ పక్షమునను చేరక, మధ్యవర్తులై సామరస్యమును వృద్ధిచేయుటకు ప్రయత్నించవలె ననియు ఈ మధ్యన హెన్రీ వాలెస్ అను అమెరికన్ ప్రముఖు డొకడు ఇంగ్లండునకు వచ్చి, అనేక ఉపన్యాసములను చేసెను. కాని దీనిమూలమున ఇంగ్లీషు మంత్రివర్గమువారి అభిప్రాయములలోగాని, చర్చిల్ పక్షము వారి అభిప్రాయములలోగాని ఎట్టిమార్పు కలుగలేదు. ఇదిగాక మధ్యప్రాచ్యదేశములలోని తమ పెట్రోలు వ్యాపారమును రక్షించుకొనుటలోను, మధ్యప్రాచ్యము మీదుగ ఆస్ట్రేలియా న్యూజీలెండుల పర్యంతము తమ వ్యాపారమును, సామ్రాజ్యమును రక్షించుకొనుటలోను

ఇంగ్లీషువారికి అమెరికావారి సహాయ మత్యావశ్యము గనుక ఇంగ్లీషువారి విదేశరాజ్యాంగనీతి అమెరికావారిని



హెన్రీ వాలెస్

అనుసరించుటయే అని చెప్పవచ్చును. జర్మనీలో తమ తమ వశమందున్న భాగములను పాలించుటలోకూడ వీరు కలిసి పనిచేయుచున్నారు.

## ఫ్రాన్సు విదేశాంగనీతి

ఫ్రాన్సుదేశపు విదేశాంగనీతి ఎట్లు పరిణమించునో చెప్పుట కొంచెము కష్టసాధ్యము. అచ్చటి రాజకీయపరిస్థితులు దినదినమునకును మారుచున్నవి. ఆ దేశములో అనేక రాజకీయపక్షము లున్నవి. వీటిలో కమ్యూనిస్టుపక్షమువారు రషియాయెడల సుహృద్భావము కలవారు. కాని తక్కిన పక్షముల వారికి ఇట్టి అభిప్రాయము లేదు. వారిలో కొందరు ఇంగ్లండుతో కలిసియుండుట కిష్టపడుచున్నారు. మాస్కోసభలో ఫ్రెంచిప్రతినిధి చాలవరకు ఇంగ్లండు అమెరికా ప్రతినిధులతో ఏకీభవించి పనిచేసెను. దీనికి ఫలితముగ జర్మనీలో ఉత్పత్తియగు బొగ్గులో కొంతభాగమును ఫ్రాన్సుకు పంపుటకు ఇంగ్లీషువారు, అమెరికన్లు అంగీకరించిరి. ఇది చాలముఖ్యమైన విషయము. కావలసినంత బొగ్గు లభింపనందున ఫ్రెంచివారి పరిశ్రమలు వెనుకబడియున్నవి. వారికి ప్రస్తుతముండు ఆర్థికచిక్కు లనేకములకు ఈ బొగ్గులోపమే కారణము. ఇదిగాక ఈనెలలో ఫ్రాన్సునందు మరొక విశేషముకూడ గమనించతగియున్నది. ఫ్రెంచినాయకులలో "డిగాల్" అను ప్రఖ్యాతపురుషు డొకడున్నాడు. రెండవ ప్రపంచ యుద్ధములో ఫ్రెంచి స్వాతంత్ర్యమునకై పోరినవారిలో ఇతడే అగ్రగణ్యుడు. కాని కొన్ని కారణములచేత ఇతడు కొంతకాలమునుండి రాజకీయములందు పాల్గొనకుండెను. ప్రస్తుతము దేశములోని పరిస్థితులు తారుమారగుచున్న వని అభిప్రాయపడి ఇతడు కొన్నిరోజుల క్రిందట "ప్రజాపక్షము" అను రాజకీయపక్షము నొకదానిని నిర్మించెను. ఇతడు కమ్యూనిష్టుపక్షవిరోధి. అందుచేత రషియాపక్షమున చేరువాడు కాడు. ఇతడు ప్రస్తుతము అధికారములో లేకున్నను, వానికి గల పలుకుబడినంతను ఇంగ్లండు అమెరికాల పక్షమున వినియోగించునని ఊహించవచ్చును.

గనుక తేలిన సారాంశ మేమనగా—ప్రస్తుతము ప్రపంచమంతయు రాజకీయముగ రెండు పక్షములుగ చీలిపోవుచున్న దను విషయము. ఒకపక్షమునకు అమెరికా నాయకత్వమును వహించియున్నది. రెండవ పక్షమునకు రషియా నాయకత్వమునువహించియున్నది. ఇతర దేశములలో కొన్ని తటస్థములుగను, కొన్ని అమెరికాపక్షమునను, తక్కినవి రషియాపక్షమునను చేరియున్నవి. మాస్కోసభ భగ్నమగుటచేత ఈ విభాగము మరింత బలపడినది.

## భరత ఖండము

౧౯౪౮ జూన్ లోపున భరతఖండమును పాలించుకొను అధికారమును బ్రిటిష్‌వారు వదలుకొను విషయములో ఎట్టి సందేహము లేదనుటకు ఈ నెలలో మరి కొన్ని నిదర్శనములు కనుపించినవి. అధికార పరివర్తనమునకు సంబంధించిన వివరము లన్నిటిని నిర్ణయించుట చాల క్లిష్టమైనవిషయ మనియు, అట్టిపని యువకుడుగ నుండువాడే చేయదగినదని వృద్ధుడగు పెథిక్ లారెన్స్ ప్రభువు ఇండియా కార్యదర్శి ఉద్యోగమునుండి విరమించుకొనెను. అతని స్థానమున వయస్సులో చిన్నవా

డగు లిస్టోవెల్ ప్రభువు కార్యదర్శి అయ్యెను. ఇదిగాక కొద్దిరోజుల క్రిందట మేజర్ అట్లీ ఒక ఉపన్యాసము చేసి, సామ్రాజ్యతత్వమును ఇండియాపట్ల ఆచరణలో ఉంచుట సాధ్యముకాని పని అనియు, అట్టి తత్వమును అనుసరించుట ధర్మమని ప్రతిపాదించు చర్చిల్ కాలమాన పరిస్థితులను తెలియనివాడనియు స్పష్టపరిచెను. కార్మిక మంత్రివర్గములోని తక్కిన సభ్యులుకూడ ఇదే ధోరణిలో మాటలాడుచున్నారు. ౧౯౪౮ జూన్ నాటికి ఉద్యోగమందుండి విరమించుకొను బ్రిటిష్ ఉద్యోగస్థులకు ఇయ్యవలసిన పెన్షనులు, నష్టపరిహారము మొదలగు విషయములను గురించి ఏప్రిలు ౩౦ తేదీన మేజర్ అట్లీ చేసిన ప్రకటననుబట్టికూడ ఈ విషయము స్పష్టమగుచున్నది.

## వైస్రాయి మౌంటుబాటెన్ ప్రభువు

ఏప్రిలు నెలలో వైస్రాయి మౌంటుబాటెన్ ప్రభువు కాంగ్రెసు, లీగు నాయకులతోడను, మహాత్మాగాంధీగారి తోడను, ఇతర నాయకులతోడను, రాష్ట్ర గవర్నరులతోడను ఈ విషయమును గురించియే సంప్ర



మౌంట్ బాటన్ ప్రభువు

దించి అధికారపరివర్తనమునకు సంబంధించిన వివరములనుగురించి ఒక నివేదికను తయారుచేసి, దానిని బ్రిటిష్ ప్రభుత్వమువారికి అందజేయుటకై తన ప్రధాన సలహాదారులలోనొకడగు లార్డు ఇస్మేని లండనుకు పంప నిశ్చయించుకొనెను. ఈ మధ్యన అతడు వాయవ్య సరిహద్దు ప్రాంతములకు వెళ్లినప్పుడు అచ్చటి కొండజాతుల ప్రతినిధులతో మాట్లాడుచు కొండకనుమలను రక్షించు బాధ్యత ౧౯౪౮ జూన్ నాటికి బ్రిటిష్‌వారు వదలుకొనునట్లును, ఆ బాధ్యతను భారతీయులే వహించునట్లును, కొండజాతులవారికమీదట భారతీయ ప్రభుత్వమువారితో ఒడంబడికలు జరుపవలసియుండు ననియు చెప్పెను. ఇదిగాక ప్రస్తుతము స్వదేశ సంస్థానములలో నుండు రెసిడెంట్లు (బ్రిటిష్ ప్రతినిధులు) ఇకమీదట ఉండరని కూడ వైస్రాయి సూచించెను. గనుక అధికార పరివర్తనమునకు కావలసిన ఏర్పాటుల నన్నిటిని బ్రిటిష్‌వారు చేయుచుండుట సత్యము.

కాని వారు ఎవరివశమున తమ కిప్పుడుండు అధికారమును ఒప్పగింతు రను విషయమున తమ అభిప్రాయమును స్పష్టపరచియుండలేదు. అది మే నెలలో స్పష్టము కాగలదు.

## కాంగ్రెసు

ఈ విషయమై కాంగ్రెసువారి అభిప్రాయము కొంతవరకు స్పష్టమయ్యె నని చెప్పవచ్చును. అఖండ హిందూస్థాన సిద్ధాంతమును వదలుకొనవలసిన పరిస్థితులు ఏర్పడిన వని కాంగ్రెసునాయకులు గ్రహించినట్లు చెప్పవచ్చును. దేశమునకు ఒక కేంద్రప్రభుత్వ మేర్పడుటయు, బ్రిటిష్‌వారి అధికారమంతయు దానిపర మగుటయు సాధ్యముకాని పని అని వారు నిశ్చయించుకొనిరి. అనగా పాకిస్థాన్ సిద్ధాంతమునకు వా రంగీకరించవలసి వచ్చినది. నెహ్రూ, రాజేంద్రప్రసాదు, మున్షీ మొదలైనవారు రాజ్యాంగ పరిషత్తులో చేసిన ఉపన్యాసములన్నిటిలో ఈ ధోరణి కనుపించుచున్నది. ఏ మండలవాసులనుగాని నిర్బంధించి కేంద్రప్రభుత్వ పరిపాలనలోనికి తెచ్చుట కాంగ్రెసుఉద్దేశము కాదని ఆ నాయకులందరు చాల కాలమునుండి చెప్పుచుండుట వాస్తవమే. కాని పాకిస్థాన్‌విషయమై లీగువారు కొసకు రాజీకి వత్తురని వారిదవరకు అనుకొనుచుండిరి. ఇప్పుడు వారు ఈ అభిప్రాయమును పూర్తిగ వదలుకొని, దేశ

మందు హిందూస్థాన్ రాజ్య మొకటియు, పాకిస్థాన్ రాజ్య మింకొకటియు—అనగా రెండు సర్వస్వాతంత్ర్యములుగల రాజ్యములు—ఏర్పడుట తప్పనిసరి యని నిశ్చయము చేసుకొనియున్నారు. ఏప్రిలులో దేశమందు జరిగిన విషయము లన్నిటికి ఇదియే ప్రధానఫలితము. హిందూస్థానములో ఏయే మండలములు చేరుట అను నదియే ఇప్పుడు వా రాలోచించుచుండు విషయము. మహమ్మదీయేతరులు అధికసంఖ్యాకులుగ నుండు ప్రదేశములన్నియు ఇందులో చేరుట న్యాయమని, పంజాబు బంగాళ రాష్ట్రములలోని అట్టి ప్రదేశములను వేరుపరచి, ప్రత్యేక రాష్ట్రములుగ నిర్మించి అట్టి రాష్ట్రములను హిందూస్థానములో చేర్చుటకు వారు దృఢముగ సంకల్పించియున్నారు. ఇట్టి విభజన అవసరమని కాంగ్రెసు కార్యవర్గమువారు గత సమావేశములో సూచించిరి. పంజాబులోని హిందువులు, శిక్కులు, బంగాళ రాష్ట్రములోని హిందువులు ఇట్టి విభాగమునకై ఆందోళనచేయుచున్నారు. లీగుప్రభుత్వముక్రింద వారు ఉండుటకు ఎన్నడుగాని సమ్మతింపరని స్పష్టమయ్యెను. ఇట్టి విభాగము మహాత్మ గాంధీగారికి ఇష్టము లేదని తెలియుచున్నది. కాని ఈ విషయములో కాంగ్రెసు కార్యవర్గమువారు వారి అభిప్రాయముతో ఏకీభవింప జాలరు.

## లీగు

దౌర్జన్యము నుపయోగించి, రక్తపాతముద్వారా తమ కోరికలను సఫలము గావించుకొనుటకు లీగుఅనుచరులు సిద్ధపడియున్నట్లు పంజాబు, వాయవ్యపరిహద్దు రాష్ట్రము, కలకత్తా మొదలైన ప్రదేశములలో జరిగిన చర్యలనుబట్టి స్పష్టమగుచున్నది. అల్లరులను లేవదీయుట, ఇండ్లను, బజారులను నిప్పుపెట్టి అగ్నిహోత్రునిపాలు గావించుట, ప్రజలను దోచుట, ఎట్టిపాపము ఎరుగని వారిని పొడిచిచంపుట, స్త్రీలను చెరబెట్టుట, మతాంతరులను బలాత్కరించి తమ మతములో కలుపుకొనుట—ఇవన్నియు ఈ ప్రదేశములలో మామూలయినవి. రైళ్లలోను, బస్సులలోను ప్రయాణముచేయు వారిని చంపుట, వారి ఆస్తిపాస్తులను అపహరించుట మొదలైన దారుణకృత్యములకుకూడ కొందరు వెనుదీయుట లేదు. ఇట్టి అల్లరుల మూలమున ఈ రాష్ట్రములలో లీగు ప్రభుత్వములను స్థాపించి, 1948 జూన్‌లో బ్రిటిష్‌వారు వదలుకొను అధికారమును లీగుకు చెందునట్లు చేయుటయే వీరి ఉద్దేశము. ఏ ప్రభుత్వమువారుకూడ ఇట్టి దౌర్జన్యమును సహింపరు. ఈ కారణముచేత వాయవ్య సరిహద్దురాష్ట్రములో ప్రస్తుతము అధికారములో ఉన్న కాంగ్రెసు మంత్రివర్గము లీగునాయకులను కొందరిని, అనుచరు లనేకులను కారాగారములలో బంధించుట తప్పదయ్యెను. ఇందుకు తోడు సరిహద్దురాష్ట్రములోని బ్రిటిష్ గవర్నరు లీగువారియందు అభిమానము గలవాడై మంత్రివర్గమునకు అనవసరమైన చిక్కులు కల్పించుటకూడ జరుగుచున్నది. కొండ ప్రదేశములలో నివసించు జాతుల వారిలో అనేకులు ఇదే సమయమని రాష్ట్రముపై బడి ప్రజలను దోచుకొనుచున్నారు. దీనిఫలిత మెట్లుండునో చెప్పుటకు వీలులేదు. వాయవ్యపరిహద్దు రాష్ట్రమున క్రొత్త ఎన్నికలను జరిపినయెడల తమకే విజయముకలుగునని భావించి లీగు నాయకులు క్రొత్త ఎన్నికలు కావలయునని ఆందోళన చేయుచున్నారు. ఎన్నికలు జరిగి ఒక సంవత్సరముమాత్రమే జరిగినదనియు, తిరిగీ ఎన్నికలు జరుపుట అవసరము లేదనియు, ప్రస్తుతపు అశాంతి పరిస్థితులలో సక్రమముగ ఎన్నికలు జరుగవనియు కాంగ్రెసు మంత్రివర్గమువా రనుచున్నారు. ఇట్టి సందర్భములో స్వయముగ రాష్ట్రములోని సంగతులను తెలుసుకొనుటకు వైస్రాయిగా రచటికి వెళ్లిరి. లీగు నాయకులు వారి దౌర్జన్యవిధానమును వదలుట కిష్టపడుట లేదు. ఏలాగైనను కాంగ్రెసుఅధికారమును పడగొట్టుటయే వారి ఉద్దేశము.

లీగువారు పంజాబు వాయవ్యరాష్ట్రములందే గాక ఆసాంలోకూడ అల్లరులను లేవదీయుటకు ప్రయత్నములు చేయుచున్నారు. ఆసాంలో మహమ్మదీయుల సంఖ్య తక్కువైనను, దానినికూడ పాకిస్థానములో చేర్చవలెనని లీగువారు పట్టుపట్టియున్నారు. ఏప్రిలు 30 తేదీన జిన్నా గావించిన ప్రకటనలో ఇది స్పష్టముగా నున్నది. ఇందుకుగాను వారు ఒక లక్ష

యాభైవేల మహమ్మదీయులను బెంగాలు, ఆసాం సరిహద్దులలో చేర్చి, ఆసాంపై దండెత్తజూచుచున్నారు. బంగాళములోని మహమ్మదీయులను ఆసాంలో ప్రవేశపెట్టి, అక్కడ ఖాళీగా ఉండు భూములను వారివశము చేసి, క్రమక్రమముగ ఆసాంలోని మహమ్మదీయుల సంఖ్యను వృద్ధిచేయుటయే వీరి ఆశయము. ఇతరరాష్ట్రములవారు తమ రాష్ట్రముపై దండెత్తివచ్చునపుడు అట్టి ప్రమాదమునుండి ప్రజలను రక్షించుట ప్రభుత్వము వారి విధి. ఈ విషయములో కాంగ్రెసు మంత్రివర్గము వారు లీగునాయకులతో సంప్రతించి రాజీ కుదుర్చుకొనుటకు ప్రయత్నించినను లీగువారు అందుకు కలిసి రాలేదు. న్యాయాన్యాయములనుగాని, ధర్మాధర్మములను గాని లెక్కపెట్టక, ఏదో ఒకవిధమున పంజాబు, వాయవ్య సరిహద్దురాష్ట్రము, సింధురాష్ట్రము, బెలూచిస్థానము, బంగాళము, ఆసాంరాష్ట్రము లారింటిని పాకిస్థానములో కలిపి, అట్టి పాకిస్థానలో లీగుప్రభుత్వమును స్థాపించుటకు వీరు విశ్వప్రయత్నము చేయుచున్నారు. 'నాటకంలో ఉపనాటకం' అన్నట్లు, సింధు బంగాళరాష్ట్రములందలి లీగునాయకులు కొందరు తమ రాష్ట్రములు స్వతంత్రరాజ్యములుగ నుండవలసినదే గాని, పాకిస్థానములోగాని హిందూస్థానములోగాని చేరుట శ్రేయస్కరము కాదని వాదించుచున్నారు. ఈ వాదమును పడగొట్టుటకు జిన్నా ఎట్టిపన్నాగమును పన్నునో చూడవలసియున్నది.

పాకిస్థాన్ వచ్చుట తప్పదు. కాని, అది జిన్నా ఉద్దేశించిన పాకిస్థాన్ కాజాలదు. మహమ్మదీయేతరులు అధికసంఖ్యాకులుగ నుండు తూర్పుపంజాబు, పశ్చిమ బంగాళము, ఆసాంరాష్ట్రములో కొంత అందులో చేరవు. ఇవన్నియు హిందూస్థానపు రాష్ట్రములుగ నుండును. అంగవికలమైన పాకిస్థానమునుమాత్రమే లీగు సాధించగలది యగును.

## సంస్థానములు

ఏప్రిల్ నెలలో జరిగిన చర్చల మూలమున సంస్థానములన్నియు ఒక మార్గమునగాక భిన్నమార్గములలో నడుచుటకు సిద్ధపడియున్నవని చెప్పవచ్చును. కొన్ని సంస్థానములు ఇప్పుడే ప్రజాపరిషత్తులో చేరుటకును, ౧౯౪౮ తర్వాత హిందూస్థానములో చేరుటకును సంసిద్ధములుగ నున్నవి. కొచిన్, ఉదయపూరు, జయపూరు, జోధపూరు, బికానీర్, రీవా, పాటియాలా సంస్థానము లిట్టివి. సంస్థాన ప్రజలు తొమ్మిదికోట్ల ముప్పైలక్షలలో రెండు కోట్ల జనము ఇందులో ఉన్నారు. తక్కిన సంస్థానములు పరిషత్తులో చేరుటయా, మానుటయా అని ఆలోచించుచున్నవి. ఈ సంస్థానములలో కొన్నిటికి భోపాల్ నవాబు నాయకుడుగ నుండెను. కాని ఇతడు లీగునందు అభిమానము కలవాడనియు, రహస్యముగ పాకిస్థానమునకై పాటుబడుచున్నాడనియు, ప్రజాపరిషత్తుపట్ల స్నేహభావము లేనివాడనియు కొందరు సంస్థానాధీశులకు అనుమానము కలుగుటచేత వా రాతని నాయకత్వమును అంగీకరించక స్వతంత్రముగ పనిచేయ తీర్మానించుకొనియున్నారు. ఇది శుభసూచకము. హైదరాబాదు, తిరువాన్కూరు మొదలైన గొప్ప సంస్థానములు ఎట్టి పద్ధతుల ననుసరించునో చూడవలసియున్నది. కొన్ని సంస్థానములు పాకిస్థానములో చేరుననియు, కొన్ని హిందూస్థానములో చేరుననియు, హైదరాబాదు, తిరువాన్కూరు వంటివి కొన్ని ఎందులోనూ చేరక సర్వస్వాతంత్ర్యమును ప్రకటించుననియు చెప్పవచ్చును. పరిషత్తు సభలో పండిట్ నెహ్రూ మాట్లాడుచు, సంస్థానముపట్ల కాంగ్రెసువారికి ఏలాటి విరోధము లేదనియు, రాజులను సింహాసనములనుండి తొలగించుట కాంగ్రెసు సూత్రములలో నొకటి కాదనియు, ఎవరి రాజ్యములు వారికి ఉండుననియు స్పష్టపరచెను. దేశాభిమానముగల సంస్థానాధీశులందరు పరిషత్తులో చేరి, భరతఖండపు స్వాతంత్ర్యమును నిలబెట్టుటకును దేశముయొక్క కీర్తిప్రతిష్ఠలను వృద్ధి జేయుటకును సర్వవిధముల తోడ్పడవలెను. ఇప్పటి క్లిష్టపరిస్థితులలో పరిషత్తునందు చేరక, తాటస్థ్యభావమునువహించుసంస్థానములన్నియు నెహ్రూ చెప్పినట్లు శత్రుదేశములక్రింద పరిగణింపబడవలసినదే.

## రాజ్యాంగ పరిషత్తు

ఏప్రిలు ౨౮ తేదీన ఢిల్లీలో సమావేశమైన రాజ్యాంగ పరిషత్తు చురుకుగా పనిచేయుటకు తీర్మానించుకొన్నది. లీగు ప్రతినిధులు పరిషత్తులో చేరుదురను ఆశ ఇంతవరకు కొంత ఉండెడిది. ఇప్పుడు ఆ ఆశ బొత్తుగా అడుగంటినది. సంస్థాన ప్రతినిధులు కొందరు పరిషత్తులో చేరిరి. ౧౯౪౮ జూన్ నాటికి రాజ్యాంగము తయారై దానిననుసరించిన క్రొత్త ప్రభుత్వము స్థాపితము కావలసియున్నది. బ్రిటిష్‌వారు వారి అధికారమును భారతీయుల పరము చేయుటకు ఇది అత్యావశ్యము. ఈ విషయమును గ్రహించినవారగుట చేత, పరిషత్సభా నాయకులు ౧౯౪౭ అక్టోబరు నాటికే రాజ్యాంగమును తయారుచేయ సంసిద్ధులై ఉన్నారు. అందుకు కావలసిన సంఘములు, ఉపసంఘములు, ఇతర ఏర్పాటులు అన్నీ తయారుగా ఉన్నవి. హిందువులు అధికసంఖ్యాకులుగ నుండు రాష్ట్రములు, మండలములు ఒక కేంద్రప్రభుత్వమునకు లోబడుట జరుగును. పరిషత్తువారు నిర్మించు రాజ్యాంగవిధానము ననుసరించి ఈ ప్రభుత్వము ఏర్పడును. ఇదిగాక మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగ నుండు ప్రదేశములు లీగు ప్రభుత్వముక్రిందికి రాగలవు. ఈ రెంటిలో చేరని సంస్థానములు కొన్ని ఉండును. బీరారు రాష్ట్రము తన పరిపాలనలోనికి రావలయునని హైదరాబాదు నైజాం కోరుచున్నాడు. ఈ క్లిష్టసమస్యను పరిషత్తువారు, బ్రిటిష్‌వారు ఎట్లు పరిష్కరించెదరో చూడవలెను.

## దేశ రక్షణ

౧౯౪౮ జూన్ నాటికి దేశములో ఒక కేంద్ర ప్రభుత్వ ముండదు. అనేకస్వతంత్రప్రభుత్వము లుండగలవు. దేశసంరక్షణకు ఒకే సైన్య ముండుట మంచిదని బ్రిటిష్‌వారు అభిప్రాయపడుచున్నట్లు తెలియుచున్నది. కాని ఇట్లు జరుగుటకు వీలులేదు. ప్రతి స్వతంత్రప్రభుత్వమునకు ప్రత్యేక సైన్య మొకటి ఉండవలెను. పాకిస్థానమును రక్షించుకొనుటకు పాకిస్థాన్ ప్రభుత్వము వారు ప్రత్యేకసైన్యమును తయారుచేసుకొనవలెను. అట్లే తక్కిన ప్రభుత్వములవారుకూడ వారి వారి ప్రత్యేకసైన్యములను తయారుచేసుకొనవలసియున్నది. తమతమ రాజ్యములను రక్షించుకొను విషయములో బ్రిటిష్‌వారి సహాయ మవసరమైనయెడల ప్రతిరాజ్యము ప్రత్యేకముగ ఇందునిమిత్తమై బ్రిటిష్‌వారితో సంధిచేసుకొనవలసివచ్చును. భరతఖండము ఇంగ్లండుమధ్యన ఒక సంధిపత్ర ముండుటకు బదులు ౧౯౪౮ జూన్ నాటికి ఎన్ని రాజ్యము లుండునో అన్ని సంధిపత్రము లేర్పడును. ఇది ఒక దేశరక్షణవిషయముననేగాక, వ్యాపారము, పరిశ్రమలు, సివిల్‌సర్వీసు ఉద్యోగస్థులు మొదలైన విషయములనుగురించి ఉండును. బ్రిటిష్‌వారు మన దేశమునకు వచ్చిన ప్రారంభదశలో, అనగా ౧౭ వ శతాబ్దమందు అవసరమునుబట్టి అనేకరాజులతో వేరు వేరుగ ఒడంబడిక చేసుకొన్నట్లు ఇప్పుడుకూడ వారు అట్లే చేయవలసివచ్చును. దేశము ఈ విధముగ చీలిపోవుట లాభకరమా, కాదా అనునది విషయము.

## మద్రాసు రాష్ట్రము

మద్రాసుశాసనసభవారు ఏప్రిలులో మూడు ప్రధానచట్టములను నిర్మించిరి: రెండు హరిజనులకు సంబంధించినవి; ఒకటి తుంగభద్రాప్రాజెక్టుకు సంబంధించినది. సవర్ణహిందువులకు ఎట్టి పౌరస్వత్వహక్కులు కలవో అట్టి హక్కులు హరిజనుల కుండునట్లు ఒక చట్టము శాసించుచున్నది. రెండవ చట్టమువలన హరిజనులకు దేవాలయప్రవేశము లభించుచున్నది. శాసనముల మూలమున అస్పృశ్యతను నివారించుటకు ఎంతవరకు వీలున్నదో అంతవరకు మద్రాసుశాసనసభ వెళ్లుటకు సిద్ధపడియున్నదని దీనిమూలమున స్పష్టమగుచున్నది. తుంగభద్రా ప్రాజెక్టుచట్టము మూలమున యాభైఎకరములకంటె ఎక్కువ భూమి ఈ ప్రాజెక్టుక్రింద ఏరైతుకు ఉండకూడదని నిర్ణయింపబడెను. సాహుకారీవిధానమును తొలగించి, సామాన్యప్రజల శ్రేయస్సును అభివృద్ధిచేయుటలో ఈ చట్టము ఉపకరించగలదు.

## ఆంధ్ర రాష్ట్రము

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమును వెంటనే నిర్మాణము చేయవలసియున్నదని పరిషత్తువారికి తెలియజేయుటకై ఆంధ్రమహాసభ ప్రత్యేకసమావేశము గత నెలలో మద్రాసునందు జరిగెను. మద్రాసుశాసనసభలో కూడ ఇట్టి తీర్మానమొకటి ఆమోదింపబడెను. కాని ఇంతటితో ఆంధ్రరాష్ట్రము ౧౯౪౮ జూన్ నాటికి నిర్మాణమగునని చెప్పుటకు వీలులేదు. ఆంధ్రమహాసభవారు తీర్మానముచేసిరేగాని ఆ తీర్మానమును అమలులో పెట్టుటకు కావలసిన సాధనసామగ్రినిగురించి ఏమియు ఆలోచించినట్లు అగుపడదు. పరిషత్తునాయకులతో ఇందువిషయమై సంప్రతించుటకు మహాసభతరఫున కొందరు ఢిల్లీకి వెళ్లునట్లు పత్రికలలో ప్రకటింపబడెనే కాని వారు వెళ్లుటమాత్రము జరుగలేదు. ఆంధ్రనాయకులందుగాని, ప్రజలలోగాని రాష్ట్రనిర్మాణవిషయమై నిజమైన ఉత్సాహమును, పట్టుదలయు లేవని చెప్పవలసియున్నవి. మంత్రాలకు మామిడికాయలు రాలునా?

(1-5-47)



# ఆంధ్రుల జానపద శిల్పకళాప్రపంచం

## ౧. ప్రవేశిక



### శ్రీ సుధాంశు కుమారరాయ్ =

అమరావతి నాగార్జున కొండలలోని శిల్పాలూ, అజంతా చిత్రాలూ మొదలైన వాటివంటి ఆంధ్రుల అద్భుతోత్తరకళలను తిలకించే భాగ్యం కలిగినప్పుడు వంగదేశంలోని నాబోటి చిత్రకారులకున్నూ, కళాభిమానులకున్నూ సాక్షాత్తు ఆ భారతశిల్పమాత దివ్య సన్నిధిని, ఆమె పాదాల మ్రోల ఉన్నట్టుగానే ఉంటుంది. ఆంధ్రుల ఈ ప్రాచీనకళలు భారతదేశంలో వివిధ యుగాలయందు వెలసిన ఉత్తమోత్తమ కళలతాలూకు సంప్రదాయాల మూలకందాలవైపును మమ్ములను తీసుకొనిపోతాయి. వాటిని చూచి మేము రంగులలో, రేఖలలో, మలుపులలో, తీరులలో ఉన్నతోన్నతమైన అంతస్తును అందుకొని భారతీయ చిత్రకళాచరిత్రతో గాఢమైన స్మృతి చిహ్నాలను నెలకొల్పజాలినట్టి మన తాతముత్తాతల శేముషీ విశేషాలనూ, వారు సాధించిన కళాసిద్ధినీ చూచి దిగ్భ్రాంతులమై పోతూ ఉంటాము.

కానైతే, దక్షిణదేశంలోని ఇటువంటి ఉత్తమ కళలనే మహావృక్షాల నీడలలో ఎదుగుబొదుగులు లేక, నివురుగప్పిన నిప్పువలె దాగియున్నట్టి జానపద శిల్ప చిత్రకళకు సాక్షాన్నిదర్శనాలుగా ఉన్నట్టి కళాఖండాలవైపునకు మన చిత్రకారులూ, కళాభిమానులూ ఇంతవరకూ సారించవలసిన రీతిగా దృష్టి సారించకపోవడం నిజంగా విచారకరమైనవిషయం. జానపద కారు శిల్పాలవిషయంలో మిక మిక్కిలి సుసంపన్నమైయున్న వంగరాష్ట్రంలోని జానపద కళాశిల్పాలతో పదిహేనేండ్లకు పైబడిన పరిచయం సంపాదించుకొన్న నాబోటివాడే ఆంధ్రదేశంలోని పల్లెపట్టులలో ఉన్న ఈ జానపదచిత్ర శిల్పకళల అపూర్వదృష్టాంతాలనూ, ఎంతనమ్మదామన్నా నమ్మవీలులేని అందలి గుణవిశేషాలనూ, కథలు చెప్పడంలో అవి ప్రదర్శిస్తున్న శక్తి సంపత్తినీ కన్నులారా చూచినప్పుడు అక్షరాలా దిగ్భ్రాంతిపడినాడంటే వాటి మహత్వమెట్టిదో మరి వేరే చెప్పనవసరం లేదు.

ఉత్తరంనుంచి దక్షిణానికివచ్చే ప్రయాణీకులు తూర్పుకనుమలు దాటుకొనివచ్చేటప్పుడు సహజంగా వారి మనస్సులు సుప్రసిద్ధమైనట్టి ఏవోకొన్ని పట్టణాల మీదికీ, సుభ్రగోపురాలమీదకీ మాత్రమే పోతూవుంటాయి. కాని వారుగనక కొంత ఓపికచేసుకొని ఏపల్లెపట్టు స్టేషనులోనో దిగి నాలుగురోజులపాటు ఆచుట్టుపట్టుల పల్లెలు తిరిగి, ఆ పల్లెవాసులతో కలిసిమెలిసి మెలగినారంటే యథార్థమైన జానపదకళా ప్రపంచం—నిత్యనూతనమై దివ్యసుందరమైన కళాప్రపంచం—వారు కన్నుల కరువు తీరా కాంచితీరగలుగుతారు.

అయితే—ఏమిటీ జానపద కళ? దీని సంగతి సందర్భాలేమిటి? అని పాఠకులకు జిజ్ఞాస పుట్టవచ్చు.

ప్రజలు తమకుగాను తాము నిర్మించుకునే కళ ఈ జానపద కళ. నాగరికకళలనేవి పెత్తందారీ అధికారవర్గాల ప్రాపకంతో, వారి రాజపోషణక్రింద తయారవుతూ ఉండి, పరిపాలకవర్గాల పతనోన్నతులమీదనే కేవలమూ ఆధారపడినట్టివై, తన్మూలంగా తాత్కాలిక మతసిద్ధాంతాలను ప్రజలకు మప్పడానికీ, రాజకీయమైన ఏదో దృష్టిపెట్టుకుని చెదురుబాటుగా ఉన్న జనాంగాన్ని పరిపాలకాధికారుల కేంద్రాధికారం క్రిందికి లాగుకొని రావడానికి కావలసిన సందేశ సందర్భాలతో నిండి నిబిడీకృతమై ఉంటాయి. జానపదకళలల్లాంటివి కావు. మతాభిమానాలకూ వీటికి చాలా దూరం. ఐశ్వర్యాధికారాలుగల వ్యక్తుల మనోభావాలకూ వీటికీకూడా చాలాదూరం. అవి కేవలమూ మామూలు ప్రజల నిరంజన నిష్కల్మష భావ వ్యక్తీకరణలు. అందువల్లనే అవి నాగరికులను కాదని తోసివేసి, వారి కళ్లంతదూరాన దేశాలలోని ఏ మారుమూలల్లోనో ఆలనాపాలనా లేక, ఆదరించి హర్షించే నాథుడులేక, పరిపాలకవర్గాలకు వాటి ఉనికైనా తెలుసునో తెలియదో అన్నంతటి ఉదాసీనస్థితిలో కొట్టుకులాడుతున్నాయి. ఆ ఉదాసీనంమాట ఏమయితేనేమిగాని, ఈ జానపద కళలనేవి

ప్రజా సామాన్య హృదయాంతరాళాల్లో నిత్యప్రవాహం చేస్తున్న సాంఘిక ఆర్థిక తరంగపంక్తులు సృష్టించే ఆనందానికి అవి అచ్ఛమైన వ్యక్తీకరణలంటే కాదన డానికి ఎవరికీ గుండెలు ఉండవు. కాబట్టి వారిలో, వారి పరిసరాల్లో పరిదృశ్యమాన మవుతున్న కళలు ఒకరిచే తయారుచేయబడినవి కాక సహజంగా ప్రకృతి నిర్మితంగా, ప్రకృతి శోభకోసం తమంతగా తాము పుట్టుకొని వచ్చినవని మనం గ్రహించవలసి వున్నది. జానపదకళలు మనకు చల్లని హాయినిస్తాయి; ఎరువు తెచ్చిన బాపతుకాకుండా అసలైన ఆనందాన్ని ఆపాదిస్తాయి. మనకు అదీ ఇదీ బోధిద్దామనీ, ఏవేవో తెలియని సంగతులు తెలియజెప్పదామనీ వాటి కెంతమాత్రమూ లేదు. వాటి పరమార్థమలా ఒక్కటే—మనలను సంతోషపెట్టి అలౌకికానందాన్ని మనకు కల్పిద్దామనేది ఒక్కటే వాటి ఏకైకవాంఛ. ఆ ఆనందసంధానం కూడా సహజోద్బుద్ధమైనదే కాని బలవంతాన తెచ్చిపెట్టిన బాపతుకాదు. అంతే కాదు. ఈ జానపద కళలకు స్వపరభేదం కాని, కుల మత వర్గ విచక్షణలు గాని లేనేలేవు. సర్వజనానికీ ఆనందసంధానం చేయడమే వీటిపని; వారూ వీరూ అని లేక అందరికీ హాయి నివ్వడమే వీటి పరమార్థం.

ఈ జానపద కళల స్వరూపస్వభావ విశేషాలను గురించి కలకత్తా విశ్వవిద్యాలయంలో లలితకళాచార్యులైయున్న డాక్టరు నీహార రంజనరాయిగారు వ్రాసిన కొన్ని వాక్యాలను ఇక్కడ ఉద్ధరిస్తున్నాను. నా మాటలకంటే వారిమాటలు ఈ సంగతిని మరింత విశదంగా నిరూపించగలవని నా ఆశయం.

"కళయొక్క రూపాలు దృక్పథాల్లో మార్పులను బట్టీ, పరిస్థితుల ననుసరించీ, శైలీసంవిధానాలపద్ధతుల ననుసరించీ యుగానికీ యుగానికీ మారుతూవుంటాయి. అయితే, జానపదకళమట్టుకు ప్రాకృతికమైనట్టిన్నీ, జీవశాస్త్రానికి కట్టుబడినట్టిన్నీ ఒకానొక సూత్రం చెప్పుచేతలప్రకారంగా ఏకైకరూపానికి తీసుకొని రాబడినది. యుగానికి యుగానికి అది మారడంలేదు. ఒక కుటుంబవర్గంలోని ఒక తరంతాలూకు ఎన్ని శిల్ప రచనలను చూచినాకూడా రచనస్వరూపాలూ, శైలీ విన్యాసాలూ, రంగుల అనుక్రమణికాకూడా ఒకదాని కొకటి నకలేమో అనిపించేటంతగా పునరావృత్తమైఉంటాయి. కాని నిజానికి ప్రతిదీకూడా ఏదో ఒక ప్రత్యేక వ్యక్తిత్వంకలిగి దేనికది వేరువేరుభావాలను, వేరువేరు విచ్ఛిత్తి విశేషాలను కల్పింపజాలిఉంటాయి. దానిలోని విశిష్టత అల్లా దాని నిరాడంబరతలోనే నిక్షిప్తమై ఉంటుంది. జానపదకళ అన్నది అనునిత్య జీవితానికీ, ఆ జీవిత ప్రవృత్తులకూ అతీతమైనట్టిదేదో కాదు. దాని పరిసరాలనుండికనక దానిని ఆవలికి తీసుకొని పోతిమా అది దాని అందాన్నే పూర్తిగా కోల్పోతుంది. మన నాగరిక జీవితంవంటి విచిత్ర వాతావరణంలోకి గనక దాన్ని తీసుకొనిపోతే అది సరిగా ఊపిరాడక తికమక పడుతుంది. అవి వ్యక్తీకరించే కథలుకూడా గ్రామీణ ప్రజల తాలూకు జీవవాయువులుగా ఉంటాయి. ఈ కథలమేరకు వారు ఏడుస్తారు; నాట్యంచేస్తారు; కోపావేశంతో ఉద్వేగ్తులేస్తారు; నిర్వేదంతో చల్లబడి పోతారు. జానపదకళ తాలూకు వేళ్లు నిలువదొక్కుకొనివున్నది ఈ భావబలంలోనే. అందుకనే ఈ జానపదకళ అనేది రూపంలోనూ, భావంలోనూ చాలా సాధారణంగా ఉన్నప్పటికీ, భావవ్యక్తీకరణలో మహా పటువుగానూ, వాతావరణ కల్పనలో బహు సజీవంగానూ ఉంటుంది. ఇందువల్లనే, జానపదకళ యావత్తు చిత్రకళాప్రేమికుల పాలికిన్నీ ఏదో ఒక అజరామరమైన ప్రాముఖ్యాన్ని చాటుతూఉంటుంది. మొత్తానికి అది ప్రజాసామాన్యంయొక్క జవజీవాలను అచ్ఛంగా ప్రతిబింబింపజేసే ఒకగొప్ప అద్దమనిచెప్పనైయున్నది."

ఏతావతా, ఒకజాతిని మనం సంపూర్తిగా, సరిగా అర్థం చేసుకోవలెనంటే వారి కళలను మనం సాకల్యంగా, జాగ్రత్తగా పరిశీలించవలసి వుంటుంది. నాగరిక కళలు నగరవాసులను గురించిన విశేషాలను ఎలా వ్యక్తంచేస్తాయో అలాగే గ్రామీణ కళాకారు శిల్పాలు గ్రామీణ ప్రజలను గురించిన విశేషాలను వ్యక్తం చేస్తాయని నా విశ్వాసం. జానపద వాఙ్మయం, జానపద నాట్యాలు, జానపదచిత్ర శిల్పకళలు—ఇత్యాదుల అధ్యయనంవల్ల ఆంధ్ర ప్రజాసామాన్య హృదయాల అసలైన స్వరూపాన్ని మనం ఇట్టే గ్రహించవచ్చు. కాని ఇది బహు విశాలమైన క్షేత్రం. ఈ కార్యం గనక మనం సత్రమంగా సాగించవలెనంటే, నెలలు, సంవత్సరాలు కాదు—తరాలు కావలసివస్తుంది; స్వార్థచింతలేక ధనాపేక్షలేక దేశీయకళావికాసానికి పాటుపడగల నిష్కామకళాసేవకులుకూడా తండతండాలుగాకావాలి. ఇప్పటికే మనదేశం పరాయిదేశాలవారి పెత్తందారీతనంలో మునిగి తేలుతున్నది. వారు స్వార్థచింతతో. వట్టి యాంత్రికమైనట్టిన్నీ, జీవంలేనట్టిన్నీ నాగరికతకోరిట మన గ్రామజీవిత సౌభాగ్యాన్ని నెళ్లంటా రూపుమాపడానికి సర్వవిధాలా పాటుపడ్డారు; ఇంకా పాటుపడు

తూనూ ఉన్నారు. వారిపాలినుండి మన మా గ్రామజీవిత సౌభాగ్యాన్ని సర్వవిధాలా కాపాడవలసి వున్నది.

ఇటువంటి ప్రజాహితమైన, ప్రజాజీవిత ప్రరోచకమైన కళలను పునరుద్ధరించి, ఆధునిక నాగరికత మూలంగా సంప్రాప్తమైన నైరస్య వైరస్యాలను తొలగించి, ప్రజల చిత్తవికాసానికి తోడ్పడగలందులకై ఇప్పుడు అమెరికా మొదలైన దేశదేశాలలోనూ విశ్వప్రయత్నాలు జరుగుతున్నాయి. రష్యాలో కూడా దీని విలువ గ్రహింపబడింది. ఇంకటనైనా మనం మేల్కొని మన జానపదకళలను మనమూ ప్రోత్సహించి ఆదరించాలి.

బెంగాలులో మహామహులైన డాక్టరు అవనీంద్రనాథ టాగూరు, డాక్టరు దినేశచంద్ర సేన్, గురుసదయ దత్తావంటివారు ఉండి, అక్కడి గ్రామీణ కళానిక్షేపాలను తమ అకుంఠితమైన కృషిమూలంగా వెలుగుకు తెచ్చి పుణ్యం కట్టుకొన్నారు. ఇలాగే ఆంధ్ర దేశంలో కూడా కొంతమంది కళాభిమానులు (శ్రీ కోల వెన్ను రామకోటీశ్వర రావు, శివలెంక శంభుప్రసాదు గార్లవంటి పత్రికాధిపతులూ, గుర్రం మల్లయ్య, తేజోమూర్తుల కేశవరావు గార్లవంటి కళావేత్తలూ) ఆంధ్ర జానపద కళల పునర్వికాసానికై ఎంతో పాటు పడుతూ వుండడం చూచిన నాకు చాలా ఆశావహంగానే ఉన్నది. స్థానిక ప్రభుత్వంకూడా గ్రామీణ కళాకారు శిల్పుల ప్రోత్సాహానికై ఒక ప్రత్యేక వ్యాపారశాఖను నిర్వహిస్తూ వున్నది. అయితే ఒకటి — ప్రభుత్వంవారి స్పృశ్యతగిలితే సరి సహజమైన తన జిలుగు వెలుగులను పోగొట్టుకో జాలిన పాపకు దీ జానపదకళ. దృష్టాంతం కావలిస్తే మైసూరు చందనపరిశ్రమనే చూడండి. ప్రభుత్వంవారి అదుపులో ఉండబట్టి వెనుకటికంటె అది ఆర్థికంగా బలపడితే బలపడి ఉండవచ్చుగాని దాని సహజమైన కళాపటిమను, కళాజీవాన్నిమటుకు అది కోలుపోనే కోలుపోయింది.

అతి ప్రాచీనకాలంనుంచి ఎడతెగని ప్రవాహంలో కొట్టుకొనివచ్చి మన కందజేయబడిన ఈ జానపదకళల జీవత్సంప్రదాయాలను మనవారు సర్వథా ఉపేక్షించినారు; వాటిసంగతే మరచినారు; అవి మన జాతి తాలూకు గొప్ప కళా ఖండాలన్న విషయం కూడా వారు గ్రహించినట్టు తోచదు

శ్రీ శంభుప్రసాదుగారి పుణ్యమా అని వారు సేకరించిపెట్టుకొని యున్న కొన్ని చక్కని కొండపల్లి బొమ్మలను సావధానంగా చూచేభాగ్యం నాకు కలిగింది. ఆంధ్రదేశంయొక్క ప్రకృతి స్వభావాలనూ, ఆంధ్రప్రజల చిత్తప్రవృత్తులనూ నిరూపిస్తున్న ఈ కొండపల్లిబొమ్మలు ఆంధ్రదేశంలోని జానపదకళలకు ప్రశస్తమైన దృష్టాంతాలని నేను ఘంటాఘోషంగా చెప్పగలను. ఆంధ్రుల కొన్ని ముగ్గుతరహాలను కూడా నేను చూచాను. అవికూడా ఈదేశంయొక్క కళాశీల సంపత్తిని వ్యక్తంచేస్తున్నాయి. "దేశంయొక్క కళ తద్దేశవాస్తవ్యులగుణ శీలాలవలెనే ఆ భూమియొక్క ప్రకృతి స్వభావాలకు గట్టిగా సంబంధించి ఉంటుంది. శీతోష్ణ పరిస్థితి, ప్రకృతిశోభ, ఆయాదేశాలసైజ విభిన్నత— ఇవి అన్నీ ప్రజను నానావిధాలుగా ఉత్తేజింప జేసి అలంకరింపజేసేటట్లే కళోత్సాహాన్ని కూడా ఉత్తేజింపజేసి అలంకరింపజేస్తాయి. ప్రపంచంలో ఏవి ఉత్తమమైనవస్తువులు అనే ప్రశ్నకు తావులేదు. దానిదాని పరిస్థితులను బట్టి దేనికది ఉత్తమంగానే ఉంటుంది. అదే ఇతరపరిస్థితుల్లో అనను కూలంగా ఉంటుంది. అలాగే కళావిషయంలో కూడా. వర్ణ రచనా విన్యాసవిధానాల్లోనూ, రూపరేఖల్లోనూకూడా కొండపలి బొమ్మల నిర్మాతలు ఉన్నతమైన అంతస్తును అందుకొన్నారు. ఈ బొమ్మలను ఉపయోగించిన రంగులు చాలా విస్పష్టంగానూ, విశుద్ధంగానూ ఉండి, పరిసర ప్రకృతినుండి లభ్యమైన అర్థసంపత్తితో నిండి నిబిడీకృతమై రాణిస్తున్నవి. వీటిలో ప్రతిఒక్క బొమ్మాకూడా నగ్నమైన దివ్యరూపవైభవంతో తన్నిర్మాతల కళాభిరుచిని చిత్రవిచిత్రాలుగా ప్రదర్శిస్తూ మనకు సాక్షాత్కరిస్తుంది. అది మనపాలికి ఒక వ్యాపారవస్తువు కానేకాదు. అది ఒక్కొక్కటీ ఒక్కొక్క కళాఖండం. సందేహం లేదు. వాటిని ఎంత చూచినా తనివితీరదు. అవి మనలను ఏవేవో ఆనందలోకాల్లోకి తీసుకొనిపోతూవుంటాయి.

దేవుడు గనక దయతలిస్తే, ఆంధ్రుల జానపద కళాప్రపంచంలోకి త్వరలోనే ప్రవేశింపగలనని నేనెంతో ఉవ్విళ్ళూరుతున్నాను. ఆ ప్రవేశానికి మొదటి మెట్టుగా తొట్ట తొలిలోనే ఈ గొప్ప బొమ్మలనూ, ముగ్గులనూ చూడ గలిగినందులకు నేనెంతో మురిసిపోతున్నాను.

# మహనీయమైన మన ఆంధ్రదేశం

**అప్పలస్వామి** =

యాభైవేల ఏళ్లకు ముందు యూరపులో 'నియాండర్థలు' (Neanderthal) మానవుడు ఆవిర్భవించిన నాటికే మన కడప, కర్నూలు, గుంటూరుమండలాలలో ఆదిమానవుడు గుహలలో నివాస మేర్పరచుకున్నాడు. ఆంధ్రప్రశస్తి వేదకాలానికి ముందునాటిది. ఐతరేయ బ్రాహ్మణము మన ప్రసంగం ఘోషించింది. వైదిక, గ్రీకు వాఙ్మయాలలోని మన భాషాపదాలూ, ఆస్ట్రేలియా, ఫిన్నిషు భాషలతో మన భాషకు గల పోలికలూ మన పౌరాతన్యము మనం వినకపోయినా చాటుతూనేవున్నాయి. పదివేల సంవత్సరాలకు పూర్వమే ఆంధ్రులు వలస వచ్చినారని అబినాశచంద్రుడు వాదిస్తున్నాడు.

సప్తర్షిమండలం కృత్తికలో వున్నప్పుడు' అంటే-మూడువేల ఏండ్లకు ముందు-కాదు, అయిదు వేల ఏళ్లకు ముందే మన ఆంధ్రసామ్రాజ్య మేర్పడినట్లు పురాణాలు నిరూపిస్తున్నవి. చంద్రగుప్తుని కాలమప్పుడు మహాంధ్రసామ్రాజ్య మున్నమాట మెగసనీసు సాక్ష్యమిస్తున్నాడు. 'ప్లినీ' అదే అంటున్నాడు. అశోకుని కాలంలో కూడ మన నాగరికత మహోన్నతశిఖరాలలో పూలకారులు విరిసింది.

తరవాత ఆంధ్రచక్రవర్తులు విశాల మగధ సామ్రాజ్యం జయించి పరిపాలించారు. నేపాళమును వశపరచుకున్నారు. ౪౫౬ సంవత్సరాలు నిరంకుశమయిన ఆంధ్ర ప్రతాపము దిగ్దిగంతాల దిగ్భ్రమపరచింది.

ఉత్తరమున మగధ, నేపాళములు, పశ్చిమమున మహారాష్ట్రము, దక్షిణాన సింహళము వరకూ గల కర్ణాటదేశాలు శతాబ్దాలతరబడి ఆంధ్రపతాకంక్రింద పెంపొందాయి. ఉత్తరాన పాటలీపుత్రము, దక్షిణాన ధాన్యకటకము ఆంధ్రుల రాజధానులైనవి.

ఆ నాటి ప్రచండమయిన మన నావికాదళము పూర్వ పశ్చిమ సాగరాలమీద ప్రభుత్వం స్థాపించింది. ఆంధ్రనావలు రోమక, పారశీక, ఈజిప్తు, చీనా, బర్మా, సింహళ, జావా, కాంబోడియా ఆది దేశవిదేశాలలో వాణిజ్యము నెరపాయి. నేలమీదినుండీ, నీటిమీదినుండీ పోయి మన ఆంధ్రవీరులు ఇండో-చైనా బర్మా, జావా, సుమత్రా, కాంభోజదేశాలు జయించి విస్తృతమయిన మహాంధ్రసామ్రాజ్యము స్థాపించినారు.

పసిఫిక్ దీవులందలి ఆంధ్రలోయ, నాశిక ప్రాంతపుగుహలు, బర్మాలోని తైలంగులు, నేపాళములోని తులుంగులు, మహారాష్ట్రములోని తిలాంగులు, జావాలోని తోలుబొమ్మలాటలు, ఒరిస్సా ఋశభద్రా తీరములోని ఆంధ్రబ్రాహ్మణుల ఉనికి చిహ్నాలూ అప్పటి విశాలాంధ్ర సామ్రాజ్యానికి మూకసాక్ష్యాలు.

బౌద్ధమతము ప్రబలమైనప్పుడు ఆంధ్రావని బౌద్ధమయమే అయిపోయింది. అమరావతీ, నాగార్జునకొండ బౌద్ధవిహారాలు జైత్రత్వము వహించాయి. చరిత్రలో యివి సువర్ణాక్షరాలు గడించుకొన్నాయి. టిబ్బెత్తు డూహాంగ్ విద్యాపీఠానికీ, సింహళ అనూరాధపుర బౌద్ధాలయానికీ, జావా బోరోబుదూరు శిల్పానికీ, ఆంధ్రుల అమరావతి, నాగార్జునకొండల శిల్పాలు ఒరవడి పెట్టాయి.

రోమక, పారశీక, ఐగుప్త, జావా, సుమత్రాది సుదూరదేశాల నౌకలు తమ రంగురంగుల జెండాలు ఎగురవేస్తూవచ్చి కృష్ణా, గోదావరీ తీరాల కౌనక్కాలం దించిన దినాలు ప్రాతఃస్మరణీయాలు. అమరావతిలోని విశ్వవిద్యాలయకీర్తివల్లికలు జగత్తునిండ అల్లుకున్నాయి.

నాగార్జునకొండ, శ్రీశైలము కేంద్రాలుగా సిద్ధని నాగార్జునాచార్యుడు బౌద్ధమున మహాయానమార్గమును, స్థాపించిన చరిత్ర వ్యాప్తమైనది.

యశోలిప్సలేని ఆంధ్రశిల్పులు తమ శిల్పభారతిని దేశదేశాల తాండవింపజేశారు. ధాన్యకటకము, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, గంటసాల, నాగార్జునకొండ మొదలైనచోట్ల క్రీస్తుపూర్వమే ఆంధ్రశిల్పము మధురనృత్యము నెరపింది. సాంచీస్తూపద్వారాలలో, నాశిక, అజంతా, ఔరంగాబాదు, ఉండవల్లి, గుడిమెలము, ఎల్లోరా ఆది గుహలలో ఆంధ్రశిల్పుల కళాకౌశలము దివ్యవిన్యాసాలు వర్షించింది.

పల్లవరాజులు వేంగిని రాజధానిగ జేసికొని ఆంధ్రమునేలిన దినాలలో మన ఆంధ్రదేశము కంచివరకూ వ్యాపించింది. వేంగి మనకు పవిత్రక్షేత్రమైనది. మహాబలిపుర గోపురాలు స్మృతిచిహ్నాలైనవి.

రాజమహేంద్రవరము రాజధానిగ చాళుక్య నరపతులేలిన ఉజ్వలచరిత్ర, హర్షవర్ధను నంతటి వానికి అజేయమై నిలిచిన మన ప్రతాపదీప్తిని గోదావరి తరంగహస్తాలెత్తి మహాగానం చేస్తున్నది.

కాకతీయులు ప్రభువులై ఓరుగల్లు రాజధానిగ జేసుకొన్నారు అపుడు మనవారు ఘూర్జరదేశాన్ని జయించి పాలించారు. ఓరుగల్లులో ఆనాడు నెలకొన్న ౭౭ బురుజుల ౩౦ మైళ్లప్రాకారమూ, ౬ మైళ్లవిస్తీర్ణమయిన ౭ కోటల మహాదుర్గమూ, ౧౩ చదరపు మైళ్లప్రాకాల చెరువూ మన శత్రువుల గుండె లదరించింది.

మహోన్నతమయిన స్వర్ణయుగాలు చవిమాపిన విజయనగర సామ్రాజ్యలక్ష్మి, ఈనాటి హంపీ శిధిలాలలో మూలుగుతున్నది. రెడ్డిరాజుల పద్మనాయకుల ప్రతాపాగ్ని తరతరాల ఆంధ్రజాతిని ఉడుకెత్తిస్తుంది.

మన భాష సరళాదేశమై, అజంతము కలిగిన మృదుభాష. దేశబాసలందు మన బాస లెస్స. 'తూర్పు ఇటాలియను' అని పాశ్చాత్యులు తలలూపిన బాస. చాందాలోని 'కోమటౌ, సాలేవారీ, గోలం, బెల్గాంలోని బేరడీ, దాసరి, బొంబాయిలోని కామాటీ, పడరీ తమిళనాటి వడుగు, పోర్చుగీసుల 'గెంటూ,' మన బాసకు మారుపేర్లు.

అఖండ హిందూస్థానంలో ఆంధ్రము వినరా రాష్ట్రమేలేదు. బర్మా, బెలూచిస్థానము, నేటాలు మోరిసు, ఫిజీ దీవులాది ఖండాంతరాలలో సైతము ఆంధ్రపుత్రు లున్నారు. గంజాంనుండి సేలంతుదివరకూ, నైజాం తూర్పుమండలాలూ, మైసూరు కోలారుజిల్లా, మధ్యరాష్ట్రాల చాందామండలం, బస్తరు సంస్థానం బీరారు, బీహారుల కొలదిభాగాలూ, కటకం, పూరీ, ఒరిస్సాసంస్థానాల కొన్నిపట్లు, బంగనపల్లి, సాందూరు సంస్థానాలూ మన ఆంధ్రభాష కాటపట్లు.

ఆంధ్రులు కన్నడ వాఙ్మయానికి ఆదికావ్యాలు సంతరించారు. ఉత్కల కావ్యనాయికలకు కుచ్చెళ్లు సవరించారు. రాజపుతానా దర్బారుల్లో కవితసెప్పి లక్షలార్జించారు. మొగలుహజారంలో వలపుకత్తెనర్తించారు.

కవిసమాజాలమధ్య, రాజరాజు ఆస్థానంలో భారతామ్నాయము నవతరింపజేసిన నన్నయభట్టు గంభీరకంఠం గోదావరిలో ప్రతిధ్వనిస్తున్నది.

సోమయాజి తిక్కన ఆంధ్రావళి మోదముంబారయ దీక్షపూనిన పుణ్యముహూర్తం ఆంధ్రజాతి బ్రతికివున్నంతవరకూ గుబాళిస్తూనే వుంటుంది. ఘనుడనని గద్దించిన భీమకవి వజ్రఘోష మన చెవుల్లో సింగురు మంటూనేవుంది. వాణిని రాణిగ పిలిచిన పినవీరన, స్వర్ణాభిషేకాల సార్వభౌముడు శ్రీనాథుడూ, దారిద్ర్యము సేవరించి ధరాధిపులను అధములని తృణీకరించిన పోతరాజూ మన మధ్య తిరుగాడుతూనే వున్నారు. విద్యానగర పురవీథుల్లో, కృష్ణరాయలే పల్లకి పట్టి ఎత్తగా, బిరుదయిన కవిగండపెండేరము కాలదొడిగి పితామహుడు పెద్దన్న పూరేగిన స్వర్ణదివసాలూ. పెద్దాపుర రాజన్యమండలిలో 'ఈ రాజులు రాజులా?' అని ఎెకసదంగా అడిదలకవి ఈసడించిన ముహూర్తాలూ, 'ముత్తునా ముత్యాల సరము'లని గురజాడ వాల్మీకి సంకల్పించిన అమృతక్షణాలూ, ఓహో, అందమయిన మన ఆంధ్రదేశానికి నవజీవనం కల్పిస్తూనే వున్నాయి. కల్పిస్తూనేవుంటాయి.

# ప్రణయజ్యో

[ నాటిక ]

## = శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు

జీవనపథం

[అడవిలో పొదరింటి నీడలో సావిత్రీ-సత్యవం.]

సావిత్రి—మన ఇరువురికీ పరిణయబంధం ఏర్పడిందన్న సంతోషంలో ఈ పొదరింటి తీవలు మాపండి మనపైన పుష్పవృష్టి కురుస్తున్నాయి!

సత్యవంతుడు—ఎందుకో పూలల తలకీ సంతోషం!

సావిత్రి—(వినిపించుకోనకపూర్వమే) అంతకంతకు అల్లుకొని పోతూన్న మన ప్రణయవల్లీమతల్లికను చూచి వినోదంకొద్దీ ఈ పక్షులు కంఠాలెత్తి కిలకిలారావాలు చేస్తున్నాయి!

సత్యవంతుడు—ఎందుకో పక్షుల కీవినోదం!

సావిత్రి—మనం ఇరువురం ఐక్యమయినామన్న ఆనందంకొద్దీ...ఆ మేఘాలు చూడు...చిత్రమైన రంగులు పులుముకొని, అందంగా అలంకరించుకుని, వచ్చి సంధ్యాదేవికి సొగసులు తీరుస్తున్నాయి... అది చూశావూ!

సత్య—ఎందుకో మేఘాలకు అంత ఆనందం!

సావి—అదేమిటి? ఆనందం వాటికి కాకపోతే మరెవరికీ?

సత్య—నీకూ...నాకూ...

సావి—ఏం? ఏం? మీకూ నాకూ మాత్రమే ఎంచేతో?

సత్య—మన ఇరువురికీ పరిణయం అంటే సత్యం జ్యోతిర్మయమై, సాకారమై, సాక్షీ గోచరం అవుతూంది అన్నమాట!

సావి—అబ్బా! ఎంత అందమైన...బరువై, సత్యం చెప్పారూ!

సత్య—కాదూ మరి! సావిత్రీ, నువ్వు నీ అమాయికత్వంతో అతిశయించిన అందంతో...నాకీ వేళ ఎలా కనిపిస్తున్నావో...చెప్పమంటావా?... కాల్చిన కత్తి మొనలాటి దీపకళికలా...కళ్లు మిరుమిట్లు గొలుపుతున్నావు...ఇవాళ మరీనీ!

సావి—(తనలో) ఈయనకా...సత్యానికా... మరణం? అసాధ్యం! అసంభవం అసలు! ఈ ప్రపంచం అంత మిధ్యకాదు! మాటలో అమృతం! చూపులో అమృతం! స్పర్శలో...తనువులో అణువణువులో అమృతభాండం కూర్చుకున్న...ఈయనకా?...అమృతానికా మరణం?

సత్య—ఏం సావిత్రీ, మాటాడకూరుకున్నావు? అకస్మాత్తుగా నీలో ఇంత యోచనకూ, జిజ్ఞాసకూ కారణం?

సావి—ఏమీ లేదు. మీలోని సత్యాన్ని నాలోని ప్రణయజ్యోతిస్సు లోకాని కెలా వెల్లడిచేయగలుగుతుందా అని...ఆలోచిస్తున్నాను.

సత్య—ఆలోచన చేసేటప్పుడు కనులు మూసుకుని ఉండికూడా...ఏదో...చూస్తున్నట్టే ఉంటావు నువ్వు! కాని, నేను...నేను కళ్లుమూసుకుంటే ఏ మవుతుందో తెలుసా...నాకు...అంతా చీకటి! ...పెనుచీకటి!

సావి—మీ హృదయాన్ని నా హృదయానికి సన్నిహితంగా...ఇంకా సన్నిహితంగా చేర్చండి.

(ఆలింగనం)

సత్య—(కనులు మూసుకుంటూ) అహా!... సావిత్రీ!...నీ హృదయంలో ఎంత శాంతి ఉందీ!

నన్నింకా నీ సమీపానికి చేర్చుకొని, నా చుటూ జ్యోతిర్వలయ ప్రాకారాలతో అంతులేని ఒక కాంతి కోట కట్టు. నిరంతరం నన్ను వెంటనంటే ఈ నీడ నాకు కనబడకుండా చేసివేయగలవా నా సావిత్రీ!

(సావిత్రీ సత్యవంతుల గాఢాలింగనము)

## మృత్యు పథం

[కీకారణ్యం....సత్యవంతుడు తరువు నరికి.... తడబాటుగా సావిత్రిని సమీపిసాడు.]

సత్య—సావిత్రీ! సావిత్రీ! చెట్టు కూల్చి వేశాను, కాని నీడ నాశనము కాలేదు. నీడను నిర్మూలించేలోగా...ఏదో క్రొత్త నీడ...నా నీడనూ, నా శరీరాన్నీ కూడ ఆక్రమించుకుని నన్ను మూర్ఛిల్ల జేసేస్తూంది! సావిత్రీ! నా సావిత్రీ! (పడిపోతాడు)

సావి—ప్రభూ! నా ప్రభూ! ఏమిటిది? అయ్యో! ఎందు కంత కలవరపడుతున్నారు? (త్వరగా భర్త శిరస్సును తన ఒడిలోకి వాల్చుకొని....భ్రాంతితో) ఎవరు నీవు?

(దూరంగా నీడలా నిలబడిన యముడు సాక్షా

యముడు—నేను!...యమధర్మరాజును!

సావిత్రి—నిన్ను కాదు నేను పలకరించింది.

యముడు—మరెవరిని? ఇంక యెవరున్నారు ఇక్కడ?

సావిత్రి—నీ బ్రతుకుకి కారణంగా నీ వెనుక ఉన్న మహాజ్యోతిని.

యము—నా వెనుక నొక మహాజ్యోతి ప్రకాశిస్తూందా?

సావి—లేకుంటే నీవు....అంత నల్లగా....సంధ్యారాగం ఎదురుగా కనిపించే మోడు మ్రానులా... ఉండి పోవడం ఎందుకు సంభవిస్తుంది?

యము—ఏమిటీ! నన్ను శపిస్తున్నావా?

సావి—నా కేమి పని? జ్యోతిర్మయ మైన సత్యాన్ని నీడలు ఆవరించలేవు అని నీకు తెలియ జెపుతున్నాను.

యము—ఎవరు నువ్వు? నన్నూ, నా ఆస్తి కాన్నే శంకిస్తున్నావా? ఎవరు నువ్వు? నన్ను శపిస్తున్నావా? ఏమిటిది!...నా శరీరం ఇలా కరిగి పోతూం దేమిటి! (వెనుదిరిగి మృత్యుముఖమున అంతర్ధానం.)

## పునరుజ్జీవన పథం

సత్య—(నిద్రలోంచి లా లేచి) నా హృదయ జ్యోతీ!

సావి—ఎలా ఉంది మీకు? కొంచెం విశ్రాంతి తీసుకోండి.

సత్య—నా ప్రాణకాంతీ! నా సావిత్రీ!

సావి—నాలో ఇప్పుడు క్రొత్తగా వచ్చిన మార్పేమి ఉన్నదండీ?

సత్య—లేదు సావిత్రీ లేదు......నేను నీలోని సత్య జ్యోతిని ఇప్పుడే...నిజంగా...కన్నంతా విచ్చి చూడగలుగు తున్నాను.

సావి—(అర చిరునవ్వుతో) కాదు కాదు. మీలోని సత్యాన్నే నేడు నేను మనసారా గ్రహించగలిగాను.

సత్య—నీలోని ప్రణయజ్యోతిః ప్రభావం అపరిమితం. అది మృత్యువును జయించింది.

సావి—మీలోని సత్యజ్యోతికి గల ప్రభావం అఖండమైనది,......అది అమృతస్నపితం,...కనుకనే మృత్యువును పరాభూతంచేసి సత్యాన్ని వెలయించింది.

సత్య, సావి—(గీతం)

కాంతి సంద్ర మ్మొక్కటే<br>
కాంతి లోక మ్మొక్కటే<br>
వెలుగు వెల్లువ.<br>
గట్లు చెదిరిచి<br>
వెలుగులోకపు<br>
మెట్లు సడలిచి<br>
వెలుగు సంద్రపు టలల కలలను<br>
స్వేచ్ఛగా తేలేటి పూలకు<br>
కాలమే లేదు.<br>
అవ<br>
కాశమే లేదు.

(తెర)

# కలగూరగంప

## సంగీత సూత్రము

భారతీయ ఋషులు సంగీత విషయంలో గొప్ప నిధ్యానమును, శ్రద్ధనూ ప్రదర్శించారు. నారద-భరత-హనుమదాదుల సంప్రదాయములు కూడా వేరు వేరుగా భారతదేశంలో ప్రసిద్ధి పొందినవి. పూర్వకాలములో సంగీతశాస్త్ర గ్రంథాలు చాలా రచితములయినవి. తరువాత వచ్చిన వాదయుగంలో సంస్కృత పండితుల హస్తమునుండి ఇతరశాస్త్రాలు జారిపోయినట్లే సంగీత శాస్త్రముకూడా జారిపోయింది. కేవలము వాదరంగ స్థలానికి సంబంధించిన తర్క వ్యాకరణాది శాస్త్రాలు మాత్రమే మిగిలినవి. నేటి పండితుల దృష్టిలో సంగీతాభ్యాసము హేయమయింది. సంగీతరత్నాకరము, సంగీతామోదము మొదలయిన సంగీత విషయక సంస్కృత గ్రంథాలను సంస్కృత పండితులే రచించారు. వేదాంతములో బ్రహ్మసూత్రా లున్నట్లు సంగీత శాస్త్రంలో సంగీత సూత్రము లున్నవని ప్రస్తుత కాలంలో తెలుస్తున్నది.

ఇతర శాస్త్రాలకు ఆర్షసూత్రా లున్నట్లు సంగీత శాస్త్రానికిన్నీ ఉన్నవి. బ్రహ్మసూత్రాలకు "అథా తో బ్రహ్మజిజ్ఞాసా" అని ప్రారంభము. సంగీతసూత్రాలకు "అథా తః సంగీతజిజ్ఞాసా" అని ప్రారంభము. సంగీత సూత్రాలకు జయగోపాలభట్ట పండితుడు "చింతామణి" అనే టీక రచించాడు. ఈ టీకాసహితమయిన సంగీత సూత్ర గ్రంథములోని చివికి చినిగిపోయిన రెండు పత్రాలు దొరికినవి. ఇంకా ఎవరికీ ఈ గ్రంథం దొరికినట్లు తెలియలేదు. ఇప్పటికి దొరికిన సంగీత గ్రంథాలలో కాని వాని టీకలలో కాని ఈ గ్రంథస్మరణం లేదు. జయగోపాలభట్ట పండితునకు సంగీతసూత్రగ్రంథమంతా దొరికి ఉంటుంది. లేకపోతే టీక ఎట్లా వ్రాస్తాడు? జయగోపాలభట్టు వెలనాటి తెలుగుబ్రాహ్మణుడు. వల్లభ సంప్రదాయ దీక్షితుడు.

సంస్కృత సాహిత్య మహాత్మ్య సూచకములు అయిన సంగీతసూత్రాలు వృథా విలయం పొందవలసినదేనా? శీర్ణ జీర్ణ గ్రంథాలను వెదకడానికి ఇది తగిన సమయము. వెనకటికాలంలో పూర్వపుస్తకాలను దాచిపెట్టడమే పురుషార్థ మనుకునేవారు. చాలా కష్టపడి పురాతన మహనీయులు రచించిన మహాగ్రంథాలు ఇంకా పురుగులకు ఆహారం కావలసిందేనా? ఎవరికయినా ఉపకరించుతవి. వాటిని బయటపెట్టండి. పెట్టించండి. సంగీతసూత్ర గ్రంథములోని దొరికిన రెండు పత్రాలు ఇక్కడ ప్రకటిస్తున్నాను. సంపూర్ణ పుస్తకానికి యత్నించండి.

శ్రీః

ప్రణమ్య వల్లభాచార్యాన్
తత్సుతాన్ విఠలేశ్వరాన్,
కురుతే జయగోపాల
శ్చింతామణి ముదారధీః

ఇహ ఖలు భరతాదిమున్యనుగ్రహపూర్వకత్వేన తైః పృష్టా సాహిత్యమూలభూతం సంగీతశాస్త్ర సూత్రం అధ్యాయపంచకేన భగవతీ సరస్వతీ ప్రాహ.

### అథాతః సంగీత జిజ్ఞాసా

అథశబ్దస్య స్వయం మంగలరూపత్వాత్ ఆనంతర్యార్థే అధికారార్థేవా అథశబ్దః. ఆనంతర్యంతు ముఖ్యత్వేన అలంకారశాస్త్ర నిరూపణానన్తర్య మవధేయం. అధికారార్థకత్వంతు సంగీతే ముముక్షూణాం అధికారస్య వ్యవస్థాపయిష్యమాణత్వేన "తేన బ్రహ్మాధిగమః" ఇతి సూత్రే ప్రతిపద్యతే. అతఃశబ్దః హేత్వర్థః. యతః అన్యత్ర అలంకారాదౌ రసస్య నిరూపితత్వేపి ఉదాహరణస్య అపరోక్షానుభవాభావః. అత్రతు న తథా అతో హేతోః జిజ్ఞాసా. గీయతే ఇతి గీతం భావే క్తః. సమస్తవిశేషార్థః తత్ర సవిశేషస్తు సమభివ్యాహరిష్యమాణ త్రితయ

రూపః. తేన న అగ్రిమసూత్ర విరోధః, ఇతి వయం బ్రూమః— అత్ర దీపికాయాం శార్ఙ్గదేవాచార్యాః— గీయతేఅనేనేతి తాయాలాపచాల్యాసినా కరణభూతేన. కరణే క్తః. తత్ర సమ్యక్త్వంతు రంజకస్వరసం దర్భ రూపత్వం ఇత్యాహుః. ఇదమేవ అభిసంధాయ శాస్త్ర దర్పణకారః కల్లినాథోప్యాహ. సమ్యక్త్వం జనాది హృదయరంజకత్వే నైవ...............

ఇటుపై పుటలు లేవు. తరువాత ఏడవపుటనుండి ఈవిధంగా ఉంది.

పరస్పరవిరోధః కథం పరిహర్తవ్యః ఇతి వాచ్యం పూర్వోక్తశ్రుతిషు ప్రమత్తత్వాదివిశిష్టస్య గాయతః నిషిద్ధత్వ శ్రవణాత్. గానే ప్రమత్తత్వంతు అనురంజకత్వేన కాలక్రియామానాదితాయా భావవత్వేన సానునాసికత్వేన ఇత్యవధేయ మితి. విధాయికా శ్రుతిస్తు తదంగసాహిత్యవిషయకత్వేన ప్రతిపాదనపరా ఇతి వయం బ్రూమః. కుంభకర్ణమహీపతిస్తు—గాయంతం బ్రహ్మచారిణం వానప్రస్థం వా స్త్రియః కామయంతే— తస్మాత్ గాయతే బ్రహ్మచారిణే న దేయం భిక్షాన్నాదికం ఇత్యర్థః, నిషేధవిషయశ్రుతీనాం ఇత్యాహ. వయంతు— "ఈశ్వరో గీయతే యస్మిన్ తద్గానం వేద బోధితం" ఇతి వచనేన బ్రహ్మచారి వానప్రస్థ విషయకమపి. తస్మాత్ గాయతే న దేయం ఇతి శ్రుతిస్తు పూర్వోక్తదోషదుష్టాయ గానవిషయకం సాంతోషిక ముక్తాహారాది న దేయం ఇత్యర్థకతయా వ్యాఖ్యేయా ఇతి దిక్.

నను పూర్వోక్తవచనేన ఈశ్వరవిషయక మేవ గానం గేయం. నను నృపాజ్ఞయా ప్రయోక్తవ్యం ఇతి చేన్న—పూర్వోక్తవచనేన తాదృశస్య ఉత్కృష్టత్వం, అతాదృశస్య అనుత్కృష్టత్వం తత ఇత్యర్థకతయా సార్థకత్వాత్. కించ, వీణావాదన తత్వజ్ఞః ఇతి వచనేన ఏతిస్యాపి మోక్షసాధకత్వోక్తేః.

నను కిం తత్ బ్రహ్మ? యస్యాధిగమః భవద్భిః ప్రతిపద్యతే తత్రాహ—

బ్రహ్మ చ శబ్దప్రతిపన్నం సవిశేషం వేదేన ప్రతిపన్నం సవిశేషం సాకారమితి యావత్. ఆనంద మాత్రకరపాదముఖోదరాదిః ఇత్యాది వాక్యం విషయః నన్వేవం కరాది శబ్దానాం సర్వాపచ్ఛే దేన ఆనంద మయత్వ ప్రతిపాదన పరాణాం తాదృశార్థ సమర్పకత్వేన శ్రుతాస్య విషయవాక్యత్వం చేతి చేత్ తథా సత్యానందమయ ఇత్యనేనైవ చరితార్థత్వాపత్తేః. చశబ్దః అవధారణే.

నను వేదఏవ తథా ప్రతిపాదయతి "నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ" ఇత్యాది వాక్యై రితిచేత్, తత్రాహ.

## రసరూపత్వోక్తేః

బ్రహ్మ శబ్దప్రతిపన్నం సవిశేషం సకర్మకం నతు నిర్ధర్మకం, కుతః ? రసరూపత్వోక్తేః. యది నిర్ధర్మకం స్యాత్, తదా రసరూపం నస్యాత్ - రసోవై సః. రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి ఇత్యాదిశ్రుతేః. రసశ్చ శృంగారాది రితి యావత్.

స్యాదేతత్. రసస్య ఆనందపదవాచ్యత్వేన నిర్ధర్మకేపి రసరూపత్వం, అతఏవ ఏకవచనం ప్రయుక్తం శ్రుతౌ, ఇతి చేత్ - రూఢి ర్యోగ మపహరతీతి న్యాయేన తత్రైవ రూఢేః. శ్రుతౌ ఏకవచనంతు రసేషు శృంగార రసస్య అభ్యర్హితత్వాత్. రసస్య అసాధారణ ధర్మవచనంతు అగ్రే ప్రకీర్ణకాధ్యాయే ప్రతిపాదయిష్యతే. అత ఏవ "స ఇమ మే వాత్మానం ద్విధా విభజ్య అపా......

సంగీతసూత్రగ్రంథము ఇంతే దొరికింది. గాన ప్రియులు ఎవరయినా ఈ పుస్తకం సంపాదించడానికి యత్నించండి. ఈ గ్రంథవిషయంలో ఇప్పటికి తేలిన అంశ మిది.

౧. సంగీతసూత్రగ్రంథము సరస్వతీ ప్రణీతము. భరతనాట్యశాస్త్రంకంటె ప్రాచీనము. అయిదు అధ్యాయాలు.

౨. తెలుగుబ్రాహ్మణుడయిన జయగోపాలభట్టు వ్యాఖ్యాత. ఈతని తండ్రి చింతామణి దీక్షితుడు పుత్రుడు వ్రజభూషణుడు. విశ్వేశ్వరుడు గురువు.

ఈ పుస్తకం ఎట్లాగయినా ఉపలబ్ధమయితే ఒక ఉద్గ్రంథము లభించినట్లు. అముద్రితగ్రంథాలు వెదకండి. తాళగ్రంథాలయాలు చూడండి. తెలిసిన అంశమును ప్రకటించండి.

సంస్కృతరత్నాకరపత్రికలో శ్రీ మథురానాథ శాస్త్రి పైవిధంగా నివేదించారు. తెనుగులోకభావ నకు అనువదించాను.

జమ్ములమడక మాధవరామశర్మ



# విమర్శనము



## ప్రపంచ చరిత్ర

జవహర్‌లాల్ నెహ్రూ రచన; శ్రీ చింతా దీక్షితులు అనువాదం; పెరంబూరు (మద్రాసు) లోని సంస్కృతి గ్రంథమండలి ప్రచురణ; వెల ౨ రూపాయలు.

శ్రీ పండిత జవహర్లాల్ నెహ్రూ చెరసాలలో ఉన్నప్పుడు తన కుమార్తెకు లేఖా రూపకంగా ఈ ప్రపంచ చరిత్రను వ్రాయడం ప్రారంభించాడు. భారత దేశ స్వాతంత్ర్య సాధకుడు, ఆధునిక ప్రపంచ భావుక మహాశయులలో ప్రముఖుడు అయిన నెహ్రూ పండితుడు జైలు నిర్బంధంతో బాహ్య జీవితం సంకుచితము గావింపబడిన సమయంలోనైనా విస్తృత మానసిక ప్రపంచంలో విహరించే స్వాతంత్ర్యం కోలుపోలేదు. ప్రపంచచరిత్రనంతనూ సమీక్ష దృష్టితో స్మరణకు తెచ్చుకొని తన పుత్రికా రత్నంయొక్క విజ్ఞాన సంస్కృతికి దోహదంగా ఈ గ్రంథం ఆంగ్లంలో రచించి పంపుతూ వచ్చాడు. తదుపరి ఈ ఉత్కృష్ట చరిత్ర రచన పుస్తకరూపంగా ఆంగ్ల దేశంలోనూ, భారత దేశంలోనూ కూడా ప్రకాశితమయి లోకవిజ్ఞాన సాధనములైన ఉత్తమ చారిత్రక గ్రంథశ్రేణిలో అగ్రస్థానం గడించింది.

సంస్కృతి గ్రంథమండలి వారు దీనిని తెనిగింపించి ప్రకటించేందుకు అనుమతి సంపాదించి, శ్రీ చింతా దీక్షితులు గారి వంటి ప్రసిద్ధ రచయితచే వ్రాయించి, సంకల్పసిద్ధులయినారు. ఇది మొత్తం ౧౦౦౦ పేజీల గ్రంథం అవుతుంది. ప్రస్తుత ప్రచురణ మొదటి భాగం మాత్రమే. ఈ మాదిరి భాగాలు సుమారు పది కావలసివున్నట్లు తోస్తుంది. శ్రీ దీక్షితులుగారు పట్టుదలతో సంపూర్ణంగా తెలిగించడమూ, ప్రకాశకులు దీక్షతో సకాలంలో భాగాలన్నీ వరుసగా పాఠకలోకానికి అందజేయడమూ జరుగగలదని ఆశిస్తాను. ఈ గొప్పయత్నం కొనసాగిస్తున్నందుకు సంస్కృతి ప్రచురణల వారు చాలా అభినందనీయులని చెప్పక తప్పదు.

శ్రీ దీక్షితులుగారు స్వతంత్ర రచన చేసినా, భాషాంతరీకరణ చేసినా, వారి రచన స్వచ్ఛంగా, సులభంగా, స్పష్టంగా ఉంటుంది. వ్యావహారికంలో వ్రాసినా హుందాగానూ, మర్యాదగానూ నడుస్తుంది వారి శైలి. ఈ పుస్తకంలోని వారి శైలికి తమ సహజ గుణాలన్నీ ఉంటూనే మరొక అనవసరమైన గుణం చేరింది. అదేమిటంటే, గ్రాంథిక ప్రత్యయాలవలన ఏర్పడిన కృత్రిమత. ప్రకాశకుల కోరికను శిరసావహించి దీక్షితులుగారు తమ సహజ శైలి మీద ఈ కృత్రిమత యొక్క బరువు మోపివుంటారు. ఇది పాఠ్యగ్రంథంగా ఆదరణకు అర్హత సమార్జించే నిమిత్తం ఈ బలాత్కారం జరిగి వుంటుందని తోస్తుంది. మూలగ్రంథంలో జవహర్లాలుని ఆంగ్లశైలి ఇట్టి అవసరాలకు లోబడనవసరం లేకుండా స్వతంత్రంగా, సౌలభ్యంతో నడిచింది. నెహ్రూవంటి స్వాతంత్ర్యప్రియుని ఉద్గ్రంథం శ్రీ దీక్షితులుగారి వంటి స్వతంత్ర సాహితీపరులు కట్టుబాట్లకు తలొగ్గకుండా తెనిగించి, ప్రకాశకులున్నూ పూర్ణంగా పాఠకలోకపు సమాదరణపైననే ఆధారపడి ప్రచురణ చేయజాలివుంటే ఇంకా ఎంతో బాగుండేది.

ఈ గ్రంథం అన్నిభాగాలూ క్రమంగా ఆకళించుకొన్న ఆంధ్ర పాఠకలోకం — పల్లెటూరి పాఠకుడు మొదలు పట్నవాసియైన నాగరికుని వరకూ — వేద కాలంనుంచి నేటివరకు ప్రవహించిన సర్వ దేశాల చరిత్రవాహినులలోనూ అవగాహితులై, మానసిక వికాసం గడించగలరని నిస్సంకోచంగా చెప్పగలను. అట్టి అరుదైన అవకాశం కలిగిస్తున్న సంస్కృతి ప్రచురణల సంస్థవారిని తిరిగి ఆంధ్రపాఠకుల పక్షాన్ని అభినందిస్తున్నాను.

వి. రా.

**Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.**